# రోజుకో శ్లోకం

(కొన్ని సుప్రసిద్ధ సంస్కృత శ్లోకాలు, సరళ వ్యాఖ్యానంతో)

**మల్లాది హనుమంతరావు**

మూడవ ముద్రణ : 2010



డిజైన్, బుక్ మేకింగ్ : జుగాష్‌విలి, 9848266384

డిటిపి : నవ్య గ్రాఫిక్స్, హైదరాబాద్

ముద్రణ :

*ప్రతులకు*

**మల్లాది హనుమంతరావు**

401, మై హోం రెయిన్‌బో, ఆరంజ్ బ్లాక్,
టోలిచౌకీ, హైదరాబాదు - 500 008.
ఫోన్ : 99493 40236, 23569222

మరియు
రాష్ట్రంలోని అన్ని ప్రముఖ పుస్తక విక్రయశాలలు.

వెల : **రూ. 75/-**

# పాఠకులకు మనవి

'రోజుకో శ్లోకం' అనే ఈ పుస్తకం నూట పదహారు జగత్ప్రసిద్ధమయిన సంస్కృత శ్లోకాల కదంబం. వీటిలో భక్తి, జ్ఞాన, నీతి, వైరాగ్య బోధకాలయిన శ్లోకాలతో పాటు కొన్ని 'చమత్కార' శ్లోకాలూ, కొన్ని సాహిత్య సంబంధమయిన శ్లోకాలూ ఉన్నాయి. ఈ శ్లోకాలన్నింటికీ సరళమయిన తెలుగులో తాత్పర్యమూ, చిన్న వ్యాఖ్యానమూ, అవసరమయిన చోట ప్రతి పదార్థమూ ఇవ్వబడ్డాయి. ఏరి కూర్చిన శ్లోకాలు కాబట్టీ, విషయ వైవిధ్యం ఉన్నది కాబట్టీ, ఈ సమాహారం సంస్కృతభాషలో అంతో యింతో ఆసక్తి ఉన్న తెలుగు పాఠకులకు సత్కాలక్షేపం అందించగలదని ఆశ.

సంస్కృతంలో ఉన్న అద్భుతమయిన శ్లోకాలు కొన్నయినా, కొంత వివరంగా నేర్చుకొందామనుకొనే సామాన్య పాఠకులకు ఈ పుస్తకం సంస్కృత పరిచయం పెంపొందించి, ఒక చిన్న సంస్కృత శ్లోక స్వయంబోధినిగా ఉపకరించాలని కూడా ఉద్దేశించబడింది. ఇది పండితుల నుద్దేశించి చేసిన ప్రయత్నం కాదు.

వీలయితే ఈ శ్లోకాలు, క్రమం తప్పకుండా రోజుకొకటి చొప్పున నేర్చుకొని, అర్థం తెలుసుకొని, కంఠస్థం చేయగలిగితే, సుమారు నాలుగయిదు నెలల కాలంలో ఆసక్తి గల పాఠకులు 100–120 శ్లోకాల నిధిని తమ సొంతం చేసుకోవచ్చు. ఈ శ్లోకాలలో చాలాభాగం సుగమమయినవీ, బహుశా పాఠకులకు ఇంతకు ముందే కొంత పరిచితమయినవీ కనుక అలాంటి ప్రయత్నానికి అనువుగా ఉంటాయి. ఆ రకమయిన ప్రయోగానికి ఈ పుస్తకం అటు పాత తరాల పాఠకులకూ, ఇటు కొత్త తరం వారికీ ఉపయోగపడగలదని  మరో ఆశ.

మహాకవుల మహత్తరమయిన గ్రంథాలనించీ కొన్ని మచ్చు తునకలయినా మన వశం చేసుకొంటే, దానివల్ల చాలా ప్రయోజనాలు. సాహిత్య విషయంలో చక్కని అభిరుచి కలుగుతుంది. ఒక శిష్టమయిన, ఆకర్షణీయమయిన సంభాషణాశైలిని అలవరచుకొనేందుకు దోహదం కలుగుతుంది. 'కేయూరాలు వద్దూ, మణిహారాలు వద్దూ, మనిషయిన వాడికి వాక్కే భూషణం' అన్నాడు భర్తృహరి.

ఇలాంటి చక్కని శ్లోకాలూ, హృదయంగమమయిన భావాలూ మనకు వాచో విధేయమయితే, వాటిని ఎప్పుడంటే అప్పుడు యథేచ్ఛగా మననం చేసుకొని ఆహ్లాదాన్నీ, మానసోల్లాసాన్నీ పొందవచ్చు. ఏకాంతంగా ఉన్నా, ప్రయాణంలో ఉన్నా, కార్యార్థం

ఎక్కడో వేచి ఉన్నా, మనం మన మహాకవుల సాహితీ సాంగత్యం నిరంతరంగా, నిరభ్యంతరంగా, నిరాటంకంగా అనుభవించవచ్చు. ఒక సన్మిత్ర సల్లాపసౌఖ్యం ఎప్పుడంటే అప్పుడే, ఎక్కడంటే అక్కడే సాక్షాత్కరింప చేసుకోవచ్చు.

రెండు చిన్న గమనికలు. శ్లోకాల ప్రచురణలో అక్కడక్కడా అన్వయ సౌలభ్యం కోసం సంధులు విడగొట్టడం జరిగింది. అలాగే పుస్తకంలో యిచ్చిన ప్రతి పదార్థాలు స్వయంబోధకు అనువుగా యివ్వబడ్డాయి. శ్లోకాలను భాగాలుగా విభజించి, ప్రతి భాగంలో సంస్కృత పదాలకు వీలయినంత వరకూ, అదే వరసలో తెలుగు అర్థాలు ఇవ్వటం జరిగింది. (మరీ సుగమంగా ఉన్న శ్లోకాలకు అసలు ప్రతిపదార్థం యిచ్చే ప్రయత్నమే చేయలేదు.)

శ్లోకాలు కొంత సమగ్రంగా నేర్చుకోదలచిన పాఠకులు ప్రతి పుటలోనూ శ్లోకాన్ని మొదట నిదానంగా చదువుకోవాలి. వీలయినంతవరకూ అర్థం చేసుకొని, ఆ తర్వాత అన్వయం క్లిష్టంగా ఉన్న పదాల అర్థం చూసుకోవాలి. శ్లోకం సందర్భం, కవి ఎవరూ, ఏ గ్రంథంలోది యిలాంటి కొన్ని వివరాలు కూడా సంగ్రహ వ్యాఖ్యలో చూడవచ్చు. పేజీ అంతా చదివిన తర్వాత, మళ్ళీ ఒకటికి రెండుసార్లు శ్లోకం చదువుకొంటే ఈసారి శ్లోకార్థం, భావం మరికొంత స్పష్టంగా బోధపడగలవు. శ్లోకం కంఠస్థం చేసుకోగలిగితే మరీ మంచిది.

*మల్లాది హనుమంతరావు*

హైదరాబాదు
నవంబర్, 2008


**కృతజ్ఞతలు**

ఈ పుస్తకం సంకలనంలో ఎందరో మిత్రులూ, పెద్దలూ సహృదయంతో తోడ్పడ్డారు. నవ్య గ్రాఫిక్స్ వారు అందంగా 'టైప్' చేసి పెట్టారు. శ్రీ జుగాష్‌విలి పుస్తకాన్ని, ముఖచిత్రాన్ని 'డిజైన్' చేసి ముద్రణ చేయించారు. చిరకాల మిత్రులు శ్రీ యస్. వేణుగోపాల్‌గారు ఎంతో శ్రద్ధగా వ్రాతప్రతిని చదివి, తప్పులు సవరించి ఇచ్చారు. నా అభ్యర్థన అంగీకరించి డా॥ పోరంకి దక్షిణామూర్తి గారు శ్రమ తీసుకొని పుస్తకం సాంతం చదివి, చక్కని సూచనలు చేయటమేకాక, అభిమానంతో ముందుమాట వ్రాసి యిచ్చారు. వీరందరికీ నా హృదయపూర్వకమయిన కృతజ్ఞతలు.

# జ్యోతిర్మయం వాఙ్మయం

విరజాజి మొగ్గంత చిన్న దీపపు సెగ చిమ్మచీకటిలో కూడా కళ్ళకు వెలుగునిస్తుంది.

పగటి వెలుతురయినా, దీపపు వెలుగయినా పారవలసింది, భౌతిక వస్తువు కంటబడేటందుకే. ఇవి లేనప్పుడు కూడా, చెవికి సోకిన ఒక్కమాట, లోలోపలి వత్తిని వెలిగించి కంటిని మెరిపించవచ్చు. వాక్కే అప్పుడు జ్యోతిగా వెలుగొందినట్లు తెలియవస్తుంది.

వాక్కు పుట్టుక తొలిరూపం నోటి పలుకే అయినా లిపి ఏర్పడ్డమీదట లిఖిత రూపం పొందడం వల్ల దానికి నిలకడ వచ్చింది. దానివల్ల అలనాటి పెద్దల సుద్దులు, వారివారి అనుభవాలు, ఆలోచనలు, అవగాహనలు, ఏవేవో కథలూ, కల్పనలూ రకరకాల రచనా ప్రక్రియలూ – అన్నీ మనదాకా రాగలిగాయి. అవి మన కళ్ళకు వెలుగునిస్తున్నాయి; మనస్సును అలరిస్తున్నాయి; బుద్ధికి పదును పెడుతున్నాయి; హృదయభాండాన్ని నింపుతున్నాయి. నోటి పలుకూ చేతిరాతా మనస్సుకు రెండు రెక్కలుగా అమరడం నిజంగా మనిషి అదృష్టం !

నోటి పలుకు, ముందుగా మనసులోనే కోట కట్టుకొన్నది. ఆ తరువాత లిపి చిహ్నాలతో మరొక కోట కట్టుకొన్నది. ఆ కోట కొమ్ము పేరే సాహిత్యం. భాషాసాహిత్యాలు రెంటికీ ఉమ్మడి పేరే వాఙ్మయం. అది జ్యోతిర్మయం కావడం చెప్పుకోదగ్గ విశేషం. అంతరంగంలోని ఆ జ్యోతే మనసును అలరిస్తుంది; కళ్ళను మెరిపిస్తుంది.

అటువంటి జ్యోతిర్మయమయిన మన వాఙ్మయం అనేక సహస్రాబ్దులుగా ఉజ్జ్వలంగా ప్రకాశిస్తూ భారత దేశానికి గొప్ప కీర్తిప్రతిష్ఠలను చేకూర్చింది. ఉత్తమాభిరుచిని, ఉత్తమ సంస్కారాన్ని, ఉత్తమ జ్ఞానాన్ని కలిగించే సంస్కృత వాఙ్మయం భారతీయుల మహాభాగ్యసంపద. దానిలోనుంచి అద్భుత శ్లోకమణులను కొన్ని ఏరి, మల్లాది

హనుమంతరావుగారు, చక్కని సంప్రదింపు గ్రంథం కూర్చడం ఎంతో సంతోషించదగ్గ విషయం. ప్రతి ఒక్క శ్లోకానికీ అర్థమిస్తూ, ఇప్పటి కాలమాన పరిస్థితులకనుగుణంగా దాన్ని వ్యాఖ్యానిస్తూ, పరమార్థాన్ని ప్రసన్నంగా చూపిస్తూ, ప్రామాణికమయిన వివరణ తేలికగా అర్థమయ్యేటట్లుగా కూర్చినందుకు ఆయన అభినందనీయులు.

తెలుగు చదువరులు రోజుకొక్క శ్లోకం చొప్పున సులువుగా కంఠస్థం చేసుకోవచ్చు. అర్థాన్ని మననం చేసుకోవచ్చు; జ్ఞాననిధిగా పదిలపరచుకోవచ్చు, అంతరంగంలో !

అపారమయిన సంస్కృత వాఙ్మయంలో అనర్ఘరత్నాలుగా మన్ననలందుకొన్న శ్లోకాలు వేలకొద్దీ ఉన్నాయి. వాటిలో నుంచి హనుమంతరావుగారు ఎంపిక చేసినవి, ఇప్పటికి నూరుపైచిలుకు మాత్రమే అయినప్పటికీ ముందుముందు – యథావకాశంగా – మరికొన్ని సంకలన – వ్యాఖ్యాన సంపుటాలు కూర్చి మనకందించగలరని ఆశించవచ్చు. అస్తు !

'రోజుకో శ్లోకం' పేరుతో మల్లాదివారు కూర్చిన ఈ గ్రంథం, మనమందరం ఆనందంగా ఆస్వాదించదగ్గది. అందుకు పాఠకులందరినీ ఆహ్వానిస్తున్నాను.

*డా॥ పోరంకి దక్షిణామూర్తి*

07 నవంబర్ 2008

1–100, చైతన్యపురి
హైదరాబాద్ – 500 036

# గణపతి మంత్రం

**ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే**

**కవిం కవీనాముపమశ్రవస్తమం ।**

**జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత**

**ఆ నః శృణ్వన్నూతిభి స్సీద సాదనమ్॥ మహాగణపతయే నమః ॥ఓం॥**

అన్ని వైదిక కర్మలలోనూ తొలి మంత్రంగా చెప్పే ఈ గణపతి మంత్రం ఋగ్వేదం (2.23.1) లో ఉంది. యజుర్వేదంలో కూడా కనిపిస్తుంది (4.5).

**గణానాం త్వా గణపతిం హవామహే**–గణాలకు గణపతివయిన నిన్ను స్తుతిచేసి ఆహ్వానిస్తున్నాము.

**కవిం కవీనామ్, ఉపమ శ్రవః తమం**–సర్వజ్ఞులలో సర్వజ్ఞుడిని, ప్రఖ్యాతులలో శ్రేష్ఠుడిని

**జ్యేష్ఠరాజం**–అగ్రగణ్యులలో రాజువయిన వాడిని

**బ్రహ్మణాం**–వేదాలకు

**బ్రహ్మణస్పతః**–వేద నాయకుడవు

**నః శ్రుణ్వన్**–మా (మొర) విని

**ఊతిభిః సీదసాదనమ్**–సత్వరం కాపాడేందుకు

**ఆ**–వచ్చెదవు గాక!

వేదమంత్రాలు పుస్తకాల ద్వారా నేర్చుకోవటం మంచిది కాదని పెద్దలంటారు. ఈ మంత్రానికిచ్చిన అనువాదం, స్వామి జ్ఞానదానంద అనువాదాన్ని ("సస్వర వేదమంత్రాలు–టీకా తాత్పర్య వ్యాఖ్యాన సహితం" (2006)) అనుసరిస్తూ, మంత్రం పైపై అర్థాన్ని మాత్రమే చెప్తున్నది.

ఈ పుస్తకాన్ని ఈ మంత్రంతో మొదలుపెట్టిన కారణం సుస్పష్టమే.

గాణాపత్యులు పరబ్రహ్మగా భావించే శ్రీ మహాగణపతికి, శుక్లాంబరుడిగా, విష్ణువుగా, శశివర్ణుడిగా, చతుర్భుజుడిగా, అగజానన పద్మార్కుడిగా మనం నిత్యం ఆరాధించుకొనే విఘ్న నాయకుడికి విఘ్నోపశాంతి కోసం మొదట సభక్తికంగా మ్రొక్కి, ఆ భక్తవరదుడి ఆశీస్సులతో, ఆజ్ఞతో ముందుకు వెళ్ళడం సర్వులకూ, సర్వవిధాల శ్రేయోదాయకం, మంగళప్రదం.

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః!

# పరబ్రహ్మణే నమః

**దిక్కాలాద్యనవచ్ఛిన్నానంత చిన్మాత్రమూర్తయే।**
**స్వానుభూత్యేకమానాయ నమః శాంతాయ తేజసే॥**

భర్తృహరి తన నీతి శతకాన్ని ఈ ప్రార్థనతో మొదలెట్టాడు.

ఇది అన్ని రకాల దేశ కాలమాన పరిస్థితుల్లోనూ అనువయిన ప్రార్థన. అన్ని కులాలనూ, మతాలనూ, ప్రాంతాలనూ అధిగమించే ప్రార్థన. ఈ శ్లోకంలో ఒక ఇష్టదేవత ప్రస్తావన లేదు. జ్ఞానానందమయుడనీ, నిరాకారుడనీ, సత్యం–జ్ఞానం–అనంతం అనీ, ఏకం–ఏవ–అద్వితీయం అనీ ఉపనిషత్తులు చెప్పిన స్వయం ప్రకాశమయిన పరబ్రహ్మను భర్తృహరి ధ్యానిస్తున్నాడు.

భర్తృహరి సంస్కృతంలో అతి ప్రాచీన కవుల్లో ఒకడు. కొందరు ఈయన క్రీస్తు పూర్వం ఒకటో శతాబ్దం వాడనీ, విక్రమార్కుడి సమకాలికుడనీ, బహుశా అతని సోదరుడనీ అంటారు. కొందరు క్రీస్తు శకం ఏడో శతాబ్దం వాడంటారు.

భారతీయ కవులెవ్వరి విషయంలోనయినా, వాళ్లు జీవించిన కాలం గురించి భిన్నాభిప్రాయాలు, సందేహాలు తప్పవు. సందేహం లేకుండా చెప్పగలిగినదేమిటంటే పై శ్లోక రచయిత ఒక గొప్ప తత్త్వవేత్త అనీ, వేదాంతి అనీ.

**దిక్ కాల ఆది–అనవచ్ఛిన్న అనంత చిత్–మాత్ర–మూర్తయే**–దిక్కులూ, కాలమూ మొదలైన వాటిచేత పరిమితం కాని అనంతమయిన చిన్మాత్ర మూర్తికి,

**స్వ–అనుభూతి– ఏక–మానాయ–శాంతాయ–తేజసే–నమః**–అపరోక్షమయిన, సొంతమయిన అనుభూతి అనే ఒక్క సాధనం చేతనే తెలుసుకొనదగినవాడు, ప్రసన్నుడూ, స్వయంప్రకాశకుడూ అయిన పరబ్రహ్మకు నమస్కారం.

చిన్మాత్రమూర్తి అంటే కేవల జ్ఞానస్వరూపుడు.

భర్తృహరి నీతి, శృంగార, వైరాగ్య శతకాలు మూడూ మూడు అద్భుత గ్రంథాలు. అతి కొద్ది సంస్కృత పరిచయం గలవారు కూడా వ్యాఖ్యానాలూ, అనువాదాల సహాయంతో తేలికగా ఈ శతకాలు చదువుకోవచ్చు; చదువుకోవాలి అని సలహా! కేవలం పఠనానందం కలగటమే కాక జ్ఞానమూ పెరుగుతుంది, భాషాజ్ఞానమూ మెరుగవుతుంది.

ఈ పుస్తకంలో భర్తృహరి శ్లోకాలు చాలా ఉన్నాయి.

పుస్తకం ప్రారంభం కూడా ఆ మహానుభావుడి అందమయిన, అర్థవంతమయిన ప్రార్థనను స్మరించుకొంటూ చేసి కృతజ్ఞతలు తెలుపుకొందాం.

# ఉపమా కాళిదాసస్య

**వాగర్థావివ సంపృక్తౌ - వాగర్థ ప్రతిపత్తయే ।**
**జగతః పితరౌ వందే - పార్వతీ పరమేశ్వరౌ ॥**

ఇది మహాకవి కాళిదాసు వ్రాసిన 'రఘువంశం' కావ్యంలో మొట్టమొదటి శ్లోకం. కావ్యాన్ని **ఆశీః- నమస్క్రియా - వస్తు నిర్దేశాలు** (మంగళవచనం, దేవతా నమస్కారం, లేక సరాసరి, కథావస్తువు సూచనా అనే) మూడింటిలో ఒక దానితో ప్రారంభించటం సంప్రదాయం. చాలా కావ్యాలలాగే 'రఘువంశ' కావ్యాన్ని నమస్క్రియతో ఆరంభించాడు కాళిదాస మహాకవి.

**వాక్ అర్థౌ ఇవ** వాక్కూ-అర్థం లాగా, **సంపృక్తౌ** కలిసిపోయి ఉన్న, **జగతః పితరౌ** జగత్పితరులయిన, **పార్వతీ పరమేశ్వరౌ** పార్వతీపరమేశ్వరు లను, **వాగర్థ ప్రతిపత్తయే** అంటే వాక్కులూ, అర్థాల విషయమయిన జ్ఞానం పొందేందుకు, **వందే**-నమస్కరిస్తున్నాను.

ఈ శ్లోకం ప్రత్యేకత ఏమిటి? మహాకావ్యం ప్రారంభిస్తూ, మొట్టమొదటి శ్లోకం మొట్టమొదటి పాదంలోనే **వాగర్థౌ ఇవ** అంటూ అమర్చిన కౌస్తుభరత్నంలా ధగధగలాడే, లోకాతిశాయి ఉపమ. మహాకవి పార్వతీ పరమేశ్వరులను వాక్కూ-అర్థం లాగా కలిసి ఉన్న దంపతులుగా ఉపమించాడు. వాక్కూ-అర్థం కంటే సంపూర్ణంగా, శాశ్వతంగా, అవినాభావంగా కలిసిపోయే జంట మరొకటి ఉంటుందా? అర్ధ నారీశ్వర రూపంలో ఆరాధించబడే జగత్పితరులు పార్వతీ పరమేశ్వరుల ఏకత్వం కూడా అంత సంపూర్ణం, శాశ్వతం. కావ్యం మొదట్లోనే, మొదటి మాటలోనే, 'ఇంతకంటే గొప్ప ఉపమాలంకారం మీకు ప్రపంచ సాహిత్యంలో మరెక్కడయినా కనిపిస్తే చెప్పండి!' అని కవి విసిరిన సవాలులా ఉన్నదీ ఉపమ.

**పార్వతీప రమేశ్వరౌ** అని విడదీసి, పార్వతీపతీ-రమేశ్వరులని కూడా హరి, హరపరంగా కొందరు విశేషార్థం సూచిస్తారు. కానీ, అందులో మొదటి అర్థంలో ఉన్న ఔచిత్యం లేదేమో!

**ఉపమా కాళిదాసస్య - భారవేరర్థ గౌరవమ్**
**దండినః పదలాలిత్యమ్ - మాఘే సంతి త్రయో గుణాః**

(ఉపమకు కాళిదాసునూ, అర్థగౌరవానికి భారవినీ, పదలాలిత్యానికి దండినీ చెప్పుకోవాలి. మాఘకవి కవిత్వంలో ఈ మూడుగుణాలూ ఉన్నాయి) అని మాఘ కవి అభిమాని ఎవరో చెప్పిన శ్లోకం కూడా మీరు విని ఉంటారు.

# సీతమ్మ పెళ్ళి కూతురాయెనే!

**జానక్యాః కమలామలాంజలి పుటే యాః పద్మరాగాయితాః ।**
**న్యస్తాః రాఘవ మస్తకే చ విలసత్ కుంద ప్రసూనాయితాః ।**
**స్రస్తాః శ్యామల కాయకాంతి కలితాః యాః ఇంద్రనీలాయితాః ।**
**ముక్తాః తాః శుభదాః భవంతు భవతామ్ శ్రీరామవైవాహికాః ॥**

ఈ శ్లోకం విని ఉండని తెలుగు వారుండరు. వినని వాళ్ళు చూసి ఉంటారు. పెళ్ళి శుభలేఖలలో బహుశా కొన్ని కోట్లసార్లు పునర్ముద్రణ పొందిన శ్లోకం. ఇందులో ఉన్న మనోహరమయిన భావం, పెళ్ళి సందర్భాన్ని మనసుకు తెచ్చి ఆనందాన్నీ, ఆహ్లాదాన్నీ కలిగిస్తుంది.

సీతారామకల్యాణం వైభవంగా జరుగుతున్నది. తలంబ్రాల ఘట్టం. మెరిసిపోయే కొత్త ముత్యాల తలంబ్రాలు తెప్పించారు. సీతమ్మ మహదానందంతో తలంబ్రాలు రాముడి తలమీద పోస్తున్నది. ఆ తెల్లని ముత్యాల తలంబ్రాలు, ఎర్ర తామరపూవులా వెలిగే సీత దోసిట్లో ఉన్నప్పుడు ఎర్రని పద్మరాగమణుల లాగా కనిపించాయి. ఆమె వాటిని శ్రీరాముడి తలమీద ఉంచినపుడు, ఆ నల్లని జుట్టు మీద అవి తెల్లని మల్లెపూల లాగా ప్రకాశించాయి. కొంచెం జారి, ఆ నీలమేఘశ్యాముడి శరీరం మీద జాలువారినప్పుడు, ఆయన శరీరకాంతిలో కలిసి ఇంద్రనీలమణులుగా భాసించాయి. అలాంటి ముత్యాల తలంబ్రాలు మీకందరకూ శుభం కలగజేయుగాక! అంటున్నాడు కవి. 'రామకర్ణామృతమ్' లో ఈ శ్లోకం కనిపిస్తుంది (1.84).

**జానక్యాః–కమల–అమల–అంజలి–పుటే**–జానకీదేవి యొక్క తామరల వంటి నిర్మలమయిన అంజలి పుటం (దోసిలి) లో, **యాః**–ఏవయితే, **పద్మరాగాయితాః** –పద్మరాగాల్లా అయినాయో

**న్యస్తాః–రాఘవ–మస్తకే**–రాముడి తలమీద న్యస్తములయి, (ఉంచబడి)

**విలసత్–కుంద–ప్రసూనాయితాః**–ప్రకాశించే, మల్లెపూల లాగా అయినాయో

**స్రస్తాః**–జారినవై, **శ్యామల–కాయ–కాంతి–కలితాః**–నల్లని శరీరకాంతితో కలిసిపోయినవై, **యాఃఇంద్రనీలాయితాః**–ఏవయితే ఇంద్రనీలాల్లా అయినాయో, **శ్రీరామ వైవాహికాః**–శ్రీరామ వివాహ సంబంధమయిన, **తాః ముక్తాః**–ఆ ముత్యాలు, **భవతామ్**–మీకు, **శుభదాః భవంతు**–మంగళప్రదములు అగుగాక.

ఎంత చక్కని శ్లోకం! మరొక్కసారి చదివి చూద్దామా?

# కవిత్వ ధాటి

**చేటీ భవన్నిఖిల ఖేటీ, కదంబవన వాటీషు నాకి పటలీ**
**కోటీర చారుతర కోటీ మణీకిరణ కోటీ కరంబిత పదా।**
**పాటీర గంధ కుచశాటీ కవిత్వ పరిపాటీమగాధిప సుతా**
**ఘోటీ కులా దధిక ధాటీ ముదార ముఖ వీటీ రసేన తనుతాం॥**

ఇది కాళిదాసు రచించిన అంబాష్టకం స్తోత్రంలో శ్లోకం.

ఈ స్తోత్రంలో అందమయిన అనుప్రాసలు గుప్పించి, మాటలను కదనుతొక్కించాడు మహాకవి. అలాగని కవిత్వ పటుత్వానికి ఎలాంటి లోటూ కలిగించలేదు.

'పార్వతీదేవి కవిత్వ పరిపాటిని, కవితాధోరణిని యిచ్చుగాక!' అని చెప్పదల్చిన భావం.

ఎలాంటి పార్వతీదేవి?

ఒకటి, **చేటీ భవత్ నిఖిల ఖేటీ**–చెలికత్తెలుగా అయిన సమస్త దేవతాస్త్రీలు కలది.

రెండు, **కదంబ వన వాటీషు**–కదంబ వన వీధులలో, **నాకి–పటలీ–కోటీర–చారుతర–కోటీ–మణీకిరణ కోటీ–కరంబిత–పదా**–దేవతల సమూహం కిరీటాల యొక్క మనోహరమయిన అంచుల నుండీ వచ్చే కాంతి కిరణ కోటులతో ప్రకాశితమయిన పాదములు కలది. 'కరంబిత' అంటే 'సమ్మిళితమయిన' అని అర్థం.

మూడు, **పాటీర–గంధ–కుచశాటీ**–చందనపు సువాసన గల వల్లెవాటు వస్త్రం కలది

నాలుగు, **అగ–అధిప–సుతా**–పర్వత రాజపుత్రిక

అలాంటి పార్వతీదేవి, **ఘోటీ–కులాత్–అధిక–ధాటీం**–గుర్రాల జాతికంటే ఎక్కువ వేగం కల, **కవిత్వ పరిపాటీం**–కవిత్వ ధారను, **ఉదార ముఖ వీటీరసేన**–ఔదార్యం గల తన ముఖంలో తాంబూలరసం చేత, **తనుతాం**–ఇచ్చుగాక.

విశేషమేమిటంటే, ఆయన ప్రార్థించకముందే, ఆ జగన్మాత ఆయనకు అశ్వధాటిని మించిన కవిత్వధాటి ప్రసాదించి ఉన్నది. అందుకు ఈ శ్లోకమే నిదర్శనం!

శ్లోకం మరోసారి చదవండి.

# వాణి - శర్వాణి

**విపంచ్యా గాయంతీ వివిధ మపదానం పశుపతేః**
**త్వయారబ్ధే వక్తుం చలిత శిరసా సాధు వచనే ।**
**తదీయైర్మాధుర్యైః అసలపిత తంత్రీ కలరవం**
**నిజాం వీణాం వాణీ నిచుళయతి చోళేన నిభృతమ్ ॥**

ఇది శంకరాచార్యుల సౌందర్యలహరీ స్తోత్రంలో అరవయ్యారవ శ్లోకం. సౌందర్య లహరి శ్లోకాలన్నింటిలో మంత్ర తంత్ర పరాలయిన గూఢార్థాలు ఉంటాయి. సౌందర్య లహరికి ముప్ఫయ్యారు సాధికారికమయిన భాష్యాలున్నాయట. ఇక్కడ మాత్రం మనం శబ్దార్థం చెప్పుకొందాం. అదీ మనోజ్ఞమే!

సరస్వతీదేవి వీణ వాయిస్తున్నదట. శివుడి ఘనకార్యాల గురించిన పాటలు పాడుతూ వాయిస్తున్నదట. త్రిపురా విజయం గురించి పాడిందో, హాలాహల భక్షణం గురించో, అసురసంహారం గురించో, మహాశివుడి ఘనకార్యాలకు కొదవేమిటి కనక. ఎదురుగుండా పార్వతి కూర్చొని వింటున్నది. ఏదో ఒక ఘట్టంలో, పాటను మెచ్చుకొంటూ 'బలే, బలే' అనబోయిందట. పార్వతి గొంతెత్తగానే వెలువడిన తియ్యటినాదం విని సరస్వతీదేవి సిగ్గుపడిపోయి తన వీణను కట్టేసి దాని పైతొడుగు కప్పేసిందట. 'ఓ జగన్మాతా! అలాంటి మధురమయిన స్వరం నీది' అని శంకరులు స్తుతిస్తున్నారు.

**విపంచ్యా గాయంతీ వివిధం అపదానం పశుపతేః**–పశుపతి యొక్క వివిధ అపదానము (ఘనకార్యం) లను వీణతో పాడుతుండగా, **త్వయా ఆరబ్ధే వక్తుం చలిత శిరసా సాధు వచనే**–చలించుతున్న శిరసుతో సాధువచనం (బలే, బలే అనే మెచ్చుకోలు మాట) నీచేత ప్రారంభించబడగా, **త్వదీయైః మాధుర్యైః**–నీ తియ్యని మాటలచేత, **అసలపిత తంత్రీ కల రవం నిజాం వీణాం**–దాచబడిన తీగల మ్రోత గల తన వీణను, **వాణీ**–సరస్వతీదేవి, **నిభృతం**–గుట్టుగా, **చోళేన నిచుళయతి**–పై తొడుగుతో కప్పివేస్తున్నది.

సౌందర్యలహరిలో మొదటి 41 శ్లోకాలను 'ఆనందలహరి' అనీ, తర్వాతి 59 శ్లోకాలనూ 'సౌందర్యలహరి' అనీ అంటుంటారు. మొదటిభాగం మంత్ర, తంత్ర, యోగ శాస్త్ర రహస్య గర్భితంగా విరచించారట. రెండో భాగంలో శ్రీదేవీ దివ్యవిగ్రహ వర్ణన ముఖ్యవిషయం.

# శోకం-శ్లోకం

**మా నిషాద ప్రతిష్ఠాం త్వం అగమః శాశ్వతీః సమాః ।**

**యత్క్రౌంచ మిథునాదేకం అవధీః కామమోహితం ॥**

వాల్మీకి మహర్షి 'ఈ లోకంలో ధర్మజ్ఞుడూ, సత్యసంధుడూ, సకల సద్గుణవంతుడూ, వీరుడూ అయిన మహాపురుషుడెవరయినా ఉన్నాడా?' అని నారదుణ్ణి అడిగితే, ఆయన శ్రీరామకథ సంగ్రహంగా చెప్పుకొచ్చాడు. కథ పూర్తి చేసి నారదుడు వెళ్ళిపోయిన తర్వాత, వాల్మీకి ఆ కథ గురించే ఆలోచిస్తూ తమసా నదికి స్నానానికి వెళ్ళాడు. అక్కడ అన్యోన్యంగా ఉన్న క్రౌంచ పక్షుల జంటను చూశాడు. ఆయన చూస్తూండగానే ఒక కిరాతకుడు ఆ పక్షుల జంటలో మగపక్షిని బాణంతో కొట్టాడు. విలవిలలాడుతూ రక్తం ఓడుతున్న మగపక్షిని చూసి, ఆడపక్షి తట్టుకోలేక జాలిగా ఏడవసాగింది.

ఆ దృశ్యం చూస్తుంటే వాల్మీకి మహర్షికి శోకం పొంగివచ్చింది. అప్రయత్నంగా, లయసమన్వితంగా, ఛందోబద్ధంగా ఆయన నోటివెంట పై శ్లోకం వచ్చింది. శోకమే శ్లోకంగా మారింది. అదే పై శ్లోకం.

**నిషాద**-ఓ కిరాతకుడా!, **శాశ్వతీః సమాః**-అనేక సంవత్సరాలు, **త్వం ప్రతిష్ఠాం మా అగమః**-నువ్వు జీవితంలో ప్రశాంతతను పొందవు గాక! (ప్రతిష్ఠ అనే మాటకు కీర్తి అని అర్థం. మనుగడ, శాంతి, విశ్రాంతి అని కూడా అర్థాలు).

**యత్ క్రౌంచ మిథునాత్ ఏకం అవధీః కామమోహితమ్**-ఎందుకంటే, క్రౌంచ పక్షుల జంటలో ఒకదానిని చంపావు, కామావేశంలో ఉన్నదానిని.

ఇది శ్లోకానికి కిరాతుడి పరంగా అర్థం.

అప్రయత్నంగా ఈ శ్లోకానికి మరొక అర్థం గూడా అమరింది, లక్ష్మీ వల్లభుడయిన శ్రీమన్నారాయణుడి పరంగా.

**మా నిషాద**-లక్ష్మీపతి అయిన శ్రీరామా!

**ప్రతిష్ఠాం త్వం అగమః శాశ్వతీః సమాః**-అనేక వత్సరాలు నువ్వు జగద్విఖ్యాతిని పొందగలవు.

**యత్క్రౌంచ మిథునాదేకం, అవధీః కామమోహితమ్**-ఎందుకంటే రాక్షస మిథునం లో ఒకడయిన రావణుడిని, కామ మోహితుడయిన వాడిని, నువ్వు వధించావు.

ఈ అర్థంలో ఈ శ్లోకం వాల్మీకి రామాయణానికి మంగళాచరణమయిన నాందీశ్లోకంగా చెప్తారు.

# రామయ్య పెళ్ళికొడుకాయెనే

**ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ ।**
**ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా ॥**
**పతివ్రతా మహాభాగా ఛాయే వానుగతా సదా ।**
**ఇత్యుక్త్వా ప్రాక్షిపద్రాజా మంత్రపూతం జలం తదా ॥**

సీతారాముల కల్యాణోత్సవ ఘట్టమంటే ఈ దేశవాసుల హృదయం పొంగిపోతుంది!

పెళ్ళికూతురుగా, సర్వాలంకార శోభితగా ఉన్న సీతను తెచ్చి, జనకుడు అగ్ని సమక్షంలో రాముడి కెదురుగా కూర్చోబెట్టాడు. ఈ రెండు శ్లోకాలూ చెప్పాడు. ఈనాటికీ దేశంలో జరిగే పెళ్ళిళ్ళలో జనకుడి ఈ మాటలు ఎంతో భక్తితో పునశ్చరణ చేస్తారు కన్యాదాతలు. ఈ శ్లోకాలు వాల్మీకి రామాయణం బాలకాండలో కనిపిస్తాయి. (1-73-26,27)

**ఇయం సీతా, మమసుతా**–ఈమె సీత, నా కుమార్తె

**సహధర్మచరీ తవ**–నీకు సహధర్మచారిణి, ధర్మవర్తనంలో నీకు తోడు నడుస్తుంది.

**ప్రతీచ్ఛ (చ) ఏనాం**–స్వీకరించు, ఈమెను.

**పాణిం గృహ్ణీష్వ పాణినా**–(నీ) చేతితో ఆమె చెయ్యి పట్టుకో

**భద్రం తే**–నీకు శుభం (కలుగుతుంది)

**పతివ్రతా, మహాభాగా**–పతివ్రత అయిన ఈ మహాతల్లి

**ఛాయా ఇవ అను గతా, సదా**–నీడలాగా అనుసరిస్తుంది ఎల్లప్పుడూ

**ఇతి ఉక్త్వా ప్రాక్షిపత్ రాజా మంత్రపూతం జలం తదా**–ఇలా అని, జనక మహారాజు మంత్రపూతమయిన నీటిని వదిలాడు, (కన్యాదానం చేస్తూ)

సీతారాముల కల్యాణం ఈ లోకాన్నే కాదు, ముల్లోకాలనూ పులకరింపచేసే ముచ్చట. అందుకే జనకుడు కన్యాదానం చేసి సీతమ్మ చేయి, శ్రీరాముడి చేతిలో పెట్టగానే దేవతలూ, ఋషీశ్వరులు 'సాధు సాధు' అని మెచ్చుకొన్నారట. దేవదుందుభులు మ్రోగినయ్. పుష్పవర్షం కురిసింది. అప్సరసలు నృత్యాలు చేశారు. గంధర్వులు కమ్మగా పాడారు.

సీతాకళ్యాణ వైభోగమే వైభోగం, రామకల్యాణ సౌభాగ్యమే సౌభాగ్యం.

# దేవుడొక్కడే

**యంశైవాస్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాంతినః**
**బౌద్ధాః బుద్ధయితి ప్రమాణ పటవః కర్తేతి నైయాయికాః ॥**
**అర్హన్నిత్యథ జైన శాసనరతాః కర్మేతి మీమాంసకాః**
**సోయం నో విదధాతు వాంఛిత ఫలం త్రైలోక్య నాథో హరిః ॥**

ఈ శ్లోకం దామోదర మిశ్రుడు కూర్చిన 'హనుమన్నాటకం' లోది. చాలా ప్రసిద్ధ శ్లోకం. **'ఏకం సత్, విప్రాః బహుధా వదంతి'** ఒకే భగవంతుణ్ణి పలువురు పలురకాలుగా భావిస్తారనటానికి భారతదేశంలో సనాతనంగా ఉన్న వివిధ దర్శనాలే నిదర్శనాలు.

పై శ్లోకంలో, శైవులనూ, వేదాంతులనూ, బౌద్ధులనూ, నైయాయికులనూ, జైనులనూ, మీమాంసకులనూ ప్రస్తావించారు. వీళ్ళలో శైవులు శివభక్తులు. వేదాంతవేత్తలు షడ్దర్శనాల్లో ఒకటయిన ఉత్తర మీమాంస లేక వేదాంతం లేక ఉపనిషత్ బోధలు అనుసరించేవాళ్ళు. సృష్టి కారకుడు సర్వవ్యాపకుడయిన, సచ్చిదానందమయిన పరబ్రహ్మం అని నమ్ముతారు. బౌద్ధులు బుద్ధుణ్ణి పూజిస్తారు. న్యాయదర్శనంలో నిష్ణాతులయిన నైయాయికులు భగవంతుణ్ణి 'కర్త' గా భావిస్తారు. జైనులు జ్ఞాని అయిన ఈశ్వరుడిని 'అర్హత్' గా భావిస్తారు. పూర్వ మీమాంస సిద్ధాంతం నమ్మేవారికి వేదోక్త మంత్రాలూ, కర్మకాండా అనేవే దైవం.

**యం శైవాః సముపాసతే శివః యితి**–ఎవరినయితే శైవులు 'శివుడి'గా పూజిస్తారో, **బ్రహ్మ ఇతి వేదాంతినః**–'బ్రహ్మము' అని వేదాంతులు ఉపాసిస్తారో, **బౌద్ధాః బుద్ధ ఇతి**–బౌద్ధులు 'బుద్ధు'డంటారో, **ప్రమాణ పటవః నైయాయికాః కర్తా ఇతి**–ప్రమాణాల ఆధారంగా వాదించటంలో నిపుణులైన న్యాయదర్శనవేత్తలు 'కర్త' అని భావిస్తారో, **జైన శాసనరతాః అర్హత్–యితి**–జైన సిద్ధాంతంలో ఆసక్తి కలవారు 'అర్హత్' (జ్ఞాని) అని గౌరవిస్తారో, **కర్మా ఇతి మీమాంసకాః**–వేదోక్తమయిన కర్మకాండలను మించి మరో దేవుడు లేడని నమ్మే మీమాంసకులు 'కర్మ' అని అనుష్ఠిస్తారో, **సః అయం నః విదధాతు వాంఛిత ఫలం త్రైలోక్యనాథః హరిః**–అలాంటివాడైన ఈ త్రిలోకనాథుడయిన వాడు, మనందరికీ వాంఛితమయిన ఫలం ఇచ్చుగాక.

# ఆశ - నిరాశ

**'రాత్రిర్గమిష్యతి, భవిష్యతిసుప్రభాతం**

**భాస్వానుదేష్యతి హసిష్యతి పంకజశ్రీః'।**

**ఇత్థం విచింతయతి కోశగతే ద్విరేఫే**

**హా హంత హంత నళినీం గజ ఉజ్జహార ॥**

ఈ శ్లోకం జగన్నాథ పండిత రాయలు వ్రాసినది. ఈయన సంస్కృతంలో ప్రసిద్ధమయిన కావ్యాలూ, **'రస గంగాధరం'** అనే అలంకార గ్రంథం వ్రాసిన తెలుగువాడు. చిన్న రాజులను ఆశ్రయించి **'శాకాయ వా లవణాయ వా'** (కూరగాయలకో, ఉప్పుకో) పనికొచ్చే చిన్న చిన్న సంభావనలు పుచ్చుకోవడం తన స్థాయికి తగదని, నేరుగా ఢిల్లీ పాదుషాను మెప్పించి ఢిల్లీ దర్బారులో స్థానం పొందాడట.

ఒక **ద్విరేఫం** (తుమ్మెద) తామరపూవు మీద వాలింది. కాని సాయంత్రం అయిపోయి, తామరపూవు ముడుచుకుపోయే లోపల తప్పించుకోలేక పొరపాటున ఆ పూవులో ఇరుక్కుపోయింది. ఆ తుమ్మెద ఇలా అనుకొంటుంది.

**రాత్రిర్గమిష్యతి**–ఈ రాత్రి గడిచిపోతుంది, **భవిష్యతి సుప్రభాతం**–తెల్లవారుతుంది, **భాస్వాన్ ఉదేష్యతి**–సూర్యుడు ఉదయిస్తాడు, **హసిష్యతి పంకజశ్రీః**–ఈ తామరపూవు విచ్చుకొంటుంది. **ఇత్థం**–ఈ విధంగా, **కోశగతే ద్విరేఫే విచింతయతి**–పూవు లోపల ద్విరేఫం ఆలోచిస్తుండగా, **హా హంత హంత**–అయ్యో పాపం, **నళినీం**–తామరపూవును **గజః**–ఏనుగు, **ఉజ్జహార**–పీకి తీసుకెళ్ళిపోయింది!

నాలుగు పాదాల శ్లోకంలో కూడా ఓ కథ చెప్పచ్చు. ఒక చక్కని నీతిని కూడా అందులో అందించవచ్చు. ఆ కథకు ఆధునిక కథకులు చెప్పే 'కొసమెరుపు' కూడా తగిలించవచ్చు. ఆలోచనలు రేకెత్తించచ్చు. సృజనశక్తితో, చమత్కార వైచిత్రితో కవి చెయ్యలేనిదేమిటి?

పండిత రాయలు అందించిన పై శ్లోకం ఈ పనులన్నీ చేస్తున్నది. మరొక్కసారి శ్లోకమంతా చదివి, కవి ప్రజ్ఞను అభినందించుదామా?

జగన్నాథుడు 1628లో సింహాసనమెక్కిన మొగల్ పాదుషా షాజహాన్ ఆస్థానంలో ఉండేవాడట. షాజహాన్ కొడుకు దారా షుకో జగన్నాథుడి శిష్యత్వంలో మంచి సంస్కృత పాండిత్యం సంపాదించి ఉపనిషత్తులను పర్షియన్‌లోకి అనువదించాడట. షాజహాన్ మామ ఆసఫ్‌ఖాన్ పేరిట జగన్నాథుడు 'ఆసఫ విలాసం' అనే సంస్కృత కావ్యం వ్రాశాడు.

# నుడికారమే అలంకారం

**కేయూరాణి న భూషయన్తి పురుషం హారాః న చంద్రోజ్జ్వలాః**
**న స్నానం న విలేపనం న కుసుమం నాలంకృతాః మూర్ధజాః ।**
**వాణ్యేకా సమలంకరోతి పురుషం యా సంస్కృతా ధార్యతే**
**క్షీయన్తే ఖలు భూషణాని, సతతం వాగ్భూషణం భూషణం ॥**

ఈ శ్లోకం భర్తృహరి నీతి శతకం లోది (శ్లోక సంఖ్య 15)

మన అనుభవంలో కూడా ఈనాటికీ ఇది గమనిస్తూనే ఉంటాం. అందమయిన దుస్తులతోనూ, ఖరీదయిన ఆభరణాలతోనూ తమ సాటివారి గౌరవాన్ని పొందటానికి లోకులు చాలామంది ప్రయత్నిస్తూ ఉంటారు. కానీ అతి నిరాడంబరంగా ఉండి కూడా, చక్కని భాషతో మంచి విషయ పరిజ్ఞానంతో, నోరెత్తగానే నలుగుర్నీ అప్రయత్నంగా ఆకట్టుకోగలవారు కొందరు కనిపిస్తారు. అలాంటి వాళ్లకే సమాజంలో నిజమయిన పేరు ప్రతిష్ఠలూ, పలుకుబడీ ఉండటం మనం చూస్తాం. పైగా ఈ గౌరవం నాలుగు కాలాలపాటు నిలిచేది.

ముఖ్యంగా, విద్యార్థులూ, యువతీ యువకులూ ఈ సుభాషితంలో చెప్తున్న నీతి గురించి లోతుగా ఆలోచించాలి.

**పురుషం**–పురుషుడిని, **కేయూరాణి–చంద్రోజ్జ్వలాః హారాః–స్నానం–విలేపనం–అలంకృతాః మూర్ధజాః–న భూషయన్తి**–భుజకీర్తులూ, చంద్రుడిలా ప్రకాశించే హారాలూ, స్నానాలూ లేపనాలూ, కుసుమమూ, బాగా అలంకరించుకొన్న కేశాలు, **న భూషయంతి**–అలంకరించవు.

**వాణీ–ఏకా–సమలంకరోతి–పురుషం**–పురుషుడికి అలంకారంగా ఒప్పేది వాక్కు ఒక్కటే. **యా సంస్కృతా ధార్యతే**–అదీ, వ్యాకరణ దోషాలు మొదలయినవి లేకుండా ధరించబడినదయితే.

**క్షీయన్తే ఖలు భూషణాని**–సొమ్ములన్నీ క్షీణించేవే, అరిగిపోయేవే **సతతం వాక్–భూషణం భూషణం**–వాగ్భూషణం మాత్రమే ఎప్పటికీ భూషణం. 'క్షీయంతే–అఖిల–భూషణాని' అని పాఠాంతరం.

పదాల అర్థమూ, అన్వయమూ సాఫీగానే ఉన్నాయి కదా?

**భూషలుగావు మర్త్యులకు భూరిమయాంగద తారహారముల్,**
**భూషిత కేశ పాశ మృదు పుష్ప సుగంధ జలాభిషేకముల్**
**భూషలు గావు, పూరుషుని భూషితు జేయుఁబవిత్రవాణి, వా**
**గ్భూషణమే సుభూషణము భూషణముల్ నశియించు నన్నియున్**

అని ఏనుగు లక్ష్మణకవి అనువాదం. మొదటి పాదంలో 'భూరి' అంటే బంగారు. భూరిమయం అంటే స్వర్ణమయం, భూరిమయాంగదం అంటే స్వర్ణ–ఆభరణం.

# గణనా ప్రసంగం

**పురా కవీనాం గణనా ప్రసంగే – కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా ।**
**అద్యాపి తత్తుల్య కవే రభావాత్ – అనామికా సార్థవతీ బభూవ ॥**

ఈ శ్లోకం కవికులగురువు కాళిదాసు గొప్పతనాన్ని చమత్కారంగా చెబుతుంది. ఇదొక చాటు శ్లోకం.

కనిష్ఠిక అంటే చిటికెన వేలు. అనామిక అంటే దాని పక్కనే ఉండే ఉంగరం వేలు. కాళిదాసు వల్ల అనామికకు ఆ పేరు సార్థకనామం అయిపోయింది. ఎలా? వెనకటికెప్పుడో, 'కవులలో ఎవరు గొప్ప?' అని చర్చ జరిగిందట. కాళిదాసు సర్వోత్తముడని సర్వసమ్మతి కాబట్టి ఆయనకు మొదటి స్థానం యిచ్చేసి 'ఒకటీ!' అంటూ చిటికెనవేలు మడిచారు పండితులు. కాళిదాసు అధిష్ఠించేసరికి, కనిష్ఠిక 'అధిష్ఠిత కాళిదాస' అయింది. మరి ఆయన తర్వాత, ఆయనకు దాదాపు దీటుగా ఉండి రెండో స్థానం ఆక్రమించగల కవి ఎవరు? 'రెండూ!' అంటూ రెండో వేలు మడిచి లెక్కించేందుకు, కాళిదాసుకు దగ్గిరలో నిలవగల మరో మహాకవి కనబడలేదట. అనామికని అధిష్ఠించే కవిలేక, ఆ వేలుకు 'అనామిక' అన్న పేరు సార్థకంగా నిలిచిపోయిందట.

**పురా** (పూర్వం), **కవీనాం గణనా ప్రసంగే** (కవుల లెక్కింపు సందర్భంలో) **కనిష్ఠికా అధిష్ఠిత కాళిదాసా** (చిటికెనవేలు కాళిదాసాధిష్ఠితమయింది) **అద్య అపి** (ఈనాటికి కూడా) **తత్తుల్య కవేః అభావాత్** (అతనికి సమానుడయిన కవి లేకపోవటంవల్ల) **అనామికా సార్థవతీ బభూవ** (అనామిక, సార్థక నామం కలదిగా ఉండిపోయింది.

రఘువంశమ్, కుమారసంభవమ్, మేఘసందేశమ్, వంటి అద్భుతమయిన కావ్యాలతోనూ, అభిజ్ఞాన శాకుంతలమ్, విక్రమోర్వశీయమ్, మాళవికాగ్నిమిత్రమ్ లాంటి నాటకాలతోనూ సంస్కృత సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన కాళిదాసు, ప్రపంచకవులలోనే అగ్రశ్రేణిలో చేరతాడు. కాళిదాసు క్రీ.పూ. ఒకటో శతాబ్దం వాడని కొందరంటారు. కానీ పాశ్చాత్యులు మాత్రం ఆయన క్రీ.శ. అయిదో శతాబ్దంలో జీవించి ఉంటాడంటారు. కాళిదాసు మొదట ఒక వెర్రివాడనీ, విద్యాధరి అనే రాకుమారిని పెండ్లాడి, ఆమెచే పరాభవించబడి, కాళీమాతను ఆరాధించి అసమానమయిన పాండిత్యం, కవితా ప్రతిభా సంపాదించాడనీ, ఆ కారణంచేతే 'కాళిదాసు' అని ప్రసిద్ధుడయ్యాడనీ అంటారు.

కాళి వరం పొందిన తర్వాత, కాళిదాసు విద్యాధరి దగ్గరికి తిరిగి వెళితే, ఆమె **'అస్తి కశ్చిత్ వాగ్ విశేషః?'** (నీ వాక్కు ఏమన్నా కొంత మెరుగైందా లేక పూర్వంలా వెర్రివాడిగానే ఉన్నావా?) అని అడిగిందట. ఆ ప్రశ్నను కాళిదాసు ఎప్పటికీ మర్చిపోలేదట. 'అస్తి' అని మొదలెట్టి కుమారసంభవమూ, 'కశ్చిత్'తో మేఘసందేశమూ, 'వాక్'తో మొదలెట్టి రఘువంశమూ అని ముచ్చటగా ముత్యాల్లాంటి మూడు కావ్యాలు రాశాడట. ఈ కథ రకరకాలుగా చెప్పుకొంటారు.

# రససిద్ధులు

**జయన్తితే సుకృతినః రససిద్ధాః కవీశ్వరాః ।**
**నాస్తి తేషాం యశః కాయే జరా మరణజం భయమ్ ॥**

ఇది భర్తృహరి నీతి శతకంలో **విద్వత్పద్ధతి** లో శ్లోకం (శ్లోక సంఖ్య 20). మానవజాతిలో కవీశ్వరులు సర్వోత్కృష్టులు. ఎందుకంటే వాళ్ళు రసం సిద్ధింప జేసుకొన్న రససిద్ధులు. రాజులకూ, మంత్రులకూ, సామంతులకూ, ధనికులకూ, అధికారులకూ లేని ఘనత కవులకూ, కళాకారులకూ ఉంది. రాజులూ, రాజ్యాలూ కాలగమనంలో వస్తూ పోతుంటాయి. ప్రజలు ఆ రాజులనీ, మంత్రులనీ త్వరగానే మర్చిపోతారు. కానీ రససిద్ధులైన కవులు కేవలం తమ కావ్యాల వల్ల ఏర్పరచుకొన్న కీర్తి పదికాలాల పాటు నిలిచి ఉంటుంది.

**సుకృతినః**–మంచికృతులు రచించిన వారూ, **రససిద్ధాః**–నవరసాలు సిద్ధించిన మహానుభావులయిన వారూ అయిన, **తే కవీశ్వరాః**–ఆ (ప్రసిద్ధ) కవులు, **జయంతి**–సర్వోత్కృష్టులుగా ఉన్నారు. **తేషాం యశఃకాయే**–వాళ్ళ కీర్తికాయానికి, **జరామరణజం భయం నాస్తి**–జరామరణాల వల్ల కలిగే భయంలేదు. రససిద్ధి కలిగి కృతులు వ్రాసిన కవుల కీర్తికాయం చిరస్థాయిగా నిలబడుతుంది.

**సుకృతినః** అంటే మంచికృతులు రాసినవాళ్లు, సుకృతం చేసుకొన్న పుణ్యాత్ములూ అని రెండు రకాలుగా అర్థం చెప్పుకోవచ్చు. అలాగే రససిద్ధులంటే సాహిత్యపరమయిన రససిద్ధి పొందినవారు. **రసో వై సః** (రసమే పరబ్రహ్మ) అని ఉపనిషద్వాక్యం ఉంది కనక రససిద్ధులంటే బ్రహ్మత్వ సిద్ధి పొందిన యోగులు అని కూడా చెప్పొచ్చు. **కవీశ్వరాః** అంటే కవులని ఒక అర్థం, త్రికాలజ్ఞులయిన బ్రహ్మవేత్తలని కూడా మరో అర్థం.

కవులు రససిద్ధులై తమ కీర్తికాయాల ద్వారా జరామరణ భయంలేని చిరంజీవిత్వాన్ని పొందుతారని భావం. యోగీశ్వరులు బ్రహ్మత్వసిద్ధి సాధించి చిరస్థాయిగా ఉండే యశస్సు సాధిస్తారని కూడా ఈ శ్లోకంలో శ్లేష ఉన్నది.

దీనికి ఏనుగు లక్ష్మణకవి అనువాదం చూడండి.

**సుకృతాత్ములు రససిద్ధులు**
**సుకవీంద్రులు విజయనిధులు సుమ్ము, తదీయా**
**ధిక కీర్తి శరీరంబులు**
**ప్రకటజరా మరణజన్మ భయరహితమ్ముల్.**

# భక్తి అంటే

**అంకోలం నిజ బీజ సంతతిః అయస్కాంతోపలం సూచికా**
**సాధ్వీ నైజ విభుం, లతా క్షితిరుహం, సింధుస్సరిద్వల్లభమ్ ।**
**ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవింద ద్వయం**
**చేతోవృత్తి రుపేత్య తిష్ఠతి సదా సా భక్తి రిత్యుచ్యతే ॥**

భక్తి అంటే ఏమిటో సోదాహరణంగా నిర్వచించారు ఈ శ్లోకంలో. ఇది శంకరాచార్యుల శివానంద లహరీ స్తోత్రంలో అరవయ్యొకటో శ్లోకం.

నిజమయిన భక్తికి ఈ శ్లోకంలో జగద్గురువులు చాలా సారూప్యాలు చెప్పారు. చేతోవృత్తి (మనస్సు) సర్వదా పశుపతి పాదారవింద ద్వయం మీద అతి సహజంగా తగిలి ఉండిపోవటమే భక్తి. అంకోలవృక్షం (ఊడుగుచెట్టు) బీజాలు, కాయ పగిలి కింద రాలిన తర్వాత, వేరే ఎక్కడికీ వెళ్ళకుండా మళ్ళీ మూలవృక్షం వైపే పాకి దాని బెరడుకే అతుక్కుపోతాయుట. ఇదొక దృష్టాంతం. సూది అయస్కాంతానికి అప్రయత్నంగా అతుక్కుపోతుంది, ఏ ప్రేరేపణా అవసరం లేకుండా. ఇది రెండో దృష్టాంతం. పతివ్రత అయిన స్త్రీ తన భర్తను తప్ప ఇతరులను తలవనే తలవదు. తీగె చెట్టుకే అల్లుకుపోయి అలాగే ఉంటుంది. నది ఏనాటికీ సముద్రాన్ని కలవడానికే పరుగెడుతూ ప్రవహిస్తుంది. ఇవన్నీ అతి సహజంగా, మరో వికల్పం లేకుండా జరిగిపోయే ప్రాకృతిక కృత్యాలు. అలాగే భక్తుడి మనస్సు ఎటువంటి యితర ఆకర్షణలకూ లోబడకుండా నిరంతరం పరమేశ్వరుడి మీద లగ్నం అయి ఉంటే అదే అసలయిన భక్తి.

**అంకోలం, నిజబీజ సంతతిః**–ఊడుగచెట్టును, దాని విత్తనాల సమూహమూ
**అయస్కాంత ఉపలం, సూచికా**–సూదంటురాయిని సూదీ,
**సాధ్వీ, నైజ విభుం**–పతివ్రత, తన భర్తనూ
**లతా, క్షితి రుహం**–తీగె, వృక్షాన్నీ
**సింధుః సరిత్ వల్లభమ్**–నది, సముద్రుడినీ
**ప్రాప్నోతి–(ఇహ)–యథా**–ఎలా అయితే (సృష్టిలో) చేరి ఉంటాయో
**తథా**–అలాగే, **చేతోవృత్తిః**–మనః ప్రవృత్తి, **పశుపతేః పాద అరవింద ద్వయమ్**–శివుడి చరణ కమలాలు రెంటినీ

**ఉపేత్య**–ఆశ్రయించి, **తిష్ఠతి సదా**–ఎల్లప్పుడూ ఉంటే, **సా భక్తిః ఇతి ఉచ్యతే**–అది భక్తి అని చెప్పబడుతున్నది.

జ్ఞానిగా, శాస్త్ర పండితుడిగా, కవిగా, వేదాంతిగా, ఆచార్యుడిగా శంకరాచార్యుల బహుముఖ ప్రజ్ఞ శివానందలహరీ, సౌందర్యలహరీ స్తోత్రగ్రంథాల్లో స్ఫుటంగా కనిపిస్తుంది.

# యథార్థవాది - లోక విరోధి

**సులభాః పురుషాః రాజన్ సతతం ప్రియ వాదినః ।**
**అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః ॥**

ఈ సుభాషితం వాల్మీకి రామాయణంలో, సరిగ్గా ఇదే మాటల్లో, మహాకవి రెండుసార్లు చెప్పాడు. మారీచుడు, సీతను అపహరించే పిచ్చి ఆలోచన మానుకొమ్మని రావణుడికి సలహా ఇచ్చే సందర్భంలో అరణ్యకాండలో ఒకసారి (3-37-2). యుద్ధకాండలో విభీషణుడు, రావణుడికి హితబోధ చేసి, భంగపడే సందర్భంలో మరోసారి (6-16-21).

**సులభాః పురుషాః రాజన్ సతతం ప్రియవాదినః**-రాజా, ఎప్పుడూ ప్రియవచనాలే పలికే (తియ్యగా మాట్లాడే) పురుషులు తేలికగా లభిస్తారు.

**అప్రియస్య తు పథ్యస్య**-అప్రియమూ, హితమూ (అయిన విషయాల యొక్క)

**వక్తా శ్రోత చ దుర్లభః**-వక్తా దొరకడూ; శ్రోతా దొరకడూ, చెప్పేవాడూ, వినేవాడూ కూడా అతి కష్టం మీదనే లభిస్తాడు.

తియ్యటి మాటలు చెప్పి పబ్బం గడుపుకోవటానికి ప్రయత్నించేవాళ్ళూ, నొప్పించక తానొవ్వక తప్పించుకు తిరిగేవాళ్ళూ దొరకటం ఆ త్రేతాయుగం రోజులలో కూడా, ఈనాటి ప్రపంచంలో లాగే, కొంత సులభంగానే ఉండేదన్నమాట. మన మంచిని కోరి, మనకు సరయిన సలహా-అది మనకు తియ్యగా, ప్రియంగా అనిపించినా, అనిపించకపోయినా-మొహమాటమూ, మోసమూ లేకుండా చెప్పేవాళ్ళు ఆ రోజుల్లోనూ, ఈ రోజులలో లాగే అరుదు. చెప్పేవాడు ఎక్కడో ఒక్కడు దొరికినా, వినేవాళ్ళు మాత్రం ఎక్కడ? వాళ్ళూ దుర్లభులే.

"మహా పరాక్రమవంతుడూ, ధర్మవర్తనుడూ అయిన రాముడి భార్యని అపహరించి తెచ్చి, నీ యింటికి నువ్వే నిప్పుపెట్టుకొంటున్నావు, సోదరా! దీంతో నువ్వూ నీ వాళ్ళూ నాశనమయిపోతారు. అంచేత, రాముడి దగ్గరకు వెళ్ళి తప్పు ఒప్పుకుని, సీతను అప్పజెప్పి, క్షమాపణ చెప్పి రా" అని రావణుడికి విభీషణుడి సలహా. మంచిసలహా. శ్రేయోభిలాషి ఇచ్చే సలహా. కానీ, యిది రావణుడికి రుచించకపోవటంలో ఆశ్చర్యమేముంది? ఫలితం, విభీషణుణ్ణి తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టి గెంటేశాడు.

అయితే సరే, **'స్వస్తి తేస్తు, గమిష్యామి, సుఖీభవ మయా వినా,** నీకు మంచి జరుగుతుందని ఆశిద్దాం, వెళ్ళొస్తాను, నేను లేకుండా నువ్వు సుఖంగా ఉండు!' అని విభీషణుడు నేరుగా రాముడి దగ్గరకు వెళ్ళి శరణు పొందాడు.

# వదిన గారి అందెలు

**నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే।**

**నూపురేత్వభిజానామి నిత్యం పాదాభివందనాత్ ॥**

రామాయణం కిష్కింధకాండలోది ఈ శ్లోకం. చాలా ప్రసిద్ధం. (4-6-22) ఇంత అద్భుతమయిన శ్లోకం ప్రసిద్ధం కావడంలో విశేషం లేదు.

రావణుడపహరించిన సీతను వెదుకుతూ, దుర్భరమయిన విరహశోకాన్ని అనుభవిస్తున్న రాముడు కిష్కింధకు చేరి సుగ్రీవుడిని కలిశాడు. మైత్రి కుదిరింది. సుగ్రీవుడు రాముడికి సీతాదేవి ఋశ్యమూక పర్వతం మీద జారవిడిచిన నగలమూటను చూపించాడు. సీత ఉత్తరీయాన్నీ, దాన్లో మూట కట్టిన నగలను చూస్తూనే రాముడు 'హా ప్రియా!' అంటూ దుఃఖంతో కుప్పకూలిపోయాడు. తేరుకొని, ధారాపాతంగా కన్నీళ్ళు కారుస్తూ, పక్కన నిలబడ్డ లక్ష్మణుడితో, 'తమ్ముడూ, ఈ నగలు చూడు, ఈ ఉత్తరీయం చూడు. ఇవి నా సీతవే, సందేహం లేదు!" అన్నాడు.

లక్ష్మణుడు, ఆ సందర్భంలో ఈ శ్లోకం చెప్పాడు :

**న అహం జానామి కేయూరే**-నేను కేయూరాలను (భుజకీర్తులను) ఎరగను.

**న అహం జానామి కుండలే**-నేను కుండలాలను (చెవి తమ్మెలను) ఎరగను.

**నూపురే తు అభిజానామి నిత్యం పాదాభివందనాత్**-కాలి అందెలని మాత్రం గుర్తించగలను, నిత్యమూ (ఆమెకు) పాదాభివందనాలు చేసేవాణ్ణి కనక!

ఎంత ఉదాత్తమయిన వ్యక్తిత్వం, ఎంత మహోన్నతమయిన భావన!

కంటికి రెప్పలాగా అన్నగారినీ, వదినగారినీ కనిపెట్టుకుంటూ తిరిగిన ఈ మహాత్ముడు తల్లి వంటి వదినగారికి నిత్యమూ పాదాభివందనం చేయటం తప్ప, ఆమెను కన్నెత్తి చూడనేలేదు.

ఇలాంటి అద్భుతమయిన పాత్రల వల్లనే, సంస్కృతంలో మొట్టమొదటి కావ్యంగా ఏర్పడ్డ వాల్మీకి రామాయణానికి సాటిరాగల గ్రంథం మరొకటి ఈనాటికీ లేదు.

**యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే**

**తావత్ రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి** (వాల్మీకం 1-36)

"ఎంతకాలమయితే ఈ భూమి మీద పర్వతాలూ, నదులూ నిలిచిఉంటాయో, అంతవరకూ రామాయణ కథ సకల లోకాలలో నిలబడిపోతుంది" అని బ్రహ్మ వాల్మీకితో చెప్పిన మాటలలో అతిశయోక్తి లేదు.

# ఎప్పుడూ ఇంతే?

**యస్యాస్తి విత్తం స నరః కులీనః**

**స పండితః సః శ్రుతవాన్ గుణజ్ఞః ।**

**స ఏవ వక్తా స చ దర్శనీయః**

**సర్వే గుణాః కాంచన మాశ్రయంతి ॥**

**'సర్వే గుణాః కాంచన మాశ్రయంతి'** అనీ, ఒక్కొక్కప్పుడు **సర్వే జనాః కాంచన మాశ్రయంతి** అని మనం లోకోక్తిగా వింటుండే మాట పై శ్లోకం లోది. ఇది భర్తృహరి సుభాషితాలలోని నీతి శతకంలో "అర్థపద్ధతి" భాగంలో వస్తుంది (శ్లోక సంఖ్య 32).

అర్థం సులభమే. **యస్య అస్తి విత్తం సః నరః కులీనః**–ఎవడివద్ద ధనం ఉంటుదో, ఆ మనిషే కులీనుడు, **సః పండితః, సః శ్రుతవాన్, గుణజ్ఞః**–వాడే పండితుడు, వాడే శాస్త్రం తెలిసినవాడు, వాడే గుణదోషాలు తెలిసిన రసజ్ఞుడు. **స ఏవ వక్తా, స చ దర్శనీయః**–వాడే వక్త, వాడే చూడచక్కని అందగాడు. **సర్వే గుణాః కాంచన మాశ్రయంతి**–అన్ని మంచి లక్షణాలూ బంగారాన్నే ఆశ్రయిస్తాయి. ఎవరి దగ్గర సొమ్ము ఉంటే, వాడి దగ్గరే లోకులకు అన్ని సుగుణాలు కనిపిస్తాయి.

భర్తృహరి సుభాషితాల్లో విశేషం యిదే. రెండు వేల సంవత్సరాల క్రిందట ఆయన తనున్న సమాజంలో పరిస్థితులు గమనించి చెప్పిన సుభాషితాలు ఈనాటి ప్రపంచానికి కూడా చాలావరకూ వర్తిస్తాయి. లోకం పోకడ కొన్ని మౌలిక విషయాల్లో అప్పటికీ, యిప్పటికీ ఒకలాగే ఉంది. మరో రెండువేల సంవత్సరాల క్కూడా అది మారదేమో. రాజులూ, మంత్రులూ, గురువులూ, ఆచార్యులూ, సంస్కర్తలూ, మంచివాళ్ళూ, చెడ్డవాళ్ళూ పుడుతుంటారు, గిడుతుంటారు. కానీ మనిషి నైజం, లోకం పోకడ మౌలికంగా మారుతున్నట్లు లేదు. కాలం మారుతున్నది కానీ ఈ మార్పు పైపై మార్పు. కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం లాంటి లక్షణాలు మనిషిని అంటిపెట్టుకొనే ఉంటాయి. తరాలూ, శతాబ్దాలూ మారుతున్నాయి కానీ మంచి చెడూ, ధర్మం అధర్మం మధ్య సంఘర్షణ మాత్రం ఎప్పటికీ కొనసాగుతూనే ఉంటుంది.

# నాకూ తెలుసు సుమా!

**జానామి ధర్మం న చ మే ప్రవృత్తిః**
**జానామ్యధర్మం న చ మే నివృత్తిః ।**
**కేనాపి దేవేన హృది స్థితేన**
**యథా ప్రవృత్తోస్మి తథా కరోమి ॥**

"ధర్మమేమిటో నాకు తెలుసు. కానీ నేను దాన్ని అనుసరించి ప్రవర్తించలేను. అధర్మమేమిటో కూడా నాకు తెలుసు కానీ దానికి దూరంగా ఉండలేను. ఏదో నా మనసులో తిష్ఠ వేసుకొన్న దైవికమయిన (దుష్ట) శక్తి చేత ఎలా నడిపించబడితే అలా చేస్తూ ఉంటాను!"

ఈ మాటలన్నది ఎవరు?

మహాభారతంలో దుర్యోధన సార్వభౌముడు చెప్పిన మాటలివి. "ధర్మరాజు కెంత తెలుసో ధర్మాధర్మాలు నాకూ అంత తెలుసు. అయితే తేడా ఏమిటంటే అతను ధర్మం ఆచరిస్తాడు. నేను ఆచరించలేకపోతున్నాను. అధర్మం అని తెలిసి కూడా, దాన్ని ఆచరించకుండా ఉండలేకపోతున్నాను. నా బుద్ధి నా స్వాధీనంలో ఉంటే నేనూ మంచిపనులే చేస్తాను. ఏదో బలవత్తరమయిన శక్తి నన్ను అధర్మం వైపు లాగేస్తూ ఉంటే నేను మాత్రం ఏం చేయగలను చెప్పండి!" అంటున్నాడు దుర్యోధనుడు.

'ఏం చేయగలవంటే, ఆ మనసునూ, ఇంద్రియాలనూ, బుద్ధినీ కొంచెం ప్రయత్నపూర్వకంగా నిగ్రహించు. మనసుని నిగ్రహించి గెలిచిన వాడే లోకాన్ని గెలుస్తాడు.' అంటారు పెద్దలు.

ఏదయినా, దీనివల్ల గ్రహించవలసిన నీతి ఏమిటంటే ధర్మాధర్మాలు క్షుణ్ణంగా తెలిసి కూడా, దుర్యోధనుడు దుష్ప్రవర్తన మానలేక చివరికి తను సర్వనాశనమయ్యాడు, తన వారిని నాశనం చేశాడు.

దుర్యోధనుడు ఒక దుష్టశక్తి కారణంగా అస్వతంత్రుడై, అది ఎలా నడిపితే అలా నడిచి వినాశాన్ని కొని తెచ్చుకొన్నాడు. ఆ దుష్టశక్తి పేరు శకునీ, కర్ణుడూ, దుశ్శాసనుడూ కాదు. ఆ దుష్టశక్తి పేరు ఈర్ష్య, అసూయ, మాత్సర్యం. అది అతన్ని దయ్యంలా పట్టి పీడించింది.

శ్లోకంలో పదాలన్నీ సరళమయినవే. అన్వయమూ తేలికే.

# అదృష్టం

**సముద్ర మంథనే లేభే హరిర్లక్ష్మీమ్ హరః విషమ్ ।**

**భాగ్యం ఫలతి సర్వత్ర న విద్యా న చ పౌరుషమ్ ॥**

ఇది 'హితోపదేశం'లో ఉటంకించబడ్డ ఒక నీతి శ్లోకం. సముద్ర మథనంలో హరికి లక్ష్మి దొరికింది, హరుడికి విషం. ఎక్కడయినా సరే ఫలించేది అదృష్టమే గానీ విద్యగాదు, బుద్ధిగాదు, పురుషకారం కాదు.

దేవతలూ, దానవులూ కలిసి క్షీరసాగర మథనం చేశారు. వాళ్ళతో శివుడికీ, కేశవుడికీ సమానయిన పలుకుబడే ఉంది. ఇద్దరూ ఘనులే, సచ్చరిత్రులే, పరాక్రమశాలులే. ఒకరి జ్ఞానం ఎక్కువా, మరొకరిది తక్కువా కాదు.

అయితేనేం, చివరికి జరిగిందేమిటి?

సాగరమథనంలో లక్ష్మీదేవి అవతరించినప్పుడు, ఆమె విష్ణుమూర్తి పాలయింది. సిరి గలవాడయి, ఆయన వైకుంఠానికి వెళ్ళి భోగభాగ్యాలన్నీ హాయిగా అనుభవించాడు.

మరి పరమశివుడి అదృష్టం ఎలా ఉంది? కాలకూటవిషం పుట్టుకొచ్చినప్పుడు, దాన్ని ఆయన తాగాల్సి వచ్చింది. గొంతు మండిపోయి, కాలి మచ్చపడ్డా, ఆ కాకోల విషాన్ని కక్కటానికీ లేదూ, మింగటానికీ లేదు.

శివుడు చేయని పురుష ప్రయత్నమేమిటీ, కేశవుడు చేసిందేమిటి? అందుకే పురుషప్రయత్నం ఒకటే అయినా, అదెలా ఉన్నా చివరికి ఫలించేది అదృష్టమే.

లక్ష్మీదేవిని తీసుకొని, ఎంచక్కా వైకుంఠపురం వెళ్ళిపోతూ, విష్ణుమూర్తి శివుడితో అన్నాడట: "చేసుకొన్నవారికి చేసుకొన్నంత మహాదేవా!" అని.

'హితోపదేశం' కథలలో చాలాచోట్ల పురుష ప్రయత్నాన్ని కొంత తక్కువ చేసి, విధి విలాసానికీ, అదృష్టానికీ, కాల వైపరీత్యానికీ పెద్దపీట వేసినట్టు కనిపిస్తుంది. అది ఒక రకమయిన నిరాశావాదమా? ఎంత ఘనమయిన పురుషప్రయత్నంచేసి, రొమ్ము విరుచుకొన్నా, ఫలితం పొందడం, పొందకపోవడం దైవనిర్ణయప్రకారం మాత్రం జరుగుతుందని అనుభవం నేర్పిన పాఠమా? ఎవరి అనుభవం దృష్ట్యా వాళ్ళు నిర్ణయించాల్సిన విషయం!

అక్కడక్కడా దీనికి విరుద్ధంగా **'ఉద్యోగినం పురుషసింహముపైతి లక్ష్మీః దైవేన దేయ మితి కా పురుషాః వదంతి'** (గట్టి ప్రయత్నం చేసే పురుషసింహుడినే విజయలక్ష్మి వరిస్తుంది. కార్యసిద్ధి దేవుడివ్వాల్సిందేనని చెప్పేది కాపురుషులు) లాంటి శ్లోకాలూ కనిపిస్తాయి.

# సాధన

**వాక్యార్థశ్చ విచార్యతామ్, శ్రుతి శిరః పక్షః సమాశ్రీయతామ్;**
**దుస్తర్కాత్ సువిరమ్యతామ్, శ్రుతిమతః తర్కోనుసంధీయతామ్ ।**
**బ్రహ్మోస్మీతి విభావ్యతా మహరహో, గర్వః పరిత్యజ్యతామ్**
**దేహేహమ్మతిరుజ్ఝ్యతామ్, బుధజనైః వాదః పరిత్యజ్యతామ్ ॥**

ఇదీ ఆదిశంకరుల శ్లోకమే. సంస్కృత సాహిత్యంలో ప్రసిద్ధ శ్లోకాలలో దాదాపు సగం శంకరాచార్యుల విరచితమే. ఇదొక విశేషం. అందుకే ఆ మహానుభావుణ్ణి శంకరుడి అపరావతారంగా భావిస్తుంటారు.

పై శ్లోకం శంకరుడు చెప్పిన 'సాధనాపంచకం' లోది. శంకరాచార్యులు ముప్ఫై రెండు సంవత్సరాలకే అవతార సమాప్తి చేశారన్న విషయం మనందరికీ తెలుసు. అవసానదశలో ఆయన చుట్టూ చేరిన శిష్యులు 'ఆచార్యా, మీరు వెళ్ళిపోతున్నారు. ఇక ముందు మేం ఏం చేయాలో తోచడం లేదు. మీరే మీ చివరి సందేశాన్ని ప్రసాదించాలి' అని ప్రార్థించారు. అప్పుడు ఆయన చెప్పిన అయిదు శ్లోకాలు 'సాధనా పంచకం' గా చెప్పుకొంటారు. దైవానుగ్రహం వల్ల మనిషి జన్మా, మోక్ష కాంక్షా, సద్గురు సాంగత్యం సంపాదించుకొన్న అదృష్టవంతులందరూ ఈ సాధనలు చేసుకోవటమే జీవితధ్యేయంగా పాటించి, ధన్యులవాలని జగద్గురువుల ఉపదేశం.

**వాక్యార్థః చ విచార్యతామ్**–ఉపనిషత్తులలో నాలుగు మహావాక్యాల అర్థం లోతుగా ఆలోచించండి (అయమాత్మా బ్రహ్మ, ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మోస్మి, తత్త్వమసి), **శ్రుతి శిరః పెక్షః సమాశ్రీయతామ్**–వేద అంతములయిన ఉపనిషత్తుల సిద్ధాంతము లను, బోధనలను అవలంబించండి, **దుస్తర్కాత్ సువిరమ్యతామ్**–కు తర్కానికి దూరంగా ఉండండి, **శ్రుతి మతః తర్కః అనుసంధీయతామ్**–శాస్త్ర విద్వాంసుల తర్కం అనుసరించండి. **బ్రహ్మ అస్మి యితి విభావ్యతామ్**–నేనే పరబ్రహ్మాన్ని అని భావించండి, **అహరహః**–ఎప్పుడూ, **గర్వః పరిత్యజ్యతామ్**–గర్వం వదిలివేయండి, **దేహే అహంమతిః ఉజ్ఝ్యతామ్**–శరీరంలో అహం (నేను, నాది భావన) అనే భావన మానండి. **బుధజనైః వాదః పరిత్యజ్యతామ్**–జ్ఞానులతో వాదించటం మానండి.

తాత్పర్యం స్పష్టమే.

వితండవాదం వల్ల కాలయాపన తప్ప ప్రయోజనం లేదని ఈ ఒక్క శ్లోకంలోనే మూడుసార్లు సూచించారు, గమనించారా? **'దుస్తర్కాత్ సువిరమ్యతామ్'**–నువ్వు కుతర్కాలు కట్టిపెట్టు అనీ, **'శ్రుతిమతః తర్కః అనుసంధీయతామ్'**–శాస్త్ర విద్వాంసుల తర్కధోరణిని అవలంబించండి అనీ, **'బుధ జనైః వాదః పరిత్యజ్యతామ్'**–జ్ఞానులతో వాదించటం మానండి. ఏ విషయం నేర్చుకోదలిచినా, ఈ సూత్రాలు గుర్తుంచుకోవటం మంచిది.

# ధిక్

**యాం చింతయామి సతతం మయి సా విరక్తా**
**సాప్యన్యమిచ్ఛతి జనం, స జనోన్యసక్తః ।**
**అస్మత్కృతే చ పరితుష్యతి కాచిదన్యా**
**ధిక్ తాంచ, తంచ, మదనం చ, ఇమాంచ, మాంచ ॥**

పై శ్లోకాన్ని భర్తృహరి రాశాడంటారు. భర్తృహరి ఉజ్జయినీ రాజవంశీయుడు. ఒకసారి ఒక బ్రాహ్మణుడు తనకు సూర్యుడి ప్రసాదంగా లభించిన ఒక పండు భర్తృహరికి కానుకగా యిచ్చాడట. అది ఆయన తన భార్యకు యివ్వగా, ఆమె దానిని తన ప్రియుడికి ఇచ్చిందనీ, అతను దాన్ని తన మరో ప్రియురాలికి యిచ్చాడని, ఈ విషయం తెలుసుకొన్న భర్తృహరికి ప్రపంచం మీదనే విరక్తి కలిగి రాజ్యం వదిలేసి వానప్రస్థంలోకి వెళ్ళిపోయాడని ఒక ఐతిహ్యం. ఆ సందర్భంలో పై శ్లోకం చెప్పాడని ప్రతీతి. అయితే ఈ కథకు సరయిన ఆధారాల్లేవు.

నేను ఎవరిని ఎప్పుడూ తలచుకొంటూ ఉంటానో, ఆమెకి నామీద ప్రేమలేదు. ఆమెకి మరొకడి మీద మోజు. ఆ మరొకడు ఇంకొక స్త్రీని ప్రేమిస్తున్నాడు. పాపం నా వల్ల కూడా సంతోషపడే ఆవిడ వేరొకతె ఉంది. ఛీ! ఏమి ప్రపంచం! ఆమె, అతను, ఈ మన్మథుడు, ఈమె, నేనూ అందరమూ ఛీ కొట్టించుకోవాల్సిన వాళ్ళమే! అందరమూ అందని పళ్ళకోసం అర్రులు చాచేవాళ్ళమే.

**యాం**–ఎవతె గూర్చి, **చింతయామి సతతం**–ఎప్పుడూ ఆలోచిస్తూ ఉంటానో, **మయి సా విరక్తా** – నాపట్ల ఆమె అనురక్త కాదు (అంటే అనురాగం లేనిది).

**సా–అపి–అన్యం–ఇచ్ఛతి–జనం**–ఆమె కూడా మరొక మనిషిని ఇష్టపడుతున్నది.

**సః–జనః–అన్యసక్తః**–ఆ మనిషి వేరొక స్త్రీ యందు ఆసక్తి గలవాడు.

**అస్మత్ కృతే–చ–పరితుష్యతి–కాచిత్–అన్యా**–నా వల్ల ఆనందం పొందే మరొక స్త్రీ ఉన్నది.

**ధిక్ తాం–చ–తం–చ–మదనం–చ–ఇమాం–చ–మాం–చ** – ఛీ, ఆమె; ఛీ, వాడు; ఛీ, ఈ మన్మథుడు; ఛీ ఈమె; ఛీ నేనూ!

మొదటి మూడు పాదాలలో లోకరీతి చెప్పి చివరిపాదంలో మాటలచేత ఆటలాడించాడు ఈ చాటు శ్లోక కవి.

# రుద్రాయ నమః

**ఆపాతాళ నభ స్థలాంత భువన బ్రహ్మాండ మావిస్ఫురత్**
**జ్యోతిః స్ఫాటిక లింగ మౌళి విలసత్ పూర్ణేందు వాంతామృతైః ।**
**అస్తోకాప్లుతమేక మీశ మనిశం రుద్రాను వాకాన్ జపన్**
**ధ్యాయే దీప్సిత సిద్ధయే ధ్రువపదం విప్రోభిషించే చ్ఛివమ్ ॥**

ఇది రోజూ శివపూజలో, రుద్రాభిషేక సమయంలో చదివే ప్రార్థన శ్లోకం.

**ఆపాతాళ నభస్థల అంత భువన బ్రహ్మాండమ్ ఆవిస్ఫురత్**–పాతాళం నించీ ఆకాశం దాకా మధ్యలో ఉన్న భువనాలనూ బ్రహ్మాండాన్ని ప్రకాశింపచేసే,

**జ్యోతిః స్ఫాటిక లింగ మౌళి విలసత్ పూర్ణేందు వాంత అమృతైః**–జ్యోతిర్మయమయిన స్ఫటిక లింగము యొక్క తలభాగంలో ప్రకాశించే చంద్రుడి నించీ వెలువడే అమృతధారలతో,

**అస్తోక ఆప్లుతమ్**–పూర్తిగా మునిగినవాడిని,

**ఏకం ఈశం**–ఒకే ఒక్కడైన ఈశ్వరుణ్ణి, **అనిశం**–ఎప్పుడూ,

**రుద్ర అనువాకాన్ జపన్**–రుద్రమంత్రాలు చదువుతూ,

**ధ్యాయేత్**–ధ్యానము చేయవలెను,

**ఈప్సితసిద్ధయే**–కోరికలు నెరవేరటానికి,

**ధ్రువపదం శివం విప్రః అభిషించేత్**–శాశ్వతమయిన శివుణ్ణి విప్రుడు అభిషేకించాలి.

ఆద్యంతాలు లేని శివుణ్ణి ఆద్యంతాలు లేని స్ఫటిక లింగంగా పూజించటం ఉచితం. స్ఫటిక లింగం పరబ్రహ్మలాగా రంగులేనిది, మచ్చలేనిది, స్వచ్ఛమయినదీ, శుద్ధమయినదీ. ఎలాంటి గుణాలు లేని నిర్గుణుడు, నిష్కళంకుడు అయిన పరమాత్మకు అది సరయిన ప్రతీక.

**బ్రహ్మాండమ్ ఆవిస్ఫురత్**–అంటే బ్రహ్మాండాన్ని ఆవిర్భవింపచేసే స్ఫటికలింగం అనీ అర్థం చెప్పారు కొందరు.

**బ్రహ్మాండమ్ ఆవిస్ఫురత్**– అంటే బ్రహ్మాండాన్ని ఒక ఆభాసగా ('అపియరెన్స్'గా) తలపింపజేయడం, అని కూడా కొందరు అర్థం చెప్పారు.

జాగ్రత్తగా శ్లోకం మరోసారి చదువుకొంటే బాగుంటుంది.

# భోజ(న) రాజీయం

**భోజనం దేహి రాజేంద్ర**

**ఘృత సూప సమన్వితం ।**

**మాహిషం చ శరచ్చంద్ర**

**చంద్రికా ధవళం దధి ॥**

భోజరాజు గారి ధారానగరానికి విదేశం నించీ ఇద్దరు బ్రాహ్మణులు వచ్చారు. భోజుడి ఔదార్యం, దానగుణం గురించి విని ఉన్నారు కనుక ఎలాగో రాజదర్శనం చేస్తే తృణమో, పణమో దానం లభించక పోదనుకున్నారు. అయితే రాజుగారికి కవులంటే, కవిత్వమంటే చాలా యిష్టమనీ, కవిత్వం ఏమయినా వినిపించగలిగితే మంచి దక్షిణ దొరుకుతుందనీ ఎవరో వాళ్ళకు సలహా చెప్పారు.

ఈ బ్రాహ్మణులకు పాపం భోజన పరాక్రమమే తప్ప కవిత్వం చెప్పగల శక్తి లేదు. అయినా, అలాగే ఒక శ్లోకం రచించటం మొదలుపెట్టారు. జంటకవులు రెండురోజులు తంటాలుపడితే శ్లోకం సగం పూర్తయింది.

**భోజనం దేహి రాజేంద్ర, ఘృత సూప సమన్వితం**–రాజా, భోజనం పెట్టు, నెయ్యి, ముద్దపప్పుతో సహా!

ఎంత కష్టపడ్డా మిగతా సగం రాయలేకపోయారు. ఒక ఉపాయం ఆలోచించారు. కాళిదాస మహాకవి రాజమందిరానికి వెళుతుంటే ఆయన్ని పట్టుకొన్నారు "బాబ్బాబు! ఈ ఒక్క శ్లోకం ఎలా పూర్తి చేయాలో చెప్పి పుణ్యం కట్టుకొమ్మ"ని ప్రాధేయపడ్డారు.

ఆయన జాలిపడి, నడుస్తూనే మిగిలిన రెండు పాదాలూ చెప్పి వెళ్ళిపోయాడు.

**మాహిషం చ శరచ్చంద్ర చంద్రికా ధవళం దధి** – (నెయ్యి, పప్పుతో పాటు), శరత్కాల చంద్రుడి వెన్నెలంత తెల్లనయిన పెరుగు కూడా దయ చేయించండి అని ఒక ఉపమాలంకారం తగిలించి మరీ వెళ్ళాడు.

ఉత్సాహంగా ఆ శ్లోకం పట్టుకొని రాజుగారి దగ్గరికి వెళితే, ఆ ఉపమే వాళ్ళ కొంప ముంచింది. 'మొదటి రెండు పాదాలు రాసిన వాళ్ళు, తరువాతి రెండు పాదాలు రాయలేదని స్పష్టంగా తెలుస్తున్నది. ఈ శ్లోక చౌర్యం ఎక్కడ చేశారో చెప్పం'డని రాజు బ్రాహ్మణులను నిలదీశాడు. తెల్లమొగాలు వేసిన బ్రాహ్మలను చూసి, మళ్ళీ జాలిపడి కాళిదాసే రాజుకు సర్దిచెప్పి, వాళ్ళకు కొంత దక్షిణ యిప్పించి పంపాడు.

# తస్మాత్ జాగ్రత్త

**దౌర్మంత్ర్యాత్ నృపతిర్వినశ్యతి, యతిస్సంగాత్, సుతోలాలనాత్**
**విప్రో నధ్యయనాత్, కులం కుతనయాత్, శీలం ఖలోపాసనాత్ ।**
**హ్రీర్మద్యాత్, అనవేక్షణాదపి కృషిః స్నేహః ప్రవాసాశ్రయాత్**
**మైత్రీ చాప్రణయాత్, సమృద్ధి రనయాత్, ద్యూతాత్ప్రమాదాద్ధనం ॥**

ఏ కారణాల వల్ల ఎవరెవరు లోకంలో సాధారణంగా చెడిపోతూ ఉంటారో చెప్తున్నాడు భర్తృహరి 'నీతిశతకం'లో అర్థపద్ధతిలోని ఈ శ్లోకంలో (శ్లోకసంఖ్య 33)

**దౌర్మంత్ర్యాత్ నృపతిః వినశ్యతి**–దౌర్మంత్ర్యం అంటే పనికిమాలిన మంత్రి చెడు సలహాలు; వాటివల్ల రాజు నష్టపోతాడు.

**సంగాత్ యతిః**–కామక్రోధాది దుర్గుణాల వల్ల, దుర్జనులతో సంపర్కం వల్ల యోగి

**సుతః లాలనాత్**–పుత్రుడు గారాబం వల్ల

**విప్రః అనధ్యయనాత్**–బ్రాహ్మణుడు వేదాధ్యయనం చెయ్యకపోవటం వల్ల

**కులం కుతనయాత్**–దుర్మార్గుడయిన కొడుకు వల్ల వంశం

**శీలం ఖల–ఉపాసనాత్**–శీలము, దుష్టుడి దగ్గర కొలువు చేయటం వల్ల

**హ్రీః మద్యాత్**–సిగ్గు అనేది మద్యపానం వల్ల

**అనవేక్షణాత్ అపి కృషిః**–పర్యవేక్షణ లేకపోవటం వల్ల వ్యవసాయం

**స్నేహః ప్రవాసాశ్రయాత్**–(కుటుంబ సభ్యులతో) స్నేహము ఇల్లువిడిచి దేశాంతరంలో ప్రవాసం వెళ్ళటం చేత

**మైత్రీ చ అప్రణయాత్**–మైత్రి, అనురాగం లేకపోవటం వల్ల

**సమృద్ధిః అనయాత్**–సంపద అవినీతి వల్లా

**ద్యూతాత్, ప్రమాదాత్, ధనం**–జూదమాడడం వల్లా, అశ్రద్ధ వల్లా ధనమూ నష్టమవుతాయ్.

ఏనుగు లక్ష్మణ కవి గారి అనువాదం:

మ. **యతి సంగంబున, బాలుఁడాదరముచే, జ్యా భర్త దుర్మంత్రిచే**
**శ్రుతిహీనిన్ ద్విజుఁడ, స్వయంబు ఖలుచేఁ, గ్రూరాప్తిచే శీల, ము**
**ద్ధతిచే మిత్రత, చూపులేమిఁ గృషి, మద్యప్రాప్తిచే సిగ్గు, దు**
**ర్మతిచే సంపదలున్ నశించుఁ, జెడు నర్థంబుల్ ప్రమాదంబునన్.**

# గంగా - గౌరీ

**'అంబా కుప్యతి, తాత! మూర్ధ్ని విలసత్ గంగేయ ముత్సృజ్యతామ్!'**
**'విద్వన్ షణ్ముఖ! కా గతిః మయి చిరాదస్యాః స్థితాయాః వద!'**
**కోపావేశ వశాదశేష వదనైః ప్రత్యుత్తరం దత్తవాన్**
**'అంభోధిః! జలధిః! పయోధి! రుదధిః! వారాన్నిధి! ర్వారిధిః!'**

చమత్కార శ్లోకం యిది. ఇందులో సంభాషణ ఉన్నది. ఎవరి సంభాషణ? మీరే చిత్తగించండి.

**అంబాకుప్యతి, తాత! మూర్ధ్ని విలసత్ గంగా ఇయం ఉత్సృజ్యతామ్**–అమ్మకు కోపం వస్తున్నది నాన్నా! నీ నెత్తిమీద ప్రకాశిస్తున్న ఈ గంగను వదిలేయాల్సిందే!" ఈ మాట అనేదెవరు?

నెత్తిమీద గంగనుపెట్టుకొన్నవాడు శివుడు కనక, ఆయన్ని 'నాన్నా' అని సంబోధిస్తున్నాడు కనక శివకుమారుడు ఈ మాటన్నాడు. ఏ శివకుమారుడు? వినాయకుడా, షణ్ముఖుడా? జవాబు వింటే తెలుస్తుంది. వినండి రెండోపాదం.

**విద్వన్ షణ్ముఖ! కాగతిః మయి చిరాత్ అస్యాః స్థితాయాః వద?**–పండితుడవయిన షణ్ముఖా! నా యందు చిరకాలంగా ఉంటూ వచ్చిన ఆమెకు వేరే గతి ఏమిటి, నువ్వే చెప్పు?

ఇది తండ్రీ కొడుకుల సంభాషణ అనీ, వాళ్ళు కుటుంబ కలహం గురించి తీవ్రంగా చర్చిస్తున్నారనీ తెలుస్తున్నది కదా? మరి శివుడి ప్రశ్నకు జవాబేమిటి? ఇది ఒక్కడి నుంచీ కాదు, కోపావేశంతో ఆరు ముఖాలనుంచీ ఆరు మాటలుగా వచ్చింది. **కోపావేశ వశాత్ అశేష వదనైః ప్రత్యుత్తరం దత్తవాన్** (ఇవ్వబడింది). ఏమిటి ప్రత్యుత్తరం? **'అంభోధిః! జలధిః! పయోధిః! ఉదధిః! వారాన్నిధిః! వారిధిః!'** ఆరు ముఖాలూ ఆరు మాటలు చెప్పాయి. కానీ అన్నింటికీ అర్థం ఒకటే, సముద్రం. మా అమ్మని యిబ్బంది పెట్టే సవతి, ఏ బంగాళాఖాతంలో దూకితే మాకేమిటి? ఆమె సమస్యలతో మాకు సంబంధం లేదు, అని షణ్ముఖుడు కోపంగా అంటున్నాడు.

గంగానదికి మరి సరిద్వల్లభుడయిన సముద్రుడే గదా గతి!

ఇప్పుడు శ్లోకం మరోసారి చదవండి. అందులో చమత్కారం మళ్ళీ ఆస్వాదించండి.

# మన్మథుడు

**ధనుః పౌష్పం, మౌర్వీ మధుకరమయీ, పంచవిశిఖాః**
**వసంతో సామంతః, మలయ మరుదాయోధన రథః ।**
**తథాప్యేకః సర్వం, హిమగిరి సుతే! కామపి కృపాం**
**అపాంగాత్తే లబ్ధ్వా జగదిదమనంగో విజయతే ॥**

శంకరాచార్యుల సౌందర్యలహరి స్తోత్రంలో ఆరో శ్లోకం.

ఈ చరాచర జగత్తులో ప్రతి ప్రాణినీ, మైమరపించి, ఒక ఆట ఆడించే ఒక చిత్రమైన, బలవత్తరమయిన శక్తి మన్మథుడిది. అతని బాణాలకు ఎప్పుడో ఒకప్పుడు పడిపోని వీరుడు పధ్నాలుగు లోకాల్లో ఎవడూ ఉండడు.

కానీ ప్రపంచాన్నంతా జయించగల ఈ మదనుడి ఆయుధాలూ, సాధనాలూ ఏమిటి?

**ధనుః పౌష్పం**–విల్లు పుష్పధనుస్సు.

**మౌర్వీ మధుకరమయీ**–దాని అల్లెతాడు తుమ్మెదల బారు.

**పంచ విశిఖాః**–అయిదే బాణాలు.

**వసంతో సామంతః**–వసంత ఋతువు ఒక్కటే (అతన్ని యుద్ధంలో సమర్థించే) సామంతుడు.

**మలయ మరుత్ ఆయోధన రథః**–యుద్ధభూమిలో తిరిగేందుకు రథం మలయమారుతం. ఒట్టి గాలి!

**తథాపి**–అయినా, **హిమగిరి సుతే!**–నగ రాజ కుమారివయిన తల్లీ!

**కామ్ అపి కృపాం అపాంగాత్ తే లబ్ధ్వా**–ఏదో కొంత కృపను నీ ఓరచూపు నించీ అందుకొని

**జగత్ యిదం సర్వం**–ఈ జగత్తు నంతా

**అనంగః ఏకః విజయతే**–మన్మథుడొక్కడే గెలుస్తాడు.

తల్లీ! మన్మథుడి అమోఘమయిన శక్తికి కారణం అతని సొంత గొప్పదనమూ కాదు. ఆయుధాల ఆడంబరమూకాదు. సామంతుల సమర్థనా కాదు. అతడు జగత్తునంతా గెలవగలగటానికి కారణం, నీ క్రీగంటి చూపు నుంచీ లభించే కించిత్తు కృప మాత్రమే!

సౌందర్యలహరి స్తోత్రంలో ఒక్కొక్క శ్లోకానికి ఒక్కొక్క చక్రం ఉంది. ఆ చక్రాలకు బీజాక్షరాలు ఉన్నాయి. ఆయా చక్రాలు రేకుల మీద చెక్కించి, యథావిధిగా పూజలు చేస్తే, అనేక విధాలయిన కోరికలు తీరతాయని చెప్తారు.

# భజ గోవిందం

**భజగోవిందం భజగోవిందం, గోవిందం భజ మూఢమతే ।**
**సంప్రాప్తే సన్నిహితే కాలే, నహి నహి రక్షతి డు కృఞ్కరణే ॥**
**అర్థమనర్థం భావయ నిత్యం, నాస్తి తతః సుఖలేశః సత్యమ్ ।**
**పుత్రాదపి ధన భాజాం భీతిః, సర్వత్రైషా విహితా రీతిః ॥**
**కా తే కాంతా కస్తే పుత్రః, సంసారోయ మతీవ విచిత్రః ।**
**కస్య త్వం కః కుతః ఆయాతః, తత్త్వం చింతయ యదిదం భ్రాతః ॥**
**యావద్విత్తో పార్జన సక్తః, తావన్నిజ పరివారోరక్తః ।**
**పశ్చాజ్జీవతి జర్జర దేహే, వార్తాం కోపి న పృచ్ఛతి గేహే ॥**

'భజగోవిందం' శ్లోకాలు శంకరులు రాసినవని కొందరంటారు. కొందరు కాదంటారు, కానీ రాసిందెవరయినా సులభశైలిలో సామాన్యుల కోసం, మందాధికారుల కోసం రాయబడ్డవి ఈ శ్లోకాలు. చాలా సుగమంగా ఉన్నాయి కనుక ఈ పుటలో ఒకటికి నాలుగు శ్లోకాలు చూసేయవచ్చు!

**భజగోవిందం మూఢమతే**–ఓరి మూర్ఖుడా! గోవిందుణ్ణి భజించు, **సంప్రాప్తే సన్నిహితేకాలే, నహి నహి రక్షతి డుకృఞ్ కరణే**–కాలుడు వచ్చి మీద పడ్డప్పుడు 'డుకృఞ్ కరణే' (లాంటి వ్యాకరణ సూత్రాల మీద వాదులాట)లు **నహి నహి రక్షతి**–రక్షించవు సుమా!

**అర్థమనర్థం భావయ నిత్యం**–సొమ్ము అనర్థదాయకమనే నిత్యమూ భావించు.

**నాస్తి తతః సుఖలేశః సత్యం**–అందులో సుఖలేశమన్నా లేదనేది నిజం.

**పుత్రాదపి ధనభాజాం భీతిః**–ధనవంతులకు పుత్రుడి వల్ల కూడా భయమే.

**సర్వత్ర ఏషా విహితారీతిః**–సర్వత్రా ఇదే చెప్పబడిన పద్ధతి.

**కా తే కాంతా, కః తే పుత్రః**–నీ భార్య ఎవరూ, నీ పుత్రుడెవరు?

**సంసారః అయం అతి ఇవ విచిత్రః**–ఈ సంసారం మిక్కిలి విచిత్రమయినది.

**కస్య త్వం**–నువ్వు ఎవరివాడివి?, **కః**–ఎవరివి? **కుతః ఆయాతః**–ఎక్కడినించీ వచ్చావు?

**తత్త్వం చింతయ యత్ ఇదం భ్రాతః**–ఈ తత్త్వం ఆలోచించు, తమ్ముడూ!

**యావత్ విత్త ఉపార్జన సక్తః తావత్ నిజ పరివారో రక్తః**–ఎంతవరకూ సొమ్ము సంపాదించడంలో ఆసక్తి కలిగి ఉంటాడో, అంతవరకే తన కుటుంబానికి తన యందు రక్తీ, అనురాగం

**పశ్చాత్ జీవతి జర్జర దేహే, వార్తాం కోపి న పృచ్ఛతి గేహే**–ఆ తర్వాత జీర్ణమయిన శరీరంతో బతుకుతాడు. ఇంట్లో ఎవరూ కుశలప్రశ్నలు కూడా అడగరు.

# ధర్మమే సర్వం

**ధర్మాదర్థః ప్రభవతి ధర్మాత్ ప్రభవతే సుఖమ్ ।**
**ధర్మేణ లభతే సర్వం ధర్మ సార మిదం జగత్ ॥**

"ధర్మం వల్ల సంపదలు లభిస్తయ్. ధర్మం వల్ల సుఖం లభిస్తుంది. ధర్మంచేత సర్వమూ లభిస్తుంది. ఈ జగత్తుకు ఆధారమే ధర్మం''. మన యితిహాసాలన్నీ చెప్పదలచేది ఈ నీతే.

ఈ నీతిని ఈ మాటల్లో ఆదికవి వాల్మీకి అరణ్యకాండలో సీతాదేవి చేత చెప్పించారు (3.9.30). శ్లోకానికి అర్థం, తాత్పర్యం అవసరం లేదు, సులభం. కానీ, సందర్భం గురించి రెండు ముక్కలు చెప్పుకోవచ్చు.

సీతారామలక్ష్మణులు వనవాసంలో దండకారణ్యం వైపుగా నడుస్తుంటే సీత అన్నది: 'ఆర్యపుత్రా! ఇలా దండకారణ్యానికి చేరడం నాకు తృప్తిగా లేదు. **(నహి మే రోచతే వీర! గమనం దండకాన్ ప్రతి)** కారణం తెలుసా? నువ్వు ఋషులను బాధించే రాక్షసులను చంపుతానని ప్రతిజ్ఞ పూనావు. దండకలో రాక్షసులతో నీకు ఏ వైరమూ లేదు. అలాంటివారిని నువ్వు చంపటం యుక్తమేనా? అసలు వనవాస దీక్షలో ఉన్న నీకు ఆయుధాలెందుకు? దీక్ష ముగిసి అయోధ్య చేరిన తర్వాత మళ్ళీ క్షత్రియధర్మాలు అనుసరించవచ్చు. ఈ అడవుల్లో ఉన్నన్నాళ్ళు వనధర్మాన్నీ, మునివృత్తినీ ఆచరించు. సుఖం వల్ల సుఖంరాదు **(నసుఖాత్ లభ్యతే సుఖమ్),** ధర్మం వల్ల సుఖం వస్తుంది'. అని ఆపైన 'ఇవన్నీ నీకు తెలియనివి కావు. **'ధర్మం చ వక్తుం తవ కః సమర్థః** నీకు ధర్మం చెప్పగల సమర్థులెవరు? **'విచార్య బుద్ధ్యాతు సహానుజేన యత్ రోచతే, తత్కురు**–నీ సోదరుడితో కలిసి బాగా ఆలోచించి ఎలా తోస్తే అలా చెయ్యి!' అంది.

సీత రాముడితో ఆ సందర్భంలో అన్న మాటలలో పై శ్లోకం ఉంది.

మరి రాముడి జవాబు? 'ఇక్కడి మునులు రక్షణ కోసం నన్నాశ్రయించారు. నన్నాశ్రయించిన ఋషులకు రాక్షసులు విరోధులు కాబట్టి వాళ్ళు నాకు శత్రువులే. మునులను కాపాడతానని ప్రతిజ్ఞ చేశాను. మాట తప్పేది లేదు. నాకు ఎల్లప్పుడూ సత్యమే ఇష్టం. **'సత్యం ఇష్టం హి మే సదా'** నేను జీవితాన్నయినా, నిన్నయినా, లక్ష్మణుడి నయినా వదిలిపెడతాను కానీ ఇచ్చిన మాట తప్పలేను. **'అపి అహం జీవితం జహ్యాం, త్వా వా సీతే సలక్ష్మణామ్, న తు ప్రతిజ్ఞాం'** అన్నాడు.

రామాయణంలో ధర్మం గురించి యిలాంటి చర్చలు కొన్ని వందలు, వేలు! రామాయణం మనమంతా ఆసాంతమూ చదివి తీరాలి.

'ధర్మమే సర్వము' అన్న ఆ రోజుల్నించి 'సర్వమూ ధర్మమే' అనే ఈ రోజులకు ఎంత దూరం?

# భుక్తి ప్రదం

**వాగ్వైఖరీ, శబ్దఝరీ, శాస్త్ర వ్యాఖ్యాన కౌశలమ్ ।**
**వైదుష్యం విదుషాం తద్వత్, భుక్తయే న తు ముక్తయే ॥**

**వాగ్వైఖరీ**–అనర్గళమయిన ఉపన్యాస ధోరణి, **శబ్దఝరీ**–మాటల ప్రవాహం, **శాస్త్ర వ్యాఖ్యాన కౌశలమ్**–శాస్త్రాలు వ్యాఖ్యానించటంలో నేర్పు, **తద్వత్**–అలాగే, **విదుషాం వైదుష్యం**–విద్వాంసుల విద్వత్తూ, **భుక్తయే**–భుక్తి కోసమే, **న తు ముక్తయే**–ముక్తి కోసం మాత్రం కాదు. శంకరుల 'వివేక చూడామణి'లో శ్లోకం ఇది.

ఎంతో పాండిత్యమూ, అనర్గళమయిన వాగ్ధాటి, వేదశాస్త్ర విజ్ఞానం, వ్యాఖ్యాన కౌశలమూ ఇవన్నీ మోక్ష సాధనలో పనికివచ్చే విషయాలు కావు. ఏ రాజాదరణకో, పండితసభలలో సత్కారాలకో, దక్షిణలూ, బహుమతులూ, ఉద్యోగాలూ గట్రా సంపాదించుకొని సొమ్ము గడించటానికో మాత్రమే పనికివస్తయ్.

కారణమేమంటే జ్ఞానసిద్ధి అనేది నిరంతర సాధన చేత అనుభవించవలసిన అనుభూతి. అది మాటలతో చెప్పేది, చెప్పటానికి వీలయినదీ కాదు. దానికి మాటలతో వ్యాఖ్యానాలతో పనిలేదు. దాన్ని గురించి మాటలతో చెప్పగలిగింది ఇంతవరకే. చెరుకు రసంలో తీపికీ, ద్రాక్షరసంలో తీపికీ మధ్య గల తేడా ఎన్ని మాటలలో ఎంత విశదపరచితే అర్థమయ్యే విషయం? ఎటొచ్చీ పాండిత్యం వల్ల అహంభావం పెరిగే ప్రమాదం ఉంది. 'నేనూ నా పాండిత్యం' అన్న రంధిలో, దాన్ని ప్రదర్శించాలన్న కండూతితో, 'నేనే ఈ దేహమూ, ఈ నామరూపాలు' అనే భావం త్యజించటం మరింత కష్టమవచ్చు. మోక్షం కోరే సాధకుడికి అలాంటి పాండిత్యం ఉన్నదాని కంటే లేకపోతేనే నయం.

లౌకిక పాండిత్యాన్ని గర్హించటం ఆచార్యుల వారి ఉద్దేశ్యం కాదు. ఈ పాండిత్యానికీ, బ్రహ్మజ్ఞానానికీ ఏ సంబంధమూ లేదని మాత్రమే నొక్కి చెబుతున్నారు. ఏ వేదమూ పఠించని సాలెపురుగుకూ, ఏ శాస్త్రాలూ ఎరగని పాముకూ, ఏ మంత్రాలూ తెలియని తిన్నడికీ మోక్షం ఎలా లభించింది?

**'పఠంతు శాస్త్రాణి యజన్తు దేవాన్, కుర్వన్తు కర్మాణి భజన్తు దేవతాః, ఆత్మైక్య బోధేన వినా విముక్తిః న సిధ్యతి బ్రహ్మ శతాంతరేపి' (వివేకచూడామణి,6)** శాస్త్రాలుచదివితే చదువుతారు గాక, దేవతల నుద్దేశించి యజ్ఞాలు చేస్తే చేస్తారు గాక, వైదిక కర్మలతో ముక్కోటి దేవుళ్ళను సేవించితే సేవించుతారు గాక. వీటన్నిటివల్లా నూరు బ్రహ్మ కల్పాలకు కూడా మోక్షం సిద్ధించదు. ఆత్మజ్ఞానం లేకుండా ముక్తిరాదు.

# భ్రష్ట కష్టాలు

**'భిక్షో! మాంస నిషేవణం కిముచితం?' 'కిం తేన మద్యం వినా?'**
**'మద్యం చాపి తవ ప్రియం?' 'ప్రియమహో వారాంగనాభిస్సహ!'**
**'వారస్త్రీ రతయే కుతస్తవ ధనం?' 'ద్యూతేన చౌర్యేణ వా!'**
**'చౌర్య ద్యూత పరిశ్రమోపి భవతాం?' 'భ్రష్టస్య కా వా గతిః?'**

ఓసారి భోజరాజుకు ఒక విపరీతమయిన కోరిక కలిగిందట. 'నేను చచ్చిపోయిన తర్వాత కాళిదాసు నన్ను మెచ్చుకొంటూ చెప్పే శ్లోకాలు వినాలి' అని. ఇదెలా సాధ్యమవుతుంది? ఆయన కాళిదాసుని పిలిచి, 'నేను చనిపోయినట్లు ఊహించి, నామీద నాలుగు శ్లోకాలు చెప్ప'మన్నాడు. ససేమిరా అలా చేయలేనన్నాడు కాళిదాసు. 'రాజాజ్ఞని ఉల్లంఘిస్తే భ్రష్టుడి వవుతావు. భ్రష్టుడికి రాజ్య బహిష్కారమే గదా శిక్షా?' అని రాజు కవిరాజును కవ్వించాడు. కాళిదాసుకు కోపం వచ్చి వెంటనే దేశం వదిలి వెళ్ళిపోయాడు. రాజు అతన్ని ఆపలేకపోయాడు. కానీ కాళిదాసు లేకుండా భోజుడు బతకలేడు. గిలగిలలాడి పోయాడు. కాళిదాసు దేశం పొలిమేర అవతల ఓ గ్రామంలో సన్న్యాసి వేషంలో తిరుగుతున్నాడని తెలిసి, రాజు మారువేషంలో ఆ గ్రామానికి వెళ్ళాడు. ఒకచోట ఒక సన్న్యాసి కసాయి దుకాణానికి వెళ్ళి మాంసం బేరం చేయటం చూశాడు.

**'భిక్షో, మాంస నిషేవణం కిముచితం?'**–సన్న్యాసీ, నీకు మాంసభక్షణం తగునా? అన్నాడు రాజు. **'కిం తేన మద్యం వినా?'**–నిజమే, మద్యం లేకుండా మాంసంతో ఏం లాభం? అన్నాడు సన్న్యాసి. **'మద్యం చ అపి తవ ప్రియమ్?'**–నీకు మద్యం కూడా యిష్టమా? **'ప్రియమహో వారాంగనాభిః సహ'**–వేశ్యలతో ఉన్నప్పుడు, నాకు మద్యపానం యిష్టం!

**'వారస్త్రీ రతయే కుతః తవ ధనమ్?'**–వేశ్యలను కలవటానికి నీకు డబ్బెలా వస్తుంది? **'ద్యూతేన చౌర్యేణ వా'**–జూదం ఆడో, దొంగతనం వల్లో! **'చౌర్య ద్యూత పరిశ్రమః అపి భవతాం?'**–తమకు జూదం, చౌర్యం లాంటి కార్యకలాపాలు కూడానా? అంటే సన్న్యాసి, **'భ్రష్టస్య కా వా గతిః?'** భ్రష్టుడికి మరి వేరే గతి ఏముంది? అని జవాబిచ్చాడు. 'భ్రష్టుడిని' అనగానే కాళిదాసును, భోజుడు గుర్తించాడు. బ్రతిమాలి తనతో మళ్ళీ ధారానగరానికి తీసుకెళ్ళాడు.

# ఒకే మాట

**మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనామ్ ।**

**మనస్యన్యత్ వచస్యన్యత్ కర్మణ్యన్యత్ దురాత్మనామ్ ॥**

దుర్మార్గుడికీ, సజ్జనుడికీ తేడా ఏమిటి అనే విషయం ఈ శ్లోకంలో కుండబద్దలు కొట్టినట్టూ చెప్పారు. ఇదొక ప్రసిద్ధమయిన చాటు శ్లోకం.

**మనసి ఏకం, వచసి ఏకం, కర్మణ్యేకం మహాత్మనాం**–మహాత్ములయిన వాళ్ళు మనసులో అనుకొన్నమాటే చెప్తారు. చెప్పినమాటే చేస్తారు. మనసులోనూ ఒకటే, మాటలోనూ ఒకటే, చేతలోనూ ఒకటే – ఇది మహాత్ముల లక్షణం.

**మనసి అన్యత్ వచసి అన్యత్ కర్మణి అన్యత్ దురాత్మనాం**–మనసులో అనుకొనేది వేరు, మాటల్లో చెప్పేది వేరు, చేతల్లో చేసి చూపేది వేరు – ఇది దురాత్ముల లక్షణం.

"నా జీవితమే నా సందేశం" అన్నాడు గాంధీ మహాత్ముడు.

"నేను చెప్పింది చెయ్యి, నేను చేసింది మాత్రం చెయ్యక" అంటారు లోకంలో చాలామంది.

లోకంలో మహాత్ములు అరుదు కదా?

ఈ సందర్భంలో మరో ముఖ్యమైన శ్లోకం గుర్తుకొస్తుంది. వెనకటికి ఓ రాజుగారు ఓ పండితుణ్ణి పెట్టుకొని పురాణాలూ, యితిహాసాలూ, ధర్మశాస్త్రాలూ కొన్ని సంవత్సరాల తరబడి చెప్పించుకొని విన్నాడట. రాజుగారికి పాపం వ్యాపకాలు ఎక్కువ, గ్రహణశక్తి తక్కువ. ఓరోజు పండితుడితో 'గురువుగారూ, రోజూ మీరిన్ని ధర్మాలూ, శాస్త్రాలూ చెప్తున్నారు. నాకు నిన్న విన్నది యివాళ గుర్తుండటం లేదు. అందుకని యిన్ని విషయాలు చెప్పి మీరు శ్రమపడి నన్ను శ్రమపెట్టే బదులు, ఏదో సూక్ష్మంగా ఈ ధర్మశాస్త్రాల సారం బోధిస్తే అంతవరకు గుర్తుంచుకొంటాను.' అన్నాడట.

'అయితే వినండి. కోటి ధర్మ గ్రంథాల సారమంతా ఒక్క అర్థశ్లోకంలో చెబుతాను. పరోపకారం చేస్తే పుణ్యం, పరపీడన చేస్తే పాపం. ఇదొక్కటి గుర్తుంచుకోండి చాలు!' అని ఈ క్రింది శ్లోకం చెప్పాడు పండితుడు.

**శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః ।**

**పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్ ॥**

# మౌని గురువు

**మౌన వ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వం యువానం**
**వర్షిష్ఠాంతేవసదృషి గణైః ఆవృతం బ్రహ్మ నిష్ఠైః ।**
**ఆచార్యేంద్రం కర కలిత చిన్ముద్ర మానందమూర్తిం**
**స్వాత్మారామం ముదిత వదనం దక్షిణామూర్తి మీడే ॥**

శ్రీ శంకరుల దక్షిణామూర్తి స్తోత్రం ఆచార్యుల వారు రాసిన అత్యుత్కృష్టమయిన స్తోత్రాల్లో ఒకటి. పరమేశ్వరుణ్ణి జగద్గురు రూపంలో స్తుతించే ఈ స్తోత్రం నిత్యం పారాయణం చెయ్యదగ్గది. పై శ్లోకం ఆ స్తోత్రంలో ఆఖరి శ్లోకం.

**మౌన వ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వం**–మౌన వ్యాఖ్యానంతోనే పరబ్రహ్మ తత్త్వాన్ని ప్రకటిస్తున్న (శ్రీ దక్షిణమూర్తికి నమస్కారం)

శ్రీ దక్షిణామూర్తి అందరు గురువులలాగా శిష్యులకు మాటలతో పాఠం చెప్పడు. మౌనమే ఆయన ప్రవచనం, పాఠం. (**గురోస్తు మౌనం వ్యాఖ్యానం, శిష్యాస్తు ఛిన్న సంశయాః**–గురువు గారి మౌన వ్యాఖ్యానంతోనే శిష్యుల సందేహాలన్నీ పటాపంచలవుతాయి, అని ఈ స్తోత్రంలోనే మరో శ్లోకంలో చెప్పారు)

**యువానం**–యువకుని (ఈ గురువుగారు వయోవృద్ధుడు కాడు. జ్ఞానవృద్ధుడు మాత్రమే.)

**వర్షిష్ఠ–అంతే వసత్–ఋషిగణైః–ఆవృతం–బ్రహ్మనిష్ఠైః**–వయసు మళ్ళిన, శిష్యరికం చేస్తున్న, బ్రహ్మనిష్ఠులయిన, ఋషిగణముల, చేత చుట్టుముట్టబడినవాడిని

**ఆచార్యేంద్రం**–గురుశ్రేష్ఠుని

**కరకలిత చిన్ముద్రం**–చేతిలో ధరించిన చిన్ముద్ర కలవాడిని

**ఆనందమూర్తిం**–మూర్తీభవించిన సచ్చిదానంద స్వరూపుని

**స్వాత్మారామం**–తన ఆత్మజ్ఞానంలోనే ఆనందిస్తూ ఉండేవాడిని (ఆత్మ యందు ఆరామం పొందేవాడు. ఆత్మా–రాముడు కాదు, ఆత్మా–ఆరాముడు)

**దక్షిణామూర్తిం**–శ్రీదక్షిణామూర్తి స్వామిని

**ఈడే**–స్తుతిస్తున్నాను.

# దీపశిఖా కాళిదాసీయం

**సంచారిణీ దీపశిఖేవ రాత్రౌ**
**యం యం వ్యతీయాయ పతింవరా సా ।**
**నరేంద్ర మార్గాట్ట ఇవ ప్రపేదే**
**వివర్ణ భావం స స భూమిపాలః ॥**

ఈ శ్లోకం కాళిదాసు **'రఘువంశం'** కావ్యంలోది (6.67). ఇందుమతీ స్వయంవర ఘట్టంలోది. ఇందుమతి అజమహారాజును స్వయంవరంలో వరించుకొంటుంది. అజుడు రఘు మహారాజు కొడుకు. ఇందుమతి విదర్భ రాజకుమారి. ఉత్తరోత్తరా ఈ దంపతులకు దశరథుడు పుడతాడు.

**సంచారిణీ దీపశిఖేవ** అన్న ఈ ఉపమ, (మూడో పేజీలో అనుకొన్న **వాగర్థావివ** ఉపమలాగే), రసజ్ఞులను ఎంత ముగ్ధుల్ని చేసిందంటే, ఇప్పటికీ కాళిదాస మహాకవిని **దీపశిఖా కాళిదాసు** గా ప్రస్తావిస్తుంటారు.

స్వయంవరంలో వరమాల చేతిలో తీసుకొని, బారులుగా కూర్చొన్న రాజులను దాటుకొంటూ వెళుతున్న ఇందుమతి సంచారిణీ దీపశిఖలాగా ఉన్నదట.

రాత్రిపూట చీకట్లో, ఒక పెట్రోమాక్సు దీపంతో నగరంలో రాజమార్గంలో ఒకడు నడుస్తూ ఉంటే, వాడు దగ్గరికి వచ్చినకొద్దీ ఒక్కోభవనం ఆ వెలుగులో వెలుగుతూ కనిపిస్తుంది. వాడు దాటిపోగానే, ఆ భవనం మళ్ళీ చీకట్లో కలిసిపోతుంది, దాని తర్వాతి భవనం వెలుగులోకి వస్తుంది.

దీపశిఖలాంటి ఇందుమతి ఒక్కొక్కరాజును సమీపించగానే, ఆమె కాంతి వల్లా, ఆమె తమనే వరిస్తుందన్న ఆశ వల్లా ఆయా రాజుల ముఖాలు వెలిగిపోతున్నాయి. వాళ్ళను వరించకుండా ఆమె సాగిపోగానే, వాళ్ళ ముఖాలు కళతప్పి, నల్లబడిపోతున్నాయి. ఆ వరసలో తరువాతి రాజుల ముఖాలు వెలుగుతున్నాయి.

**సంచారిణీ దీప శిఖా ఇవ రాత్రౌ**–రాత్రివేళ కదులుతున్న దీపశిఖ లాగా, **యం యం వ్యతీయాయ పతింవరా సా**–పతిని వరించబోయే ఆ ఇందుమతి ఎవరెవర్ని దాటిపోయిందో, **స స భూమిపాలః వివర్ణ భావం ప్రపేదే**–ఆయా రాజు, కాంతిహీనత పొందాడు, **నరేంద్ర మార్గ అట్ట ఇవ**–రాజమార్గంలో మేడలలాగా.

రఘువంశ కావ్యంలో కాళిదాసు దిలీప మహారాజు నుండీ అగ్నివర్ణుడి వరకూ రాజ్యం చేసిన రఘువంశ రాజుల వృత్తాంతం రచించాడు. సంస్కృతం చదివే విద్యార్థులంతా తప్పక చదవాల్సిన పంచకావ్యాలలో రఘువంశం ముఖ్యమయినది. మొదటిది.

# మృత్యుంజయ మంత్రం

**త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టి వర్ధనం ।**

**ఉర్వారుక మివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ మా అమృతాత్ ॥**

ఇది శుక్ల యజుర్వేద మంత్రం. శైవులు రుద్రాభిషేకంలో చెప్పుకొంటారు. వైష్ణవులు పాంచరాత్ర దీక్షలో దీన్ని హోమ భస్మధారణ మంత్రంగా చదువుకొంటారు. నీళ్ళు లేకుండా విభూతి రాసుకొనేటప్పుడు కూడా ఈ మంత్రం చదువుతారు. దీన్ని త్ర్యంబక మంత్రం అంటారు. ఇది మృత్యుంజయ మంత్రం కూడా. వేదమంత్రం కాబట్టి శైవులకూ, వైష్ణవులకు, మాధ్వులకూ అందరికీ ప్రామాణికమయిన మంత్రం.

**త్ర్యంబకం యజామహే**–మూడుకళ్ళ దేవుడిని పూజిస్తున్నాను, **సుగంధిం, పుష్టివర్ధనం**–సువాసన కలిగి, పుష్టిని పెంపొందించగల (ముక్కంటిని).

ప్రార్థన ఏమిటి? **ఉర్వారుకం ఇవ బంధనాత్ మృత్యోః ముక్షీయ**–దోసపండు తొడిమ నుంచి వేరయినట్టు, మృత్యువు నుండీ వేరయిపోదాం, **మా అమృతాత్**–మోక్షం నించీ కాదు.

దోసపండు పండి, తొడిమనుంచీ వేరయి తీగ పక్కన పడిపోతే, అది ఎప్పుడు, ఎలా, ఎక్కడినించీ వేరయిందో కూడా చెప్పలేనంత సులభంగా, సహజంగా జరుగుతుందట. అంత సులభమయిన బంధవిముక్తి మనిషికి కలిగితే అదే ఉర్వారుక మోక్షం. దోసతీగె అక్కడే ఉంది, ఎప్పుడు వేరయిందో తెలియకుండా వేరయిన దోసపండూ అక్కడే ఉంది. అలాగే సంసారమూ ఇక్కడే ఉంది. ముక్తుడయిన జీవుడూ యిక్కడే ఉన్నాడు. ఆ రెండింటి బంధం మాత్రం అనాయాసంగా తెగిపోయింది. మృత్యువును జయించటమంటే అది. కాకిలాగా నూరేళ్ళు బతకటం కాదు. అదే ఉర్వారుక మోక్షం. దాన్నిమ్మని ఈశ్వరుడికి ఈ ప్రార్థన.

దుఃఖిస్తూ, కోటి చింతలతో ప్రాణత్యాగం చేస్తే అది మృత్యువు. దాని తరవాత మరోజన్మ తప్పదు. నిశ్చింతగా, ఆనందంగా, బుద్ధిపూర్వకంగా తనకూ శరీరానికి సంబంధం అశాశ్వతమని ఎరిగి, శరీర త్యాగం చేస్తే అది **అమృతం,** మోక్షం. ఆ అమృతాన్ని ప్రసాదించమని ఈ మంత్రంలో ప్రార్థన.

ఈ మంత్రం స్మరిస్తుంటే ప్రమాదాలూ, అకాలమరణాలు తప్పుతాయని ఒక నమ్మకం.

# పరిపూర్ణం

**ఓం పూర్ణ మదః పూర్ణమిదం**
**పూర్ణాత్పూర్ణ ముదచ్యతే ।**
**పూర్ణస్య పూర్ణ మాదాయ**
**పూర్ణమేవావశిష్యతే ॥**

ఇది ఈశావాస్య, బృహదారణ్యకోపనిషత్తుల్లో శాంతిమంత్రం.

**పూర్ణం అదః**–అది (పరబ్రహ్మము) పూర్ణము, అనంతమూ, అవధి లేనిది, ఎల్లలులేనిది.

**పూర్ణం ఇదం**–ఇది (ఈ దృశ్యమాన జగత్తు) కూడా పూర్ణమూ, అనంతమే, ఎల్లలు లేనిదే.

**పూర్ణాత్ పూర్ణం ఉదచ్యతే**–మొదటి పూర్ణం నించి రెండో పూర్ణం ఉదయిస్తుంది లేక వ్యక్తమవుతుంది.

**పూర్ణస్య పూర్ణం ఆదాయ**–ఒక అనంతమైన బ్రహ్మానికి అనంతమయిన జగత్తు కలిపినా (లేక తీసివేసినా)

**పూర్ణమేవావశ్యిష్యతే**–అనంతమే మిగులుతుంది

బ్రహ్మం నించే జగత్తు ఆవిర్భవించినా, దానివల్ల బ్రహ్మం తాలూకూ పూర్ణత్వానికి ఏ లోటూ రాదు.

పారమార్థిక సత్యం, వ్యావహారిక సత్యం వేరుగా ఉంటాయి. మనచే చూడబడి మన అనుభవంలోకి వచ్చే ప్రపంచం, దాని లక్షణాలూ వ్యావహారిక సత్యాలు. పారమార్థిక సత్యం సర్వవ్యాపి అయిన పరమాత్మ స్వరూపం. అన్ని భ్రాంతులూ, మాయలూ, ఆభాసలూ కరిగిపోగా మిగిలిపోయే నిత్యసత్యం పారమార్థిక సత్యం. 'తదేకః అవశిష్టః శివః కేవలోహం!" (ఆ మిగిలిన ఒక్కటీ అయిన శివుణ్ణి నేను) అన్నది పారమార్థిక సత్యం. 'పూర్ణ మదః పూర్ణమిదం' అనేది కూడా పారమార్థిక సత్యం. పూర్ణం నించీ, పూర్ణం తీసివేసినా కూడినా, ఆ అఖండమయిన, అనంత మయిన, నిత్యమయిన పూర్ణం, పూర్ణంగానే మిగులుతుంది. అనంతమూ, శూన్యమూ మిగిలిన వ్యావహారిక సంఖ్యల సంకలన, విభజన సూత్రాలనూ ధర్మాలనూ పాటించవు.

"బ్రహ్మం అనంతం, అద్వితీయం. జగత్తు మిథ్య లేక మాయ వల్ల ఏర్పడ్డది. బ్రహ్మం అనే అనంతాన్ని, మాయతో విభజించడానికి వీలులేదు. అనంతమయిన సంఖ్యను సున్నాతో విభజిస్తే వచ్చేది అనంతమే అని గణితసిద్ధాంతం కదా!" అని వ్యాఖ్యానించారు పై శ్లోకం మీద కంచి జగద్గురువులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి.

# ‘స్వామీ’ – ‘ఏమీ?’ – ‘యామి’

**కావ్యం కరోమి, నహి చారుతరం కరోమి**
**యత్నాత్ కరోమి యది, చారుతరం కరోమి ।**
**భూపాలమౌళి మణిరంజిత పాదపీఠ**
**హే సాహసాంక! కవయామి, వయామి, యామి ॥**

ఈ శ్లోకం భోజరాజు గురించినది. బల్లాలసేనుడు రచించినట్లు చెప్పబడే ‘భోజ ప్రబంధం’ లోది.

భోజరాజు సాహిత్య పోషకుడనీ, కవిత్వమంటే చెవి కోసుకొనేవాడని ప్రతీతి. ఆయన ముఖం చూస్తే, ఎవరికయినా దానంతటదే కవిత్వం వచ్చేదట. ఆయన రాజధాని ధారానగరం. ఆ నగరంలో ప్రజలంతా కవులే.

ఒకానొక సందర్భంలో భోజుడు కవి కానివాడు తన రాజధానిలో ఉండటానికి వీల్లేదని, ఒక శాసనం చేశాడట. కవిత్వం చెప్పలేని పౌరులెవరయినా ఊళ్ళో మిగిలిఉంటే, వాళ్ళను తన దర్బారుకు తీసుకురమ్మని రాజుగారు తన భటుల్ని ఆదేశించాడు. ఊరంతా తిరిగినా సైనికులకు అలాంటివాళ్ళు కనిపించలేదు. వెతగ్గా, వెతగ్గా ఒక నేత పనివాడు బట్టలు నేసుకొంటూ కనిపించాడు. వీళ్ళు పరీక్ష చేస్తే అతనికి కవిత్వం చెప్పటం తెలిసినట్లు కనబడలేదు. అతన్ని రాజు ముందు ప్రవేశపెట్టారు, ధారానగరంలో కవి కాని పౌరుడు అతనొక్కడేనని.

“ఏమయ్యా! నీకు కవిత్వం చెప్పడం నిజంగా రాదా?” అని రాజు అడిగితే, ఆ బక్కమనిషి తడబడుతూ పైమాటలు సమాధానంగా చెప్పాడు.

**కావ్యం కరోమి, నహి చారుతరం కరోమి**–కావ్యం రాస్తాను, కానీ అంత అందంగా రాయలేను.

**యత్నాత్ కరోమి యది, చారుతరం కరోమి**–ప్రయత్నం చేసి చేస్తే, అందంగా రాయగలను.

**భూపాల మౌళి మణి రంజిత పాదపీఠ**–(శత్రు) రాజుల తలల మీది రత్నాభరణాల కాంతులచేత ఎర్రబడిన పాదపీఠం కలవాడా!

**హే సాహసాంక**–ఓ సాహసాంకుడా, భోజరాజా!

**కవయామి**–కవిత్వం చెప్తాను,

**వయామి**–నేత నేస్తాను,

**యామి**–మరి వెళ్ళి వస్తాను!, అంటూ చక్కాపోయాడట ఆ పౌరుడు.

మరి, ఈ వస్త్రకారుడు కవేనంటారా, కాదంటారా? శ్లోకం మరొక్కసారి చదివి తేల్చండి.

# హృత్కల్పితం

**రత్నైః కల్పితమాసనమ్, హిమజలైః స్నానం చ దివ్యాంబరమ్,**
**నానారత్నవిభూషితమ్, మృగమదామోదాంకితం చందనం ।**
**జాతీ చంపక బిల్వపత్ర రచితం పుష్పం, చ ధూపం తథా**
**దీపం, దేవ! దయానిధే! పశుపతే! హృత్కల్పితం గృహ్యతామ్ ॥**

అశక్తుడయిన, బలహీనుడయిన భక్తుడు పరమేశ్వరుడయిన పశుపతికి పూజాద్రవ్యాలేవీ లేకుండా, కేవలం మనసా షోడశోపచారపూజ చేయాలంటే, స్వామిని ఏమని ప్రార్థిస్తాడు? ఆదిశంకరుల **'శివమానస పూజ'** లో పై శ్లోకం చెప్పారు.

**రత్నైః కల్పితం ఆసనమ్**–రత్నాలచేత నిర్మించబడ్డ (సింహ) ఆసనమూ, **హిమజలైః స్నానంచ**–చల్లని నీటితో స్నానమూ,

**నానారత్న విభూషితమ్ దివ్యఅంబరం**–అనేక రత్నములచే అలంకరించబడిన దివ్యమయిన వస్త్రమూ,

**మృగ మద ఆమోద అంకితం చందనమ్**–కస్తూరి వాసనలతో కలిసిన చందనమూ, **జాతీ చంపక బిల్వ పత్ర రచితం పుష్పం చ**–మల్లె, సంపెంగ పూలతో, బిల్వ పత్రాలతో ఏర్పరచిన పూజాపుష్పమూ,

**ధూపం తథా**–అలాగే, సాంబ్రాణి ధూపమూ, **దీపం**–దీపమూ,

**దేవ! దయానిధే! పశుపతే**–భగవాన్! కరుణానిధీ! భూతపతీ! **హృత్కల్పితం, గృహ్యతామ్**–మానసికంగానే (భావంలోనే) కల్పించింది, స్వీకరించవలసినది.

భగవదారాధనకు అనేక మార్గాలనీ, పూజాద్రవ్యాలకన్నా చిత్తశుద్ధి ముఖ్యమనీ మన స్మృతులూ, పురాణాలూ, ఇతిహాసాలూ బోధిస్తూ వచ్చిన విషయమే.

ఆరోగ్యకారణాల వల్లనో, వ్యావహారిక ప్రపంచంలో అనేక ఇతర కారణాల వల్లనో, యథావిధిగా నిత్యమూ పూజ చేసేందుకు అవకాశం లేని పక్షంలో కనీసం ఈ మానసిక పూజన్నా చేసుకోగలిగితే ముందు భక్తుడికి తృప్తీ, శాంతీ. భగవంతుడికీ అభ్యంతరం ఉండదు.

# విపులాచ పృథ్వీ

**యే నామ కేచిదిహ నః ప్రథయన్త్యవజ్ఞామ్**
**జానంతి తే కిమపి తాం ప్రతి నైష యత్నః**
**ఉత్పత్స్యతే హి మమకోపి సమానధర్మా**
**కాలోహ్యయం నిరవధిః విపులాచ పృథ్వీ**

"ఏ గతి రచియించిరేని సమకాలికులెవ్వరు మెచ్చరే గదా" అని చేమకూర వెంకటకవిగారు చెప్పిన యిబ్బందిని, అభిమానవంతులయిన కవులెందరో చరిత్రలో ఎదుర్కొన్నారు. రసజ్ఞత, సహృదయత లేని సమకాలిక విమర్శకుల వల్ల మహాకవి భవభూతి కూడా తీవ్రంగా నొచ్చుకున్నవాడేనని ఈ శ్లోకం వల్ల తెలుస్తున్నది. "నాకు చేతయినట్టు నేను రాసుకొంటాను. చదవదల్చుకోకపోతే, మానేయండి. నాకు తగిన పాఠకుడు ఎవరయినా ఉంటే వాడే నా రచనలు చదివి ఆనందిస్తాడు. ఇవాళ కాకపోతే రేపు, ఈ ఊళ్ళో కాకపోతే మరోచోట" అన్నాడు మహాకవి. ఈ శ్లోకం ఆయన రాసిన "మాలతీ మాధవమ్" నాటకంలోది (1.6). దెబ్బతిన్న ఆత్మాభిమానం, మొక్కవోని ఆత్మ విశ్వాసం పోటీపడుతున్నాయి ఈ శ్లోకంలో.

**యే నామ కేచి త్ ఇహ నః ప్రథయంతి అవజ్ఞాం**–నాపట్ల అవజ్ఞ (తక్కువ అభిప్రాయం) చూపించే వాళ్ళు యిక్కడ ఎవరయితే ఉన్నారో

**జానంతి తే కిమపి**–వారి జ్ఞానం, అవగాహన వారిది.

**తాం ప్రతి న ఏష యత్నః**–వారినుద్దేశించి కాదు ఈ గ్రంథరచన ప్రయత్నం.

**ఉత్పత్స్యతే హి మమ కః అపి సమానధర్మా**–నాలాంటి స్వభావం కలవాడు ఎవడో ఒకడు పుట్టకపోడు

**కాలః హి అయం నిరవధిః విపులా చ పృథ్వీ**–కాలం అనంతమయినది, భూగోళం చాలా విశాల మయినది.

భవభూతి ఎనిమిదో శతాబ్దం నాటి కవి. ఈయన రచనలు మూడే లభ్యమవుతున్నాయి. మూడూ నాటకాలే. మాలతీ మాధవమ్, మహావీర చరితమ్, ఉత్తరరామ చరితమ్.

**"కావ్యేషు నాటకేష్వేవ వయం వా వయమేవ వా**
**ఉత్తరే రామచరితే భవభూతిర్వి శిష్యతే"**

(కావ్యాలలో, నాటకాలలో మాకు మేమే సాటి. ఒక్క ఉత్తర రామచరిత నాటకంలో భవభూతి మమ్మల్ని మించిపోయాడు!) అని కాళిదాసు చెప్పాడని ఓ కట్టు కథ చెప్తారు.

# ధనాశ

**జాతిర్యాతు రసాతలం గుణగణాః తత్రాప్యధో గచ్ఛతాత్**

**శీలం శైల తటాత్ పతతు అభిజనః సన్దహ్యతాం వహ్నినా ।**

**శౌర్యే వైరిణి వజ్రమాశు నిపతతు-అర్థోస్తు నః కేవలం**

**యేనైకేన వినా గుణాః తృణ లవ ప్రాయాః సమస్తాః ఇమే ॥**

ధనపిశాచం తగులుకొన్న ఒక అర్భకుడి మనోవృత్తి తెలిపే ఘోష యిది. భర్తృహరి నీతిశతకంలో 'అర్థపద్ధతి'లో మొదటిశ్లోకం.

**జాతిః యాతు రసాతలం**-జాతి పాతాళానికి పోవచ్చు, **గుణగణాః తత్రాపి అధోగచ్ఛతాత్**-గుణగణాలు అంతకంటే కిందికిపోవచ్చు, **శీలం శైల తటాత్ పతతు**-శీలం శిఖరాగ్రం నుండీ పడిపోవచ్చు, **అభిజనః సన్దహ్యతాం వహ్నినా**-వంశం తగలడిపోవచ్చు నిప్పుతో, **శౌర్యే వైరిణి వజ్రం ఆశు నిపతతు**-ధనార్జనకు శత్రువయిన శూరత్వంలో ఠపీమని పిడుగుపడొచ్చు.

**అర్థః అస్తు నః కేవలం**-కేవలం మాకు ధనం మాత్రమే ఉండుగాక

**యేన ఏకేన వినా**-ఏ ఒక్కటి లేకపోతే, **సమస్తా ఇమే గుణాః**-ఈ గుణాలన్నీ

**తృణ లవ ప్రాయాః**-గడ్డిపోచతో సమానం

తాత్పర్యం తెలుస్తూనే ఉంది. ఒక్క డబ్బుంటే చాలు, మిగిలిన విషయాలన్నీ ఎలా పోయినా ఫర్వాలేదు అని ఈ మూర్ఖుడి మతం.

ఏనుగు లక్ష్మణ కవి, పుష్పగిరి తిమ్మకవి, ఎలకూచి బాలసరస్వతి అనే ముగ్గురు కవులు భర్తృహరి 'సుభాషిత త్రిశతి'లో మూడు శతకాలనూ (నీతి, శృంగార, వైరాగ్య శతకాలను) తెలుగులోకి అనువదించారు.

పై పద్యానికి పుష్పగిరి తిమ్మన తెలుగు అనువాదం ఇలా వుంది

**చ. కులము రసాతలస్థలిని గూలిన, మంచి గుణం బధోగతిం**

**బొలసిన శీలమద్రి తటభూమిని జారి విదగ్ధమైన, ద్వి**

**ట్కుల హర శౌర్యమందు బిడుగుల్ పడినన్ గడుమేల్, ధనంబె కా**

**వలె నదిలేనిచో దృణలవంబులుగా గుణకోటులిన్నియున్**

# మానస పూజ

**ఆత్మా త్వం, గిరిజా మతిః, పరిజనాః ప్రాణాః, శరీరం గృహం**
**పూజా తే విషయోపభోగ రచనా, నిద్రా సమాధి స్థితిః ।**
**సంచారః పదయోః ప్రదక్షిణ విధిః స్తోత్రాణి సర్వాఃగిరః**
**యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో! తవారాధనమ్ ॥**

ఇది కూడా శంకరాచార్యుల శివమానస పూజలో శ్లోకమే. నాలుగో శ్లోకం.

"నేను నీ శరణుజొచ్చిన వాణ్ణి కాబట్టి, నా తప్పులు ఒప్పులుగా భావించు. నేను చేయాల్సిన నిత్యపూజాదికర్మలు యథావిధిగా చేయలేక పోతున్నందుకు అన్యథా భావించద్దు. లౌకిక వ్యవహారాలలో నేను ఏ కర్మలూ చేస్తూ వచ్చినా, వాటినే దయతో నీ ఆరాధనగా భావించి స్వీకరించు, పరమేశ్వరా!" అని ఈ భక్తుడు శివుడికి మొరపెట్టుకొంటున్నాడు.

**ఆత్మా త్వం**–నా ఆత్మే నువ్వు, **గిరిజా మతిః**–నా బుద్ధియే పార్వతీ మాత, **పరిజనాః ప్రాణాః**–నా పంచప్రాణాలూ నీ పరిజనాలు (సేవకులు), **శరీరం గృహం**–నా శరీరమే నీకు ఆలయం, **పూజా తే విషయ ఉపభోగ రచనా**–విషయసుఖాల అనుభవానికి నేనాచరించే చర్యలు నీ పూజ, **నిద్రా సమాధి స్థితిః**–నా నిద్రే, నీ భక్తిలో తదేకంగా లగ్నమయి నేను చేరి ఉన్న సమాధిస్థితి.

**సంచారః పదయోః**–పాదాలతో సంచారం (ఎందుకు, ఎలా చేసినా), **ప్రదక్షిణ విధిః**–నీ చుట్టూ చేసిన ప్రదక్షిణ కార్యం, **స్తోత్రాణి సర్వాః గిరః**–నేను పలికే అన్ని మాటలూ, నీ స్తోత్రాలు, **యత్ యత్ కర్మ కరోమి తత్ తత్ అఖిలం, శంభో, తవ ఆరాధనమ్**–ఏ ఏ కర్మ చేస్తున్నానో ఆ ఆ కర్మ అంతా హే ఈశ్వరా! నీ ఆరాధన(గా భావించు)!

ఎలాగూ యథావిధిగా పూజలు చేయలేం గనుక, మనం కూడా భగవంతుణ్ణి ఇలాగే ప్రార్థించి, క్షమాపణలు కోరుకోవడం మంచిదేమో! ఎటొచ్చీ, నేను చేసే లౌకికమయిన కార్యాలన్నీ నీ పూజగానే భావించవయ్యా అని కోరుతున్నాం కనుక ఆ లౌకిక కార్యాలు వీలయినంత ధర్మంగా, నీతిబద్ధంగా చేసుకొంటూ పోవటం మంచిది. దుర్మార్గపు పనులు చేస్తూ, పైపెచ్చు 'యిదే నేను నీకు చేసే పూజ!' అంటే, ఎంత దయామయుడయిన ఈశ్వరుడికయినా చికాకు కలగదూ?

# టకటకవి

**టకా ధర్మః టకా కర్మ టకా హి పరమం పదం ।**

**టకా యస్య గృహేనాస్తి హాటకాః టక్ టకాయతే ॥**

ఇదొక చాటు శ్లోకం. టక టక మోత చేసే తమాషా శ్లోకం.

**టకా**–అంటే రూపాయికాసు. (బెంగాలీలో రూపాయిని ఇప్పటికీ వ్యవహారంలో టకా అనే అంటారు)

**టకా ధర్మః–టకా కర్మ–టకా హి పరమం పదం**

రూపాయే ధర్మం – రూపాయే కర్మం – రూపాయే మోక్షం

**టకా యస్య గృహే నాస్తి హాటకాః–టక్ టకాయతే**

రూపాయలు ఎవరియింట్లో ఉండవో (ఆ యింట్లో) హాటకాలు అంటే కుండలు టక టక లాడుతుంటాయి. అంటే బియ్యమూ, పప్పూ, ఉప్పూ లాంటి పదార్థాలన్నీ నిండుకోవటం వల్ల, పొయ్యిలో పిల్లి లేవదు! వంట కుండలు ఖాళీగా, ఘటం వాయించుకోడానికి వీలుగా పడిఉంటాయి. కొంపలో కుండలు డింకీలు కొడుతున్నాయి అని తెలుగులో కూడా యిదే అర్థం గల జాతీయం ఒకటి ఉంది.

**ధనమూల మిదం జగత్** అన్న నానుడిలో చెప్పినమాటే, ఈ చమత్కార శ్లోకం టక టకా చెప్తున్నది.

**బుభుక్షితైః వ్యాకరణం న భుజ్యతే, పిపాసితైః కావ్యరసం న పీయతే ।**

**న చందసా కేనచిత్–ఉధృతం కులం, హిరణ్యమేవార్జయ ! నిష్ఫలాః కలాః ॥**

అన్నాడట చమత్కారంగా మాఘ మహాకవి. (ఎందుకొచ్చిన వ్యాకరణం ? ఆకలేస్తే వ్యాకరణం తినలేం. ఎందుకొచ్చిన కవిత్వాలు ? కావ్యరసం తాగితే దాహం తీరదే ! ఎందుకొచ్చిన ఛందస్సూ, ఛందో జ్ఞానం ? దాని వల్ల ఎవరి వంశమూ ఉద్ధరించబడ్డట్టు దాఖలాలు లేవు. అందుకే డబ్బు మాత్రం సంపాదించు. **హిరణ్యం–ఏవ–ఆర్జయ:** బంగారమే సంపాదించు. **నిష్ఫలాః కలాః:** కళలు భుక్తి సాధనకు పనికిరావు.

లౌకిక ప్రపంచంలో భుక్తి ముఖ్యమే. కావ్య ప్రపంచంలో రక్తీ ముఖ్యమే. ఆధ్యాత్మిక ప్రపంచంలో ముక్తీ ముఖ్యమే. సంతులనం కోల్పోకుండా, వైరాగ్య భావంతో, ఈర్ష్యాలోభాలు లేకుండా, భగవత్ప్రసాదమైన భోగాలు అనుభవించమని ఉపనిషత్తు చెప్పిన మాట మనసులో ఉంచుకొంటే మంచిది. (పేజీ 106లో శ్లోకం.) )

# తెలివిడి

**యదా కించిద్‌జ్ఞోహం గజ ఇవ మదాన్ధః సమభవం**
**తదా సర్వజ్ఞోస్మీత్యభవ దవలిప్తం మమ మనః ।**
**యదా కించిత్కించిత్బుధజన సకాశాదవగతః**
**తదా మూర్ఖోస్మీతి జ్వర ఇవ మదో మే వ్యపగతః ॥**

ఏదో కొంచెం తెలిసి, సర్వమూ తెలుసునని భ్రమపడి గర్వించే వాళ్ళవల్ల వాళ్ళకూ నష్టమే, లోకానికీ నష్టమే.

నాకు అంతా తెలుసుననుకొంటూ విర్రవీగటం నిజంగా తెలిసినవాడు చేసేపనికాదు. కొంచెం తెలిసిన దశలోనే ఆ అహంకారం ఉంటుంది. ఏమీ తెలియకపోయినా, అంతా తెలిసినా ఆ అహంకారం ఉండదు. నిండుకుండ తొణకదు.

కొంత తెలుసుకొని, ఆ తరవాత తనకంటే పండితులయిన వాళ్ళ ప్రతిభ గమనించి, వారినించి మరింత తెలుసుకొనే ప్రయత్నం నిరంతరం చేసే సజ్జనుడికి తాను సర్వజ్ఞుణ్ణి కాదని తెలియదా? తెలియనూ తెలియకా, సరయిన పండితుల సాంగత్యమూ లేక కొట్టుకొనే కూపస్థమండూకాలకే (బావిలో కప్పలు) తమ పాండిత్యం గురించి అహంకారం!

భర్తృహరి తన నీతిశతకంలో 'మూర్ఖపద్ధతి'లో ఈ తెలిసీ తెలియని ఘటాలను తీవ్రంగా నిరసించాడు. అసలు ఆయన సుభాషితాలు తెలిసీ తెలియని వాళ్ళను గర్హించటంతోనే మొదలవుతాయి. ఈ శ్లోకం ఆ సందర్భంలోది.

**యదా కించిత్‌జ్ఞో అహం, గజ ఇవ మదాన్ధః సమభవం:**–నేను కొంచెం తెలిసిన కించిద్‌జ్ఞుడిగా ఉన్నప్పుడు, ఏనుగు లాగా మదాంధుడిగా ఉండేవాడిని.

**తదా సర్వజ్ఞః అస్మి యితి అభవత్ అవలిప్తం మమ మనః**–అప్పుడు సర్వజ్ఞుడిని నేను అని గర్వపడింది నా మనస్సు.

**యదా కించిత్ కించిత్ బుధజన సకాశాత్ 'మూర్ఖః అస్మి' ఇతి అవగతః**–ఎప్పుడయితే కొంచెం కొంచెంగా పండితజనుల సాన్నిహిత్యం వల్ల 'నేను మూర్ఖుడిని' అని అవగతమయిందో

**తదా, జ్వర ఇవ మదో మే వ్యపగతః**–అప్పుడు, జ్వరంలాగా నా అహంకారం తొలగిపోయింది. దీనికి ఏనుగు లక్ష్మణకవి అనువాదం:

**'తెలివియొకింత లేని యెడ దృప్తుడనై కరి భంగి సర్వమున్**
**దెలిసితి నంచు గర్విత మతిన్ విహరించితి దొల్లి యిప్పుడు**
**జ్ఞుల మతులయిన పండితుల సన్నిధి నించుక బోధశాలినై**
**తెలియని వాడనై మెలగితిన్ గతమయ్యె నితాంత గర్వమున్'**

# క్షమాపణ

**న మంత్రం నో యంత్రం తదపి చ న జానే స్తుతి మహో**

**న చాహ్వానం ధ్యానం తదపి చ న జానే స్తుతి కథాః ।**

**న జానే ముద్రాస్తే తదపిచ న జానే విలపనం**

**పరం, జానే మాతః త్వదనుసరణం క్లేశహరణం ॥**

ఇది మనలో చాలామందిమి ఎదుర్కొనే సమస్య. భక్తిగా దేవీపూజ చేద్దామంటే అదంత తేలికయిన విషయం కాదు. మంత్రం తెలియాలి. అది తెలిపే గురువు దొరకాలి. ఆయన చెప్పింది మనకబ్బాలి. మంత్రం ఎవరంటేవారు, ఎలా అంటే అలా జపించేది కాదు. ఉచ్చారణ దోషాలుంటే ప్రమాదకరమయిన ఫలితాలు ఉంటాయని కొందరు భయపెడుతూ ఉంటారు. యంత్రాలూ, చక్రాలూ ప్రతిష్ఠ చేసుకొని యథావిధిగా వాటికి పూజలూ, నైవేద్యాలూ ఏర్పరచటం కూడా కష్టమే. స్తోత్రాలూ, స్తుతికథల అర్థం, అంతరార్థం, గూఢార్థం తెలుసుకోవడం ఎలా? దేవిని సక్రమంగా ఆవాహన చేయటం, ధ్యానించటం, శాస్త్రోక్తంగా ముద్రలు చూపటం, అన్నీ తెలియని ప్రక్రియలే. కలిగిన కష్టాల గురించి మామూలు మాటలలో చెప్పడమూ తెలియదు. మనకి తెలిసింది ఒకటే. **'త్వదనుసరణం క్లేశ హరణం'!** అమ్మా! నిన్ను అనుసరించటం వల్ల కష్టాలు హరించిపోతాయ్.

ఈ ముక్కలు శంకరాచార్యులవారు 'దేవ్యపరాధ క్షమాపణ స్తోత్రం'లో ఎంత చక్కగా చెప్పారంటే ఈ శ్లోకం కంఠస్థం చేసుకొని, దానితో అమ్మవారిని వేడుకొంటే, ఆమె తన పూజలో జరిగిన లోటుపాట్లన్నీ క్షమించి, భక్తుడిని కరుణించక మానదు.

మంత్రమూ, యంత్రమూ, స్తుతికథలూ, ఆవాహనమూ, ధ్యానమూ, స్తుతీ, ముద్రలూ, విలపనమూ (మామూలు సంభాషణ) యివేవీ నేనెరుగను–**న జానే.**

**పరం, జానే మాతః త్వదనుసరణం క్లేశ హరణం**–కానీ, ఎరుగుదును తల్లీ, నీ అనుసరణం క్లేశాలను హరిస్తుందని. దీని తరువాతి శ్లోకం కూడా ఈ తరవాతి పేజీలో ఉంది. అది కూడా కంఠస్థం చేసి తరచుగా చెప్పుకోవాల్సిందే.

మంత్ర, తంత్ర, యంత్రాలూ, ముద్రల మాట అలా ఉంచితే, ఈ శ్లోకార్థం మాత్రం తేలికగానే ఉంది. శబ్ద క్లిష్టతా లేదూ, అన్వయక్లిష్టతా లేదు.

మరోసారి చదివి చూడండి.

# కుపుత్రుడు

**విధే రజ్ఞానేన ద్రవిణ విరహేణాలసతయా**

**విధేయాశక్యత్వాత్ తవ చరణయోః యా చ్యుతిరభూత్ ।**

**తదేతత్ క్షంతవ్యం జనని సకలోద్ధారిణి శివే**

**కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి ॥**

**విధేః అజ్ఞానేన**–నీ పూజావిధుల గురించి అజ్ఞానం వల్ల ఎరగకపోవటంచేత,

**ద్రవిణ విరహేణ**–(పూజాసామగ్రి ఏర్పరచేందుకు) ధనం లేకపోవటం చేత,

**అలసతయా**–సోమరితనంచేత,

**విధేయ అశక్యత్వాత్**–చేయవలసినది చేయటంలో అశక్తతచేత,

**తవ చరణయోః**–నీ పాదాలకు

**యా చ్యుతి రభూత్**–ఏదయితే లోటు (పొరపాటు) జరిగిందో

**తదేతత్ క్షంతవ్యం**–అటువంటి దానినల్లా, క్షమించవలసింది

**కుపుత్రో జాయేత, క్వచిత్ అపి కుమాతా న భవతి**–చెడుపుత్రుడు పుట్టవచ్చు, ఎప్పటికీ కూడా చెడ్డ తల్లి ఉండబోదు.

ఇది శంకరుల దేవ్యపరాధ క్షమాపణ స్తోత్రంలో రెండో శ్లోకం.

ఇందులో చెప్పిన తప్పులన్నీ సామాన్య మానవుల పూజలలో దొర్లేవే. వీటికి క్షమాపణ కోరటం కంటే ఏం చేయగలం?

దేవికి మనమందరమూ సంతానం. తనను గౌరవించే విషయంలో, తగిన మర్యాదలు జరిపే విషయంలో, కొడుకు తెలిసో తెలియకో ఏవయినా పొరపాట్లు చేస్తే, వాటికి తల్లి ఎప్పుడయినా కోపిస్తుందా? పైగా వాటి గురించి చిత్తశుద్ధితో క్షమాపణ చెప్పుకుంటే, తప్పు క్షమించని తల్లి ఉండదు.

కొడుకు ఎంత దుర్మార్గుడయినా, కొడుకు పట్ల నిర్దయగా, క్రూరంగా ఉండటం తల్లికి ఎలా సాధ్యమవుతుంది?

తప్పొప్పుకుని, కాళ్ళ మీద పడి వేడుకొంటే జగజ్జనని కరగిపోయి, కరుణ చూపకుండా ఉండటం అసంభవం.

# నిశ్చింత

**నాహం జాతో జన్మమృత్యూ కుతో మే?**
**నాహం ప్రాణః క్షుత్పిపాసే కుతో మే?**
**నాహం చిత్తం శోక మోహౌ కుతో మే?**
**నాహం కర్తా బంధ మోక్షౌ కుతో మే?**

శంకరాచార్యుల వారి ఆత్మపంచకమ్‌లో ఆఖరి శ్లోకం యిది.

మనిషి నేను–నాది అనే చింత వదిలిపెడితే, ఈ శరీర గతమయిన కష్టనష్టాలు అతన్ని బాధించవనటం నిర్వివాదం. మరొకడి యింట్లోనో మరొకడి పిల్లలకో, బంధువులకో కలిగే కష్టనష్టాలు మనల్ని అంతగా బాధిస్తాయా? మరొకడి శరీరానికి కలిగిన వ్యాధి వల్ల మనకు నొప్పి కలుగుతుందా?

“ఈ శరీరం నాది కాదు, ఈ సృష్టిలో నేను, నాది అంటూ ప్రత్యేకంగా, విశేషంగా మరేదీ లేదూ, ఉన్నదల్లా అనాది, అనంతమయిన, సర్వ వ్యాపకమయిన అఖండచైతన్యమే. ఆ అవిభాజ్యమయిన బంగారుముద్దను, మాయ వల్ల ముక్కలు, ముక్కలుగా చూస్తూ ఒక్కో ముక్కకి ఒక్కో రూపం ఊహించుకొంటూ, ఒక్కో పేరు తగిలిస్తాం. వాటిలో ఓ ఊహాజనితమయిన ముక్కకు ‘నేను’ అని పేరిచ్చుకొని, మిగతా ముద్దంతా వేరూ, ‘నేను’ వేరు అని లేని భేదాన్ని కల్పించుకొని, ఆ భిన్నత్వం వల్ల అనేకమయిన కష్టాలూ, అశాంతి, అసంతృప్తితో కాగిపోతుంటాం. పరమాత్మ యొక్క అఖండచైతన్యం ఏకత్వాన్ని మాయ వల్ల గుర్తించలేకపోవటం వల్లే ‘నువ్వూ, నేనూ, వాడూ, అదీ’ అనే భిన్నత్వ భావన. దానివల్లే కష్టాలు. నిరంతర సాధనతో అద్వైతమయిన అఖండ చైతన్యం అనుభూతి పొందితే, అది మోక్షం. ఆ స్థితిలో ఉంటే ‘నేనూ, నాదీ, మరొకడు, వాడిదీ’ అనే భేదభావన ఎగిరిపోతుంది. ఇక అశాంతీ, అసంతృప్తీ, బాధా, సౌఖ్యం, కష్టం, సుఖం లేవు. ఉన్నది శాశ్వతమయిన సచ్చిదానందానుభవమే అని అద్వైత సిద్ధాంతం.

**‘న అహం జాతః జన్మ మృత్యూ కుతః మే’**–నేను పుట్టనే లేదు. జన్మ మృత్యువులు నాకెక్కడివి? (నేను అనాదీ అనంతం అయిన అఖండచైతన్యాన్ని. నాకు కనిపించేదీ, కనిపించనిదీ సర్వం ఆ అఖండ చైతన్యమే. ఇక చావేమిటీ, పుటక ఏమిటీ?

**‘న అహం ప్రాణః, క్షుత్ పిపాసే కుతః మే’**–ఈ ప్రాణం అనేది నేను కాదు. దానివల్ల కలిగే ఆకలి దప్పులు నాకెక్కడివి?

**'న అహం చిత్తం, శోక మోహౌకుతః మే'**–నేను చిత్తాన్ని కాదు. దానికి కలిగే శోకం, మోహంతో నాకేమిటి సంబంధం?

**'న అహం కర్తా, బంధ మోక్షౌ కుతః మే'**–నేను కర్తనే కానప్పుడు, కర్మఫలం వల్ల కలిగే బంధమోక్షాలు నాకెక్కడివి?

ఆత్మభావంలో నేను అనంతుడిని, అనాదిని, నిత్యుడిని, నిత్యముక్తుడిని. పాపపుణ్యాలూ, క్షుత్పిపాసలూ, సుఖదుఃఖాలకు నేను ఎప్పుడూ అతీతుడినే.

# ఇల్లాలు

**ఇయంగేహే లక్ష్మీః ఇయమమృతవర్తి ర్నయనయోః**
**అసావస్యాః స్పర్శో వపుషి బహుళశ్చందన రసః ।**
**అయం బాహూః కంఠే శిశిర మసృణో మౌక్తిక సరః**
**కిమస్యాన ప్రేయో యది పరమసహ్యస్తు విరహః ॥**

ఈ శ్లోకం భవభూతి మహాకవి వ్రాసిన "ఉత్తర రామచరిత" నాటకంలో శ్రీరాముడు, సీతను గురించి చెప్పినది.

కవుల గణనలో కాళిదాసు కనిష్ఠిక నెక్కితే, అనామిక భవభూతికి ఉచితస్థానం.

ఉత్తర రామచరిత నాటకం మొదటి అంకంలోది ఈ శ్లోకం. మహారాజు శ్రీరాముడు గర్భిణి అయిన సీతాదేవి ఉల్లాసం కోసం రామాయణ కథ ఆధారంగా చిత్రించిన కొన్ని చిత్రాలు చూపిస్తాడు. అలసిపోయిన సీతమ్మ ఆయన బాహువులే దిండుగా నిద్రిస్తుంది. ఆమెను చూస్తూ, స్వగతంగా శ్రీరాముడు ఈ శ్లోకం చెప్తాడు. నాలుగు అద్భుతమయిన రూపకాలంకారాలు పొదిగాడు కవి ఈ శ్లోకంలో.

**ఇయం గేహే లక్ష్మీః**–ఈమె ఇంటిలో సిరి

**ఇయం అమృతవర్తిః నయనయోః**–ఈమె, నయనాలకు, అమృతంలా చల్లబరచే శమనకారి

**అసౌ అస్యాః స్పర్శః వపుషి బహుళః చందన రసః**–ఈమె యొక్క ఈ స్పర్శ శరీరానికి దట్టమైన చందన లేపనం.

**అయం బాహూః కంఠే**–(నా) మెడ చుట్టూ వేసిన ఈ చేయి

**శిశిర మసృణః మౌక్తిక సరః**–చల్లని నునుపయిన ముత్యాల దండ

**కిమ్ అస్యాః న ప్రేయో**–ఈమెలో ప్రియం కలిగించని లక్షణాలు ఏం ఉన్నాయ్?

**యది విరహః**–ఈమె నుండి విరహం కలిగితే మాత్రం, అది,

**పరమ్ అసహ్యః**–ఎంత మాత్రం సహింపరానిది.

ఈమెలో ఆనందదాయకం కానిదంటూ ఏమీ లేదు. ఈమె నుండీ విరహం తప్ప. అది మాత్రం భరించరానంత బాధ కలిగిస్తుంది.

# ఆనాటి ముచ్చట్లు

**కిమపి కిమపి మందం మందమాసక్తి యోగాత్**

**అవిరళిత కపోలం జల్పతో రక్రమేణ ।**

**అశిథిల పరిరంభ వ్యాపృతై కైకదోష్ణో**

**అవిదిత గత యామా రాత్రిరేవ వ్యరంసీత్ ॥**

భవభూతి రచించిన ఉత్తర రామచరిత నాటకంలోది ఈ శ్లోకం. రావణసంహారం, పట్టాభిషేకం పూర్తయిన తర్వాత ఏకచ్ఛత్రాధిపత్యంగా రాజ్యం చేసుకొంటున్న రోజుల్లో ఒకసారి శ్రీరామచంద్రుడికి పాతకాలపు స్మృతులు గుర్తుకొచ్చాయి. వనవాసకాలంలో ఆ గోదావరీ తీరం, ఆ పంచవటీ, అందమయిన తన పర్ణశాలా జ్ఞాపకం వచ్చాయి. ఆ పర్ణశాలలో, తనూ, సీతా యువదంపతులుగా, గువ్వల జంటలా గడిపిన రోజులు గుర్తొచ్చినయ్. ఒళ్ళు పులకరించింది. ఆ రోజులు ఎలా గడిచాయో సీతకూ జ్ఞాపకం చేస్తూ, ఈ శ్లోకం చెప్తాడు.

**కిమపి, కిమపి**–ఏవేవో (కబుర్లు), **మందం మందం**–మెల్ల, మెల్లగా (గొంతుకలు తగ్గించి

**ఆసక్తియోగాత్**–ఏ విషయం తోస్తే ఆ విషయం గురించి

**అవిరళిత కపోలం**–ఒకరి చెక్కిలికి మరొకరి చెక్కిలి జేర్చి

**జల్పతోః అక్రమేణ**–ఒక క్రమమైన పద్ధతి ఏమీ లేకుండా, ముచ్చటలు చెప్పుకొంటున్న (మనకు)

**అశిథిల పరిరంభ వ్యాపృత ఏకైక దోష్ణోః**–బిగి కౌగిలిలో ఒకరి బాహువులలో మరొకరి బాహువులు చిక్కి ఉన్న (మనకు)

**అవిదిత గత యామా రాత్రిరేవ వ్యరంసీత్**–తెలియకుండా జాములు దొర్లిపోయి రాత్రే గడచిపోయేది.

చేతుల్లో చేతులు కలుపుకొని, చెక్కిలికి చెక్కిలి చేర్చి, ఆత్మీయంగా, గుసగుసలుగా, మనసుకు తోచిన ముచ్చట్లు, మనసుకు తోచిన పద్ధతిలో చెప్పుకొనే ప్రేమైక జీవులకు కాలం తెలియకుండానే జరిగిపోవడం చూస్తూ చూస్తుండగానే తెల్లారడం విశ్వజనీనమయిన అనుభవం.

దీన్ని ఎంత సహజ సుందరంగా చెప్పాడు మహాకవి! **'అవిదిత గత యామా రాత్రిరేవ వ్యరంసీత్'** తెలియకుండానే జాములు దొర్లిపోయి, రాత్రే గడచిపోయింది. కబుర్లు మాత్రం యింకా బోలెడుండిపోయినాయి!

ఈ శ్లోకాన్ని మెచ్చిన పెద్దలు ఒక కథ కల్పించి చెప్పారు.

భవభూతి తన ఉత్తర రామచరిత నాటకం రచించటం పూర్తిచేసి, దాన్ని తన గురుతుల్యుడు కాళిదాస మహాకవికి చూపటానికి తీసుకెళ్ళాడు. కవికులగురువు తనయింట్లో చదరంగం ఆడుకొంటున్నాడు. 'నీ దోవన నువ్వు కావ్యం చదువుకుపో, ఒక చెవి దానిమీద పడేసి వింటుంటాను' అన్నాడు. కొంచెం చిన్నబుచ్చుకొనే ఉంటాడు భవభూతి. అయినా గురువుగారి మీద భక్తితో కావ్యం అంతా చదివాడు. కాళిదాసు ఆనందం పట్టలేకపోయాడు. కౌగలించుకొని, 'ఎంత అద్భుతమయిన కావ్యం రాశావయ్యా!' అని మనసారా మెచ్చుకొన్నాడు.

"అలా కాదు, మీ వంటి పెద్దలు ఏవయినా దోషాలూ, సవరణలూ చూపితే బాగుంటుంది" అని ప్రార్థించాడు భవభూతి.

"మొత్తం కావ్యంలో ఒకే చిన్న సవరణ నాకు కనిపిస్తుంది. ఒక్కచోట ఒక్క సున్నా ఎక్కువ పెట్టావు. అది తీసేస్తే మరీ బాగుంటుంది" అని కాళిదాసు పై శ్లోకాన్ని సవరించాడు.

**అవిదిత గతయామా, రాత్రిరేవం వ్యరంసీత్** (రాత్రి ఈ విధంగా గడిచింది) అనే పాదాన్ని

**అవిదిత గతయామా, రాత్రి రేవ వ్యరంసీత్** (రాత్రియే గడచిపోయింది) అని మార్చాడు.

'అంతకు మించి ఈ మహాకావ్యంలో నేను చేయగల మార్పేమీ లేదు!' అన్నాడు.

# నమస్కారం

**యం బ్రహ్మో వరుణేంద్ర రుద్ర మరుతః స్తున్వంతి దివ్యైః స్తవైః**

**వేదైః సాంగపద క్రమోపనిషదైః గాయంతి యం సామగాః ।**

**ధ్యానావస్థిత తద్గతేన మనసా పశ్యంతి యం యోగినః**

**యస్యాంతం న విదుః సురాసుర గణాః దేవాయ తస్మై నమః ॥**

ఇది వ్యాస విరచిత భాగవతం ద్వాదశ స్కంధంలో స్తోత్ర శ్లోకం (12.13.1). భక్తులందరికీ నిత్యం అవశ్యపఠనీయం. కంఠస్థం చేయదగ్గ శ్లోకం.

పద్దెనిమిది వేల శ్లోకాలలో మహాభాగవత కథనంతా శౌనకాది మహామునులకు వినిపించాడు సూతుడు. భాగవత పురాణానికి ఇది ఆయన తుదిపలుకు. ఆఖరిస్కంధంలో, ఆఖరి అధ్యాయంలో పురాణానికి ఉపసంహారం చెప్తూ, సచ్చిదానంద స్వరూపుడయిన పరబ్రహ్మను మరొకసారి, చివరిసారి స్తుతిస్తున్నాడు.

తాత్పర్యం సులభమే.

**దేవాయ తస్మై నమః**–ఆ దేవతకు నమస్కారం.

ఎవరికి?

**యం బ్రహ్మో, వరుణ, ఇంద్ర, రుద్ర, మరుతః స్తున్వంతి దివ్యైః స్తవ్యైః**–ఎవరినయితే బ్రహ్మ, వరుణ, ఇంద్ర, రుద్ర, మరుత్తులు దివ్యములయిన స్తవములతో స్తుతిస్తారో, ఆయనకు

**యం సామగాః సాంగపద క్రమ ఉపనిషదైః వేదైః గాయంతి**–ఎవరినయితే సామగానం చేసే విద్వాంసులు వేద, వేదాంగ, ఉపనిషత్ మంత్రాలతో కీర్తన చేస్తారో, ఆయనకు

**యం యోగినః ధ్యాన అవస్థిత తద్గతేన మనసా పశ్యంతి**–ఎవరినయితే యోగులు, ధ్యానస్థితిలో భగవల్లగ్నమైన మనోనేత్రంతో చూస్తుంటారో, ఆయనకు

**యస్య అంతం న విదుః సుర అసుర గణాః**–ఎవరి యొక్క అంతాన్ని దేవరాక్షస గణములు తెలియలేరో, ఆ అనంతునికి నమస్కారం.

# చ(మత్) కారం

**యస్మాచ్చ, యేనచ, యదాచ, యథాచ, యచ్చ**
**యావచ్చ, యత్ర చ శుభా శుభ మాత్మ కర్మ ।**
**తస్మాచ్చ, తేనచ, తదాచ, తథాచ, తచ్చ**
**తావచ్చ తత్రచ కృతాంతవశా దుపైతి ॥**

విధి బలీయం, దాన్ని తప్పించటం మానవమాత్రుడికి సాధ్యం కాదు అన్న విషయం ప్రాచీన భారతీయ సాహిత్యంలో సర్వే సర్వత్రా కనిపిస్తుంది. పురాణాల్లోనూ, ఇతిహాసాల్లోనూ, చాటు శ్లోకాలలోనూ, కథల్లోనూ ఈ భావం తరచుగా స్ఫుటమవుతూ ఉంటుంది.

పురుష ప్రయత్నం దోవదానిదే. కానీ మనిషికి లౌకిక జీవితంలో కలిగే సుఖదుఃఖాలన్నీ పుణ్యపాప కర్మల ఫలమేనని ఈ గ్రంథాలన్నీ నొక్కి చెబుతుంటాయి.

ఈ విషయంలో మన ప్రాచీనుల దృక్పథానికీ, పాశ్చాత్యుల దృక్పథానికీ, తూర్పూ, పడమరే. కర్మ, విధి అని ప్రయత్నం మానేసి కూర్చోవటం వల్లే భారతీయులు తమ వైభవాన్ని కోల్పోయారని పాశ్చాత్యులు విమర్శిస్తుంటారు. నిజానికి పురుషప్రయత్నం చెయ్యొద్దని శాస్త్రాలూ ఎక్కడా చెప్పలేదు, అది చాలా అవసరమని కూడా చెప్పాయి. అయితే సముద్రంలో అలల లాగానూ, చక్రభ్రమణం లాగానూ వచ్చే సుఖదుఃఖాలూ, చీకటి వెలుగులూ, హాని వృద్ధులూ కర్మఫలమేననీ, వాటి గురించి నిర్లిప్తంగా ఉండాలనీ, పాపపుణ్యకర్మల ఫలం అనుభవించడం ఎవరికయినా తప్పదనీ వైరాగ్యభావంతో జీవితాన్ని అనుభవించడమే శ్రేయస్కరమనీ భారతీయుల అచంచల విశ్వాసం. ఇది నిజమని, మన అనుభవాలను తరచి, పరిశీలిస్తే మనకూ అనిపిస్తుంటుంది.

పై శ్లోకం మహాభారతంలోది.

దేనినించీ, దేనిచేత, ఎప్పుడు, ఎలా, ఏదయితే, ఎంతవరకయితే మనం పాప పుణ్యకర్మ చేస్తామో, దానినుంచీ, దానిచేత, అప్పుడు, అలా, అదే అంతవరకే విధి వశం వల్ల మనకు ఫలానుభవం కూడా కలుగుతుంది. (**కృతాంతవశాత్**–విధివశం వల్ల, **ఉపైతి**–కలుగుతుంది)

మీరేమంటారు?

మరొక్కసారి శ్లోకం చదివితే భావం స్పష్టమవగలదు.

వ్యాసమహర్షి రచనల్లో 'చ' 'చ' (మరియు, ఇంకా, కూడా) అంటూ 'చ' కారం తరచుగా తగులుతుందని కాళిదాసు ఆయనని 'చ కార కుక్షి' (పొట్టనిండా 'చ' కారాలు పెట్టుకొన్నవాడు) అని ఆటపట్టించేవాడట.

# మందోదరి

**న కులేన, న రూపేణ, న దాక్షిణ్యేన, మైథిలీ ।**
**మయాధికా వా తుల్యా వా, త్వం తు మోహాన్న బుధ్యసే ॥**
**సర్వదా సర్వభూతానాం నాస్తి మృత్యురలక్షణః ।**
**తవ తావదయం మృత్యుః మైథిలీకృత లక్షణః ॥**
**సీతా నిమిత్తజో మృత్యుః త్వయా దూరాదుపాహృతః ॥**

రావణుడు చనిపోగానే, అతని అంతఃపుర స్త్రీలంతా వచ్చి, అతని కళేబరం మీద పడి కన్నీరు మున్నీరుగా విలపించారు. అతని పట్టపురాణి మందోదరి దుఃఖం మరీ హృదయవిదారకం. రావణుడి సద్గుణాలనూ, దుర్గుణాలనూ రెండింటినీ తలచుకొని, తలచుకొని మందోదరి విలపించే సందర్భంలో పై మాటలు కూడా చెప్తుంది. (వాల్మీకి రామాయణం, 6-114-28,29) అన్వయమూ, తాత్పర్యమూ సరళమే.

"కులంచేత గానీ, రూపం చేత గానీ, సమర్థత (యోగ్యత) చేత గానీ, ఈ మిథిలా రాజకుమారి నాకంటే అధికురాలూ కాదు, నాతో సమానమయినదీ కాదు. నువ్వు మాత్రం మోహం వల్ల అది తెలుసు కోలేకపోయావు. ఎప్పుడూ, ఏ ప్రాణికీ మృత్యువు అకారణంగా రాదు. నీకు ఈ చావు మైథిలీ కారణంగానే వచ్చింది. సీత కారణంగా కలిగిన ఈ మృత్యువు, నీచేత బహుదూరాన్నించి స్వయంగా తీసుకురాబడ్డదే".

దుఃఖంలో మందోదరి ఇంకా చాలా అన్నది. మనుష్యమాత్రుడయిన రాముడి చేతిలో ఓడిపోయావని నీకు సిగ్గు కలగలేదా, అంది. అసలీ రాముడు పరమాత్మ అంది. శంఖ చక్ర గదాధారియైన శ్రీ లక్ష్మీనారాయణుడే అంది. నీ ఐశ్వర్యాన్ని, పరివారాన్నీ, శరీరాన్నీ నాశనం చేసుకొనేందుకే నీకీ దుర్బుద్ధి పుట్టింది, అంది.

**శుభకృత్ శుభమాప్నోతి, పాపకృత్ పాపమశ్నుతే**
**విభీషణః సుఖం ప్రాప్తః త్వం ప్రాప్తః పాపమీదృశమ్**

మంచివాడికి శుభం కలుగుతుంది. పాపికి పాపఫలం మిగులుతుంది. విభీషణుడు సుఖాన్ని పొందాడు. నువ్వీ పాపగతిని పొందావు, అంది.

నువ్వు పోయిన తర్వాత, యింకా జీవించే ఉన్నాను నేను పాషాణ హృదయను, అంది.

మందోదరి విలాపం వాల్మీకి సుమారు నూరు శ్లోకాలుగా రచించాడు. దీనిపాటికిదే ఒక కరుణరస ప్లావితమయిన కావ్యం!

# సంస్కారం

**మరణాంతాని వైరాణి నిర్వృత్తం నః ప్రయోజనమ్ ।**
**క్రియతామస్య సంస్కారో మమాప్యేష యథా తవ ॥**

రామ రావణ యుద్ధం ముగిసింది. రావణుడు వధించబడ్డాడు. విభీషణుడికి రావణుడి అంతిమ సంస్కారాలు చేసేందుకు కూడా మనస్కరించలేదు. **"త్యక్తధర్మవ్రతం, క్రూరం, నృశంసమ్, అనృతం తథా, నాహం అర్హోస్మి సంస్కర్తుం పరదారాభిమర్శినమ్"** – ధర్మవ్రతం వదిలినవాడూ, క్రూరుడూ, కఠినుడూ, అసత్యవాదీ, పరస్త్రీలను బలాత్కరించేవాడూ అయిన రావణుడికి, నేను అంతిమ సంస్కారం చేయలేను, అన్నాడు.

దానికి బదులుగా శ్రీరాముడు పై శ్లోకం చెప్పాడు (వాల్మీకి రామాయణం 6-114-101).

**మరణాంతాని వైరాణి**–శత్రుత్వాలు మరణంతో అంతమయిపోయేవే.

**నిర్వృత్తం నః ప్రయోజనం**–మనం తలపెట్టిన కార్యం పూర్తయింది.

**క్రియతాం అస్య సంస్కారః**–ఇతని దహనసంస్కారం (యథావిధిగా) చేయవలసి ఉంది.

**మమ అపి ఏషః యథా తవ**–నాకు కూడా ఇతను నీకులాగే.

రాముడి ధర్మ పరాయణత్వం, ఉదాత్త స్వభావం చూడండి. తన భార్యను అపహరించి, తనతో ఘోరమయిన యుద్ధం చేసి, తనచేత చంపబడ్డ తన శత్రువు పట్ల ఆయన ఔదార్యం, హృదయ వైశాల్యం గమనించండి. "విభీషణా! దుష్టశిక్షణ కోసం ఈ రావణుడిని చంపాల్సి వచ్చింది కానీ, నిజానికి ఇతను నీకెట్లా సోదరుడో నాకూ అలాంటివాడే సుమా. అతని అంతిమ సంస్కారాలు సగౌరవంగా, సక్రమంగా నిర్వర్తించు!" అని తన భక్తుడూ, ఆశ్రితుడూ అయిన విభీషణుడికి చెప్తున్నాడు. **"ఉదార చరితానాం తు వసుధైక కుటుంబకమ్"** (ఔదార్యము గల మహానుభావులకు ఈ వసుధ అంతా ఒకే కుటుంబం) అన్న సుభాషితానికి శ్రీరాముడికంటే గొప్ప ఉదాహరణ ఉండదు.

**"రామో విగ్రహవాన్ ధర్మః సాధుః సత్యపరాక్రమః"** అని అంతకు ముందెప్పుడో అరణ్యకాండలో మారీచుడి లాంటి రాక్షసుడే రాముణ్ణి కీర్తించాడు (రామాయణం 3-37-13). 'రాముడు మూర్తీభవించిన ధర్మము, సాధు స్వభావుడు, సత్య పరాక్రముడు.' అది నూటికి నూరుపాళ్ళూ సత్యం.

# ఇది వ్రతం

**సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।**
**అభయం సర్వ భూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ ॥**

ఇది వాల్మీకి రామాయణం యుద్ధకాండలో విభీషణుడికి శరణు యిచ్చే సందర్భంలో రాముడు చెప్పినమాట (6-18-35).

**ఏతత్ వ్రతం మమ**-ఇది నా వ్రతం, దీక్ష

ఏమిటి వ్రతం? **తవ అస్మి ఇతి యాచతే ప్రపన్నాయ**- నీ వాడిని అని యాచిస్తూ దరికి చేరినవాడికి

**సర్వభూతేభ్యో**-ప్రాణికోటిలో ఎవరికయినా

**సకృత్ ఏవ**-వెంటనే, **అభయం దదామి**-అభయం ఇస్తాను.

హనుమంతుడు లంకాదహనం చేసి వెళ్ళిన తర్వాత, రావణుడు సిగ్గుపడిపోయి, రాముడిని యుద్ధంలో ఎలా జయించాలో చర్చించేందుకు మంత్రులందరితో సమావేశం జరిపాడు. ఇంద్రజిత్తు, రావణుడు వంటి మహావీరుల ఎదుట రాముడు ఓడిపోవటం ఖాయమన్నారు మంత్రులు. "నేనొక్కణ్ణే చాలు, రాముడి సేనల్ని ఓడించటానికి" అన్నాడు ప్రహస్తుడు. ఒక్క విభీషణుడు మాత్రమే "సర్వనాశనం అయిపోతావు, వెళ్ళి మర్యాదగా సీతని రాముడికి అప్పజెప్పిరమ్మ"న్నాడు.

కుంభకర్ణుడు "అన్నా! నువ్వు ముందూ, వెనకా ఆలోచించకుండా, మమ్మల్ని సంప్రదించకుండా సీతాపహరణం చేయడం పెద్ద పొరపాటు. అయితే, జరిగిందేదో జరిగింది. నేను జీవించి ఉండగా నీకు శత్రువు వల్ల ప్రమాదం లేకుండా నేను చూస్తాను. నిశ్చింతగా ఉండు" అన్నాడు. విభీషణుడు తన హితవు మరోసారి చెప్పి, ఇంద్రజిత్తు చేతా, రావణుడి చేతా తీవ్రంగా చీవాట్లు తిన్నాడు. ఇంక నీ కర్మ-అని రావణుణ్ణి వదిలి, ఆకాశమార్గంలో వెళ్ళి రాముడి శరణుజొచ్చాడు. సుగ్రీవాదులు విభీషణుడిని శత్రువుగా భావించి, శంకించి, అతనికి శరణం యివ్వటం ప్రమాదమన్నారు. హనుమంతుడు మాత్రం విభీషణుడికి శరణం యివ్వొచ్చని అభిప్రాయపడ్డాడు.

రాముడు అంతా విని ఇలా అన్నాడు : "శత్రువయినా శరణు కోరితే కాదనకూడదు. భయం వల్లో, స్వార్థం వల్లో, శరణు వేడినవాడిని రక్షించకపోవటం అధర్మం. శరణడిగిన వాడిని కాపాడకపోతే, వాడు నష్టపోతాడు, శక్తి ఉండీ శరణం యివ్వనివాడి సుకృతమంతా కూడా దాంతో నష్టమైపోతుంది.

"నేనుమాత్రం శరణడిగిన వాడిని కాపాడక మానను. ఇది నా వ్రతం. **ఆనయైనం హరిశ్రేష్ఠ దత్తమస్యా భయం మయా, విభీషణో వా సుగ్రీవ యది వా రావణః స్వయమ్**-సుగ్రీవా, వెళ్ళి అతనిని తీసుకురా. అతనికి నేను అభయమిస్తున్నాను. అతను విభీషణుడైనా సరే లేక స్వయంగా రావణుడే అయినా సరే."

# ఉపాయం

**శ్రీరామ రామ రామేతి - రమే రామే మనో రమే ।**

**సహస్రనామ తత్తుల్యం - రామ నామ వరాననే ॥**

విష్ణు సహస్రనామ పారాయణం చేసుకొనేవాళ్ళు రోజూ చదువుకొనే శ్లోకం.

**కేనోపాయేన లఘునా, విష్ణోర్నామ సహస్రకం, పఠ్యతే పండితైః నిత్యం శ్రోతుం ఇచ్ఛామి అహం ప్రభో** (తేలికయిన ఏ ఉపాయం వల్ల, విష్ణు సహస్రనామ స్తోత్రం, పండితులు నిత్యమూ పఠించవచ్చో, నేను వినగోరుతున్నాను స్వామీ!) అని పార్వతి పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తే, ఆయన ఈ ఉపాయం చెప్పారట :

**వర ఆనన!**–అందమైన ముఖం కల పార్వతీదేవీ!

**శ్రీరామ రామ రామ ఇతి**–శ్రీ రామ రామ రామ అంటూ, **మనోరమే రామే రమే**–మనస్సును ఆహ్లాదపరచే రాముడి యందు రమిస్తున్నాను, ఆనందాన్ని పొందుతున్నాను.

**రామ నామ**–రామనామము

**సహస్రనామ తత్తుల్యం**–వేయి నామాలకు అది సమానము.

అక్షరాలకూ అంకెలకూ లంకె పెట్టే కటపయాది పద్ధతి ఒకటున్నది. క ఖ గ ఘ ఙ, చ ఛ జ ఝ ఞ, అక్షరాలు వరుసగా 1 నుంచి 10 దాకా అంకెలకు సంకేతం. ఉదాహరణకు క అంటే ఒకటి, ఖ అంటే రెండు. జ అంటే 8. అలాగే 'ట' నుంచీ 'న' వరకు గల అక్షరాలు (ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న) వరసగా 1 నుంచీ 10 దాకా అంకెలను సూచిస్తాయి. 'ప' తో మొదలయ్యే ప ఫ బ భ మ ఒకటి నించీ అయిదు దాకా అంకెలకు గుర్తు. 'య' తో మొదలయ్యే య ర ల వ శ ష స హ ఒకటి నించీ ఎనిమిది దాకా అంకెలకు గుర్తు.

దీన్ని బట్టి మాయ అనే పదం లో 'మా' అయిదంకెనూ, 'యా' ఒకటి అంకెనూ సూచిస్తాయి. మాయ అనే పదం 51 ని సూచిస్తుంది.

'రామ'లో 'రా' యరలవల్లో రెండవది. రెండు అంకెను సూచిస్తుంది. 'మ' పఫబభమ వరసలో అయిదోది. అయిదు అంకెను సూచిస్తుంది. రామ, రామ, రామ అంటే 2 × 5 × 2 × 5 × 2 ×5 అంటే 10 × 10 × 10 అంటే 100 × 10 అంటే వెయ్యిని సూచిస్తుంది. శ్రీరామ రామ రామ అంటే వెయ్యిసార్లను సూచిస్తుందని ఒక వ్యాఖ్యానం.

# వేళాకోళం

**భిక్షార్థీ క్వ ప్రయాతః సుతను? బలిమఖే, తాండవం క్వాద్య భద్రే?**
**జానే బృందావనాన్తే, క్వ చ స మృగశిశుః? నైవ జానే వరాహం।**
**బాలే, కశ్చిన్న దృష్టః జరఠ వృషపతిః ? గోప ఏవాస్య వేత్తా**
**లీలా సల్లాప ఏవం జలనిధి హిమవత్కన్యయోః త్రాయతాం వః ॥**

ఇది మరొక చమత్కార చాటు శ్లోకం.

క్షీరాబ్ధి కన్యకకూ, హిమగిరి తనయకూ మధ్య సరసంగా జరిగిన సంభాషణ యిది. లక్ష్మీదేవి ఓసారి చుట్టపు చూపుగా కైలాసానికి వెళ్ళిందట. ఆమెకి తన పేదరాసి ఆడపడుచును చూస్తే చాలా అలుసు. ఆమె మొగుడు తన మొగుడి లాగా శ్రీమంతుడు కాదాయె. చూడగానే సూటీ పోటీ మాటలూ, ఎకసక్కాలూ మొదలెట్టింది. అభిమానవంతురాలు పార్వతి మాత్రం మాట పడుతుందా, ఠక్కున నసాళానికంటే జవాబులిచ్చింది. వాళ్ళ సంభాషణ చిత్తగించండి.

లక్ష్మి : **భిక్షార్థీ క్వ ప్రయాతః, సుతను**?–బిచ్చమడుక్కొనేందుకు ఎక్కడికి వెళ్ళాడు (మీ ఆయన), సుందరాంగీ?

పార్వతి : **బలిమఖే**–బలిచక్రవర్తి యజ్ఞానికి! (అడుక్కొనేందుకు మీ ఆయన వెళ్ళింది కూడా అక్కడికే గదా!)

లక్ష్మి : **తాండవం క్వ అద్య, భద్రే**–ఈరోజు తైతక్కలు ఎక్కడ, తల్లీ?

పార్వతి : **జానే బృందావన అంతే**–బృందావన ప్రాంతంలోనే అనుకొంటాను! (అక్కడేగా మీ ఆయన తైతక్కలాడేది!)

లక్ష్మి : **క్వ చ స మృగశిశుః**–ఎక్కడ ఆ (మీ అందాల) జంతువు పిల్లాడు (గణపతి)?

పార్వతి : **నైవ జానే వరాహం**–జంతువులూ, పందుల సంగతి నాకు తెలియదమ్మా. (తెలిస్తే నీకే తెలియాలి, వరాహ అవతారం ధరించింది మీ ఆయనే గదా!)

లక్ష్మి : **బాలే, కశ్చిత్ న దృష్టః జరఠ వృషపతిః**–పిల్లా! మీ ముసలి ఎద్దు (నందీశ్వరుడు) ఉండాలే, అది కనిపించటం లేదే?

పార్వతి : **గోప ఏవ అస్య వేత్తా**–ఎద్దులూ, ఆవుల విషయం గొడ్లు కాచుకొనే కాపరికి తెలియాలి! (నాకెలా తెలుస్తుంది, గొడ్లు కాచుకునే గోపాలకుడు నీ మొగుడినే అడుగు!)

**జలనిధి హిమవత్ కన్యయోః ఏవం లీలా సల్లాపః త్రాయతాం వః**–సముద్ర పుత్రికా, పర్వత పుత్రికల మధ్య ఇలాంటి సరస సల్లాపం మిమ్మల్ని కాపాడుగాక!

# నైచ్యానుసంధానం

**న ధర్మనిష్ఠోస్మి న చాత్మవేదీ, న భక్తిమాన్ త్వచ్చరణారవిందే ।**

**అకించనోనన్య గతిః శరణ్యం, త్వత్పాదమూలం శరణం ప్రపద్యే ॥**

**న నిందితం కర్మ తదస్తి లోకే సహస్రశః యన్న మయా వ్యధాయి ।**

**సోహం విపాకావసరే, ముకుంద! క్రందామి సంప్రత్యగతిః తవాగ్రే ॥**

ఈ శ్లోకాలు యామునాచార్యుల 'స్తోత్రరత్నం' లోవి. యామునాచార్యులు, విశిష్టాద్వైత స్థాపకులని చెప్పబడే శ్రీరామానుజాచార్యులకు పరమాచార్యులు. (ఆయన గురువు మహాపూర్ణులకు గురువు.) ఆయన తన కాలం నాటి పాండ్యరాజును తన వాద పటిమతో శైవం నించీ వైష్ణవానికి మార్చి, ఆయన నించీ అర్ధ రాజ్యం బహుమతిగా పొంది, కొన్నాళ్ళు రాజభోగాలు అనుభవించి వదిలేసి, శ్రీరంగనాథుడి సేవలో జీవితం గడిపారు. వైష్ణవాచార్య పరంపరలో యామునాచార్యులు సుప్రసిద్ధులు.

ఆయన రాసిన అనేక గ్రంథాల్లో, అరవయ్యయిదు శ్లోకాల 'స్తోత్ర రత్నం' వైష్ణవులు ఎంతో యిష్టంగా స్మరించుకొనేది. అందులో మచ్చుకు పై రెండు శ్లోకాలు. వైష్ణవ సంప్రదాయంలో ముఖ్యమయిన నారాయణ శరణాగతి, విష్ణు గుణస్తోత్రం, నేను అల్పుడిని అనే నైచ్యాను సంధానం యామునాచార్య స్తోత్రంలో ప్రస్ఫుటం.

**న ధర్మనిష్ఠః అస్మి, న చ ఆత్మవేదీ**–నేను ధర్మనిష్ఠుడినీ గాదు, ఆత్మజ్ఞానినీ కాదు

**న భక్తిమాన్ త్వత్–చరణారవిందే**– నీ చరణావిందముల యందు భక్తి గలవాడిని కాదు. **అకించనః అనన్యగతిః**–నిరుపేదను, మరో గతిలేనివాణ్ణి

**శరణ్యం త్వత్పాదమూలం శరణం ప్రపద్యే**–ఆశ్రయించదగిన నీ పాదపీఠాన్నే శరణు కోరుతున్నాను.

రెండో శ్లోకం అపరాధ క్షమాపణ :

**న నిందితం కర్మ తత్ అస్తి లోకే సహస్రశః యత్ న మయా వ్యధాయి**–ఈ ప్రపంచంలో దుష్కర్మలు అనే పనులన్నీ నేను చేసే ఉన్నాను. ఒకసారి కాదు, వేలసార్లు. **సోహం**–అలాంటి నేను **సంప్రతి విపాకావసరే**–ఇప్పుడు శిక్ష అనుభవించాల్సిన సమయంలో **అగతిః**–దిక్కులేక, **తవ అగ్రే**–నీముందు, **క్రందామి**–విలపిస్తున్నాను.

# భిక్షాందేహి

**నిత్యానంద కరీ! వరాభయకరీ! సౌందర్య రత్నాకరీ!**
**నిర్ధూతాఖిల ఘోర పాప నికరీ! ప్రత్యక్ష మాహేశ్వరీ!**
**ప్రాలేయాచల వంశపావన కరీ! కాశీ పురాధీశ్వరీ!**
**భిక్షాం దేహి, కృపావలంబనకరీ! మాతాన్నపూర్ణేశ్వరీ!**

శంకరాచార్యుల వారు వ్రాసిన శతాధిక స్తోత్ర రత్నాలలో, భక్తులకు ఎంతో ప్రియమయిన 'అన్నపూర్ణాష్టకం' ఒకటి. కాశీ అన్నపూర్ణేశ్వరిని ఉద్దేశించి చెప్పిన ఈ భవ్యమైన స్తోత్రంలో ఆచార్యుల వారు అనర్ఘ మణులను పొదిగారు. వాటిలో మచ్చుకొకటి, మొదటి శ్లోకం. తాత్పర్యం సులభం. అన్నీ సంబోధనలే.

**నిత్యానందకరీ**–నిత్యానందాన్ని కలిగించే దేవీ!

**వరా**–శ్రేష్ఠమయినదానా **అభయకరీ**–అభయం ఇచ్చే దేవీ! **సౌందర్య రత్నాకరీ**–సౌందర్య సముద్రమా!

**నిర్ధూత అఖిల ఘోర పాప నికరీ**–అన్ని ఘోర పాతకాల సమూహాన్ని తొలగించే తల్లీ!

**ప్రత్యక్ష మాహేశ్వరీ**–సాక్షాత్తూ మహేశ్వర పత్నీ!

**ప్రాలేయాచల వంశ పావనకరీ**–మంచుకొండ అయిన హిమాలయ పర్వత రాజవంశాన్ని పావనం చేసినదానా!

**కాశీ పురాధీశ్వరీ**–కాశీ నగరానికి అధిష్ఠాన దేవతా!

**భిక్షాం దేహి**–భిక్ష ప్రసాదించు

**కృపావలంబనకరీ**–కరుణాంతరంగా!

**మాతా! అన్నపూర్ణేశ్వరీ**–తల్లీ, అన్నపూర్ణేశ్వరీ!

# ఎందెందు వెదకిచూచిన

**అగ్నిర్దేవో ద్విజాతీనామ్, హృది దేవో మనీషిణామ్ ।**

**ప్రతిమా స్వల్పబుద్ధీనామ్, జ్ఞానినాం సర్వతో హరిః ॥**

దేవుడెక్కడుంటాడు? చెక్క బొమ్మల్లో, రాతి విగ్రహాల్లో దేవుడుంటాడా? బహు దేవతారాధన, విగ్రహారాధనా అనాగరికమైన, అశాస్త్రీయమయిన, హేతువిరుద్ధమయిన ఆచారాలంటారు కొందరు. 'ఇందుగలడందులేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుండు' అన్నాడు ప్రహ్లాదుడు.

'దేవుడి వైపు కాళ్ళు పెట్టి పడుకొన్నావేం?' అంటే 'ఏ దిక్కున దేవుడు లేడో చెపితే ఆ వైపు కాళ్ళు పెట్టుకొంటాను' అన్నాడు గురునానక్.

నిర్గుణుడు, నిరాకారుడయిన ఈశ్వరుడి మీద మనస్సు నిల్పి ధ్యానించటం కష్టం కనుక, ఏకాగ్రత కుదిరేదాకా ఆయన్ని విగ్రహరూపంలో ధ్యానించమన్నారు సనాతన సంప్రదాయంలో.

పై శ్లోకం భాగవతం లోది. ఏమంటున్నది?

**అగ్నిః దేవః ద్విజాతీనామ్**–ద్విజులకు అగ్నిహోత్రమే దేవుడు.

**హృది దేవః మనీషిణామ్**–మేధావులకూ, బుద్ధిశాలులకు హృదయంలోనే దేవుడు.

**ప్రతిమాసు అల్పబుద్ధీనామ్**–సామాన్యులకు విగ్రహాలలోనే (దేవుడు).

**జ్ఞానినాం సర్వతః హరిః**–జ్ఞానులకు అన్నిచోట్లా హరియే!

ఇలాంటిదే మరో ప్రసిద్ధ శ్లోకం చూడండి:

**అప్సు దేవాః మనుష్యాణామ్, దివి దేవాః మనీషిణామ్**

**బాలానాం కాష్ఠలోష్ఠేషు, బుద్ధేష్వాత్మని దేవతాః**

మనుషులకి తీర్థ జలాలలో దేవుడుంటాడు. కాస్త బుద్ధిమంతులు దేవుడు స్వర్గంలో ఉంటాడంటారు. సామాన్యభక్తులకు దేవుడు చెక్కముక్కల్లో, రాతిబొమ్మల్లో కనిపిస్తాడు.

మరి జ్ఞానులకు దేవుడు బయటెక్కడో లేడు. దేవతలందరూ తమలోనే ఉంటారు..

# కష్టాలు ప్రసాదించు దేవా!

**విపదః సంతు నః శశ్వత్ తత్ర తత్ర జగద్గురో ।**
**భవతః దర్శనమ్ యత్స్యాత్ అపునర్భవ దర్శనమ్ ॥**

**విపదః సంతు నః శశ్వత్** మాకెప్పుడూ కష్టాలు ఉండుగాక! అని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నది ఈ భక్తురాలు. ఈమె ఎవరో కాదు, కుంతీదేవి. భాగవతం ప్రథమ స్కంధంలో 'కుంతీస్తవ'మని, శ్రీకృష్ణుణ్ణి కుంతీదేవి స్తుతించే సందర్భం వస్తుంది. ఆ శ్లోకాలూ (వాటికి తెలుగు భాగవతంలో పోతనగారి అనువాదాలూ) ఎంతో ఉదాత్తంగా ఉంటాయి.

"అడుగడుగునా నన్నూ, నా బిడ్డల్నీ కంటికి రెప్పలా కాపాడుతూ వచ్చావు గదా, నందనందనా, నీ ఋణం ఎలా తీర్చుకోనయ్యా? నీ కన్నతల్లి దేవకీదేవిని ఎలా అయితే కష్టాలనించీ, కంసుడి చెర నించీ విడిపించావో, నన్నూ అలాగే రక్షిస్తూ వచ్చావు కదుటయ్యా! నిజానికి ఆమెని కొన్నేళ్ళు కష్టపడ్డ తర్వాత రక్షించావు, నన్నయితే ఎప్పుడు పిలిస్తే అప్పుడు పలికి కాపాడావు గదా!" అంటూ, కుంతి పై శ్లోకం కూడా చెప్తుంది.

**జగద్గురు! విపదః సంతు నః శశ్వత్**–జనార్దనా, మాకు విపత్తులు ఎప్పుడూ ఉండుగాక!

**తత్ర తత్ర భవతః అపునర్భవ దర్శనమ్ దర్శనమ్ యత్స్యాత్**

(ఆపదలు వచ్చిన) ఆయా సందర్భాల్లో నీ అపునర్భవ దర్శనమయిన దర్శనము కలుగుతుంది గదా! నీ దర్శనం కలిగితే ప్రాణికి జన్మరాహిత్యమే కనుక మరో పుట్టుక చూసే అవసరం ఉండదు. కనక నీ దర్శనం **'అపునర్భవ దర్శనమ్'**

'కేవలం సుఖాలే కలిగితే వాటి ధ్యాసలో నిన్ను మర్చిపోతాను, కాబట్టి నాకు ఎప్పుడూ కష్టాలు కలిగేటట్టు చెయ్యి స్వామీ! అప్పుడే నిన్ను నిరంతరం స్మరిస్తాను, భజిస్తాను. నీ దర్శనం పొందుతాను' అనేది నిజమయిన భక్తుడి ప్రార్థనయితే, అలాంటి భక్తులను కంటికి రెప్పలా కాపాడటం, ఆ భక్త వరదుడయిన జనార్దనుడి వ్రతం.

ఇలాగే విపత్తులూ, విష్ణు స్మరణాగురించి ఒక చక్కటి ప్రసిద్ధమయిన చాటువు చెప్తారు. వినండి:

**విపదోనైవ విపదః సంపదోనైవ సంపదః**
**విపద్విస్మరణం విష్ణోః సంపత్తస్యైవ సంస్మృతిః**

(విపత్తులంటే విపత్తులు కాదు. సంపదలంటే సంపదలూ కావు. విష్ణువును విస్మరిస్తే, అదే విపత్తు. విష్ణువును సంస్మరిస్తే అదే సంపత్తి.)

ఇవి తరచూ మననం చేసుకోదగిన, చేసుకోవాల్సిన సుభాషితాలు.

# పాదధూళి

**అవిద్యానా మంతః తిమిర మిహిరద్వీప నగరీ**

**జడానాం చైతన్య స్తబక మకరంద స్రుతి ఝరీ ।**

**దరిద్రాణాం చింతామణి గుణనికా, జన్మజలధౌ**

**నిమగ్నానాం దంష్ట్రా మురరిపు వరాహస్య భవతి ॥**

సౌందర్యలహరిలో మూడో శ్లోకం యిది. దేవి పాదరేణువు మహిమను వర్ణిస్తుంది

**అవిద్యానాం**–అవిద్యాగ్రస్తులయిన అజ్ఞానులకు

**అంతః తిమిర**–లోపలనున్న చీకటి తొలగించగల

**మిహిర ద్వీప నగరీ**–సూర్యునికి నెలవయిన ద్వీపనగరము.

**జడానాం**–జడులు, మూఢులయిన వారికి

**చైతన్య స్తబక మకరంద స్రుతి ఝరీ**–చైతన్యమనే పుష్పగుచ్ఛం నుంచీ జాలువారే మకరంద స్రావ ప్రవాహం.

**దరిద్రాణాం చింతామణి గుణనికా**–దారిద్ర్య బాధితులకు చింతామణి హారం

**జన్మజలధౌ నిమగ్నానాం**–సంసార జలధిలో మునిగిన వారికి (పైకెత్తేందుకు)

**మురరిపు వరాహస్య దంష్ట్రా భవతి**–మురారి అయిన వరాహమూర్తి కోర అవుతుంది.

పాదధూళి ప్రస్తావన ఈ శ్లోకంలో లేదు. ఇంతకు ముందు శ్లోకంలో ఉంది. 'తల్లీ! నీ చరణ పంకేరుహ భవమయిన ధూళిరేణువు, విరించి ధరించి ఎలాగో సృష్టి జరుపుతున్నాడు. ఆ ధూళినే విష్ణువు సహస్ర శిరస్సులతో మోస్తాడు. దానినే మెదిపి శివుడు విభూదిగా ధరిస్తున్నాడు' అని ఆ శ్లోకంలో చెప్పారు.

ఈ శ్లోకంలో 'ఆ పాదధూళి అవిద్యాంధకారాన్ని తొలగించే సూర్యకాంతి, జడత్వాన్ని రూపుమాపే చైతన్య ప్రవాహం. దరిద్రుల పాలిట చింతామణుల హారం. సంసారసాగరంలో మునిగిన వారిని బయట పడేసేందుకు వరాహరూపుడయిన విష్ణువు కోర' అంటున్నారు.

శ్లోకంలో గూఢార్థాలు, మంత్రార్థాల లోకి మనం వెళ్ళకపోయినా, పై శ్లోకంలో ఆచార్యుల కవితా సౌందర్యలహరీ విశేషాన్ని ప్రశంసించకుండా ఉండగలమా?

# చిట్కాలు

**ఉచ్చై రధ్యయనం, పురాతనకథాః, స్త్రీభి స్సహాలాపనం,**

**తాసామర్భక లాలనం, పతి నుతిః, తత్పాక మిథ్యాస్తవః ।**

**అంబాదేశ కరావలంబన మహో, సాముద్రికం జ్యౌతిషం**

**వైద్యం, గారుడ, మంత్ర తంత్ర కథనం భిక్షాటనే ద్వాదశే ॥**

ఫలవంతమైన భిక్షాటనకు పన్నెండు చిట్కాలు చెప్తున్నదీ చాటు శ్లోకం. దీని రచయిత ఎవరో తెలియదు, కానీ ఆ మహానుభావుడి సలహాలు మాత్రం 'కాకా'సురులు ఈనాటికీ పాటించడం చూస్తుంటాం.

చిట్కా ఒకటి, **ఉచ్చైః అధ్యయనం** పెద్దగా చదవటం. (తనకొచ్చిన శ్లోకాలో, పద్యాలో, పాటలో, మంత్రాలో వీలయితే సంస్కృతంలోనో, పాళీ భాషలోనో బిగ్గరగా చదువుతూ ఉంటే, దాతలు దానికి పడిపోవచ్చు.)

రెండు, **పురాతనకథాః**–ప్రాచీన కథలు. (దాతని కూర్చోబెట్టి పురాణమో, ఇతిహాసమో, అబ్బాసాలీ చరిత్రో, ఉప్పుసత్యాగ్రహం ఉదంతాలో, కనీసం చిన్ననాటి అనుభవాలో చెప్పటం.)

మూడు, **స్త్రీభిః సహ ఆలాపనమ్**–ఇంటి ఇల్లాలితో బాతాఖానీ

నాలుగు, **తాసాం అర్భక లాలనం**–వారి పిల్లల్ని ఎత్తుకొని ఆడించి లాలించటం

అయిదు, **పతి నుతిః**–వాళ్ళ భర్తలను పొగడటం

ఆరు, **తత్ పాక మిథ్యాస్తవః**–ఆవిడ వంట గురించి మాయ మాటల పొగడ్తలు

ఏడు, **అంబ–ఆదేశ–కర–అవలంబనం**–అంబ ఆదేశమంటూ చేయి ఊపటం

ఎనిమిది, **సాముద్రికం**–చేయి చూసి భవిష్యత్తు చెప్తానని కూర్చొని తిష్ఠ వేయటం

తొమ్మిది, **జ్యౌతిషం**–పంచాంగం, జాతకం చూసి జ్యోతిష్యం చెప్తానని కూర్చోడం

పది, **వైద్యం**–వాళ్ళ ఆరోగ్యం గురించి విచారించి, పనికిమాలిన చిట్కావైద్యాలు చెప్పటం

పదకొండూ, పన్నెండు, **గారుడ మంత్ర తంత్ర కథనం**–పాము, మంత్రాలూ, తంత్రాలూ చెప్పడం. గారుడ మంత్రాలు విష మంత్రాలు.

# కిం న సుందరం?

**సుందరే సుందరో రామః, సుందరే సుందరీ కథా**
**సుందరే సుందరీ సీతా, సుందరే సుందరం వనమ్ ॥**
**సుందరే సుందరం కావ్యం, సుందరే సుందరః కపిః**
**సుందరే సుందరం మంత్రం, సుందరే కిం న సుందరమ్ ॥**

రామాయణంలో సుందరకాండ గురించి శతాబ్దాలుగా వినబడుతున్న ప్రసిద్ధ శ్లోకాలు, కానీ ఎవరు రాశారో తెలియదు.

సుందరకాండలో రాముడు సుందరుడు. కథ అత్యంత సుందరమయినది. సీతాదేవీ చక్కని సుందరీమణి. సుందరకాండలో వర్ణించబడ్డ అశోకవనం బహు సుందరం.

వాల్మీకి మహర్షి అతి సుందరంగా మలచిన కావ్యం సుందరకాండ. సుందరకాండ నాయకుడు హనుమంతుడు. ఆయన సుందరుడు.

సుందరకాండ కేవలం కథా, కవిత్వమే గాదు. గొప్ప మంత్ర గ్రంథంగా పేరు గాంచింది. అందుకే అనేక రకాలయిన వాంఛాసిద్ధికి సుందరకాండ యథావిధిగా పారాయణం చెయ్యటం భారతదేశం అన్ని భాగాలలోనూ బహుకాలంగా నడుస్తున్న సంప్రదాయం. **'సుందరే సుందరం మంత్రం'** సుందరకాండలో మంత్రమూ సుందరమే.

ఏతా వాతా **'సుందరే కిం న సుందరమ్?'** సుందరకాండలో సుందరం కానిది ఏమున్నది?

భక్తి శ్రద్ధలతో సుందరకాండ రోజూ పారాయణం చేస్తే భగవదనుగ్రహం తప్పక కలుగుతుందంటారు. ఆది బుధ గురు శుక్ర వారాల్లో, విదియ తదియ పంచమి సప్తమి దశమి ఏకాదశి త్రయోదశి తిథుల్లో, ఆశ్వయుజ భాద్రపద ఆషాఢ మాసాలు తప్పా యితర మాసాలలో పారాయణం ప్రారంభించి చేస్తే శ్రీ సీతారామ హనుమదనుగ్రహం కలిగి విశేష కార్యసిద్ధి కలుగుతుందట.

**నమోస్తు రామాయ, సలక్ష్మణాయ, దేవ్యైచ తస్యై జనకాత్మజాయై**
**నమోస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో, నమోస్తు చంద్రార్క మరుద్గణేభ్యః**

అనే సుందరకాండ శ్లోకం చదివి ఆరంభించిన పని సఫలమవుతుందట. ఇందులో సీతా, రామ, లక్ష్మణ, రుద్ర, ఇంద్ర, యమ, అనిల, చంద్ర, అర్క, మరుద్గణాల స్మరణం ఉంది కదా. అందరి అనుగ్రహమూ లభిస్తే కార్యసిద్ధికి మరి అభ్యంతరమేముంటుంది?

# మాయ లేడి

**న నిర్మితో వై న చ దృష్ట పూర్వో**
**న శ్రూయతే హేమమయః కురంగః ।**
**తథాపి తృష్ణా రఘునందనస్య**
**వినాశకాలే విపరీత బుద్ధిః ॥**

ఇదొక చాటువు. రాసిన వారి పేరు తెలియదు కానీ **'వినాశ కాలే విపరీత బుద్ధిః'** అనే నానుడి మాత్రం లోక ప్రసిద్ధమయింది.

కర్మఫలాన్ననుసరించి, హాని వృద్ధులు మహారణ్యంలో దాక్కున్నా, రాకుండా పోవు. కర్మబద్ధుడయిన మనిషి జీవితమే పాపపుణ్య ఫలాలు అనుభవించడం కోసం సంభవించేది.

పాపఫలం అనుభవించాల్సిన రోజు వస్తే **'బుద్ధిః కర్మానుసారిణీ'** అని, ఎప్పుడూ రాని విచిత్రమయిన ఆలోచనలు కలుగుతాయి.

సకల సద్గుణోపేతుడు కదా శ్రీరామచంద్రుడు. ధీశాలి, వివేకవంతుడు, ధర్మజ్ఞుడు. అయితేనేమి, కష్టకాలం దగ్గిరకి వచ్చినపుడు ఈ మంచి లక్షణాలు అక్కరకు రావు.

'మాయలేడి కనిపించింది, అది వింత రంగుల బంగారులేడి, అది నాకు కావాలి!' అని ఎన్నడు వేడరాని సీతాదేవి కోరటమేమిటి? 'ఓ అలాగే, ఇప్పుడే వెళ్ళి దాన్ని తీసుకొస్తాను' అంటూ సాక్షాత్తూ శ్రీరామచంద్రుడు దాని వెనక పరుగెత్తడమేమిటి? ఆయనకు తెలియదా, సృష్టిలో బంగారు లేళ్ళు ఉండవని? అలాంటి లేడిని అంతకు ముందెప్పుడూ ఎవ్వరూ కనలేదు, వినలేదని ఆయనకు తెలియదా? విపత్కాలం దాపరించినపుడు బుద్ధి మామూలుగా పనిచేయదు. ఎంతో మేధావి కూడా అనాలోచితంగా అనవసరంగా తప్పటడుగు వేసి, రాబోయే ఆపదను అప్రయత్నంగా ఆహ్వానిస్తాడు. ఇది విచిత్రం.

**న నిర్మితః న చ దృష్ట పూర్వః**–మునుపు ఎప్పుడూ నిర్మించబడలేదు, చూడబడలేదు

**న శ్రూయతే హేమమయః కురంగః**–ఎప్పుడూ వినలేదు, బంగారులేడి (ఉంటుందని)

**తథా అపి తృష్ణా రఘునందనస్య**–అయినా రఘునందనుడికి దానిమీద కాంక్ష!

**వినాశకాలే విపరీత బుద్ధిః**–వినాశకాలంలో బుద్ధి కూడా విపరీతంగా పనిచేస్తుంది.

ఇక్కడ శ్రీరాముణ్ణి గురించి చెప్పినా, ఇలాంటి విపరీతబుద్ధి సాధారణంగా దుర్మార్గులకు వాళ్ళ పాపం పండి దుష్టకర్మల ఫలం అనుభవించాల్సిన కాలం వచ్చినపుడు, అనుకోకుండా కలగటం ప్రపంచ చరిత్రలో ఎన్నోసార్లు జరిగింది.

# అనగనగా

**రామో నామ బభూవ, హుం, తదబలా సీతేతి, హుం, తౌ పితుః**
**వాచా పంచవటీ తటే విహరతః తామాహర ద్రావణః ।**
**నిద్రార్థం జననీ కథామితి హరేః హుంకారతః శ్రుణ్వతః**
**"సౌమిత్రే! క్వధను ర్ధను ర్ధను" రితి వ్యగ్రాః గిరః పాతునః ॥**

ఇది 'రామకర్ణామృతం'లో ప్రస్తావించబడిన శ్లోకం. (3-116)

ఒక తల్లి తన బిడ్డను నిద్రపుచ్చేందుకు కథ చెప్తున్నదిట. ఆ తల్లి సామాన్యురాలు కాదు. ఆ బిడ్డ అంతకంటేను.

'రాముడు అనేవాడు ఉండేవాడు, **(రామో నామ బభూవ)'** అంది తల్లి.

'ఊఁ **(హుం)'** అంటూ ఊ కొడుతున్నాడు పిల్లవాడు,

'ఆ రాముడికి సీత అనే అబల భార్య **(తదబలా సీతేతి)'** అంది తల్లి.

మళ్ళీ ఊఁ కొట్టాడు **(హుం)** పిల్లవాడు.

**'తౌ పితుః వాచా పంచవటీ తటే విహరతః తాం ఆహరత్ రావణః**-వాళ్ళు పితృవాక్యం చేత (వనవాసం వెళ్ళి) పంచవటిలో విహరిస్తుండగా ఆమెను రావణుడు ఎత్తుకుపోయాడు' అంది తల్లి.

నిద్రార్థం, జనని, శ్రీరామకథను చెప్తూ ఉండగా, ఊఁ కొడుతూ, వింటున్న **(నిద్రార్థం జననీ కథాం ఇతి హరేః హుంకారతః శ్రుణ్వతః),** ఆ పిల్లవాడి గంభీరమయిన మాటలు మమ్మల్ని రక్షించుగాక **(వ్యగ్రాః గిరః పాతు నః)** అంటున్నాడు కవి.

ఇంతకీ ఆ పిల్లవాడి మాటలు ఏమిటి?

రావణుడు సీతను అపహరించాడు అని వినగానే, పిల్లవాడికి చాలా కోపం వచ్చింది.

**'సౌమిత్రే! క్వ ధనుః ధనుః ధనుః?**-ఓ లక్ష్మణా! ఎక్కడ నా ధనుస్సు, ధనుస్సు, ధనుస్సు?' అంటూ హడావిడిగా కేక వేశాడు.

యశోద బాలకృష్ణుడిని నిద్రపుచ్చటానికి, రామాయణ కథ కథగా చెపితే, బాలకృష్ణుడు తన వెనకటి అవతారంలో జరిగిన సీతాపహరణ ఘట్టంలో, ఆవేశపడి, యుద్ధానికి సన్నద్ధుడయ్యాడు, అని కవి చమత్కరించాడు.

మరోసారి శ్లోకం చదవండి. అందులో చెక్కిన శబ్దచిత్రమూ, చమత్కారం గమనించండి.

# కృష్ణం వందే

**సంధ్యావందన భద్రమస్తు భవతే! భో స్నాన! తుభ్యం నమః**
**భో దేవాః పితరశ్చ తర్పణ విధౌ నాహం క్షమః, క్షమ్యతామ్ ।**
**యత్రక్వాపి నిషీద్య యాదవ కులోత్తంసస్య కంసద్విషః**
**స్మారం స్మార మహం స్మరామి తదలం మన్యే, కి మన్యేన మే?**

ఈ స్నానాలూ, సంధ్యలూ నావల్ల కాదు, ఒక్క నమస్కారం. ఈ దేవతార్చనలూ, పితృ తర్పణాలూ యథావిధిగా చేసే శక్తి నాకు లేదు. క్షమించండి. నాకసలు యివన్నీ ఎందుకు? ఎక్కడో ఖాళీగా ఉన్నచోట కాసేపు కూర్చొని కంస సంహారకుడయిన ఆ యాదవ కులోత్తముడి పేరు స్మరిస్తూ ఉంటాను. నాకు అది చాలు ననుకొంటున్నాను అంటున్నాడు కవి.

ఇది కృష్ణ కర్ణామృతంలో శ్లోకం. కవి లీలాశుకుడు. ఈ లీలాశుకుడు 11వ శతాబ్దం వాడు. ఈయన అసలు పేరు బిల్వమంగళుడనీ, యౌవనంలో వేశ్యాలోలుడై, వ్యసనలంపటుడై తిరిగాడనీ, తరువాత ఆ వేశ్యే ఈయనకు సన్మార్గ దర్శనం చేసిందనీ చెప్తారు. 310 శ్లోకాలతో కృష్ణుడిని స్తుతించే 'కృష్ణ కర్ణామృతం'లో శ్లోకాలు నిజంగా కర్ణామృతమే. చదివేందుకూ, వినేందుకూ ఎంతో బావుంటాయి.

**సంధ్యావందన! భద్రం అస్తు భవతే**–సంధ్యావందనమా! నీకు శుభం కలుగుగాక!

**భో స్నాన! తుభ్యం నమః**–ఓ స్నానమా! నీక్కూడా ఓ నమస్కారం!

**భో దేవాః! పితరః చ! తర్పణ విధౌ న అహం క్షమః, క్షమ్యతాం!**–ఓ దేవతలారా! పితృదేవతలారా! దేవతర్పణాలూ పితృ తర్పణాల వంటి కార్యాలలో నాకు ఓపిక లేదు, క్షమించండి!

**యత్ర క్వ అపి నిషీద్య**–ఎక్కడో అక్కడ, కూర్చుని

**యాదవ కులోత్తంసస్య కంస ద్విషః**–యాదవ కులానికి శిరోభూషణమయిన కంస శత్రువును,

**స్మారం స్మారం**–స్మరిస్తూ, స్మరిస్తూ

**అహం స్మరామి, తత్–అలం మన్యే; కిం– అన్యేన మే?**–నేను స్మరిస్తున్నాను, అది చాలు అని భావిస్తున్నాను; ఇతర విషయాలతో నాకేమిటి?

# అతి ధ్వని

**అజా యుద్ధే, ఋషి శ్రాద్ధే, ప్రభాతే మేఘడంబరే ।**

**దంపత్యోః కలహే చైవ బహ్వారంభః లఘుక్రియా ॥**

కొన్ని విషయాలలో ఆరంభం చాలా ఆడంబరంగా, పటాటోపంగా ఉంటుంది. కానీ ఈ హడావిడి తాటాకు మంట లాగా చప్పున చప్పబడుతుంది. చివరికి తుస్సుమనిపిస్తుంది. అలాంటి కొన్ని సన్నివేశాలను ఈ పంచతంత్ర శ్లోకంలో చెప్పారు.

మేకల యుద్ధం (అజా యుద్ధం) చూడండి. మే, మే అంటూ మేక గోలతో ఎంత యుద్ధం జరగబోతున్నదో అన్న భావాన్ని కలిగిస్తుంది. నిజానికి యుద్ధం దాకా వచ్చేటప్పటికి మేకలది సాధుస్వభావం. అసలు యుద్ధమంటూ ఏమీ జరగదు. అదే గొర్రె పొట్టేళ్ళయితే అతి భయంకరంగా ఒకదాన్ని ఒకటి కుమ్ముకొంటూ యుద్ధం చేసుకోవటం చూస్తుంటాం.

అలాగే ఋషుల ఇళ్ళలో శ్రాద్ధ కర్మలు (ఋషి శ్రాద్ధాలు). వీటిలో మంత్రాల ఘోష మారుమోగచ్చు. కానీ భోజనాలూ, దక్షిణల విషయాలకు వచ్చేసరికి అతి నిరాడంబరం. ఆడంబరాలకూ, ఆటోపాలకూ వాళ్ళకి శక్తిచాలదు.

పొద్దున్నే కనబడే ప్రభాత మేఘాలు ఒక్కొక్కప్పుడు డబడబా ఉరుముతాయి. వాటివల్ల వర్షపాతం అంతంత మాత్రమే.

అలాగే దంపతుల మధ్య కలహాలు. ఒక్కోసారి పొరుగు వారందరూ భయపడేలా కేకలూ, అరుపులతో పోట్లాడుకొంటారు. ఈ కాపురం యిక నిలబడేది లేదు అనిపిస్తుంది. పావుగంట తర్వాత, పొరుగువాళ్ళు ఆ విషయం మాట్లాడుకొంటూ న్యాయాన్యాయాలు చర్చిస్తూ ఉంటారేమో కాని, పోట్లాడుకున్న ఆలుమగలు మాత్రం ఏమీ జరగనట్లే కలిసిపోతారు.

ఇలా కొన్ని విషయాల్లో బహు ఆరంభం, లఘు క్రియా.

**'అజా యుద్ధే'** – మేకలయుద్ధంలో, **'ఋషి శ్రాద్ధే'** – ఋషుల ఇళ్ళ శ్రాద్ధాలలో

**'ప్రభాతే'** – తెల్లవారుఝాములో, **'మేఘడంబరే'** – మబ్బుల సమూహంలో

**'దంపత్యోః కలహే చ ఏవ'** – దంపతుల కలహంలో కూడా

**'బహు ఆరంభః'** – ఆరంభం గొప్ప, **'లఘుక్రియా'** – క్రియ తక్కువ

# ఇది చాలు

**అనాయాసేన మరణం వినా దైన్యేన జీవితం ।**
**దేహాంతే తవ సాయుజ్యం దేహి మే పార్వతీ పతే ॥**

అభిమానవంతుడయిన మనిషి కోరుకొనేది మితిలేని భోగభాగ్యాలు, సుఖసౌఖ్యాలూ కాదు.

బ్రతికినన్నాళ్ళూ మరొకడి ముందు చేయి చాచి యాచించవలసిన అవసరం లేకుండా, దుర్భర దారిద్ర్యమూ, దైన్యతా లాంటి దౌర్భాగ్యం లేకుండా జీవితం గడిచిపోతే, అదే కోట్ల విలువ. ఇంతకు మించి ధన, కనక, వస్తు, వాహనాల వలన ప్రయోజనం ఏమీ లేదు.

అలాగే అభిమానవంతుడికి జరా, మృత్యువులంటే భయం ఉండదు. భయం ఆరోగ్యం గురించి, ముసలితనం మీద పడితే పడనీ, వ్యాధిబాధలు లేకుండా. దానికేమీ భయపడేది లేదు. మంచాన పడి తీసుకొని తీసుకొని, తను బాధపడి యితరులను బాధపెట్టాల్సి వస్తుందేమోనని భయం. అలా కాకుండా మృత్యువు ప్రాప్తించి, అనాయాసంగా ప్రాణంపోతే, దాన్ని గురించి చింతే లేదు. **'జాతస్య హి ధ్రువో మృత్యుః '** పుట్టినవాడికి చావు తథ్యం.

ఈ అభిమానవంతుడికి అలాగే మరో చిన్న కోరిక. 'మృత్యువు తరవాత, వీలయితే మరి పునర్జన్మ లేకుండా నీతో కలిసిపోయి శాశ్వతమయిన బంధమోక్షాన్ని పొందనిచ్చావా, అంతకు మించి ఇంక కావలసింది ఏమీ లేదు!

ఈ చాటు శ్లోకానికి కర్త ఎవరో తెలియదు.

**అనాయాసేన మరణం**–ఆయాసం లేకుండా సునాయాసంగా మృత్యువు

**వినా దైన్యేన జీవితం**–దైన్యత లేకుండా జీవితం

**దేహ అంతే తవ సాయుజ్యం**–మరణం తర్వాత నీలో సాయుజ్యం

**దేహి మే, పార్వతీపతే**–నాకు ప్రసాదించు, పరమేశ్వరా!

కోరికలు చిన్నవే గానీ, చాలా గడుసువి. ఈ కోరికలు భగవంతుడు తీరిస్తే ఈ ప్రపంచంలో జీవన యాత్రలో కష్టమనేది లేనట్టే.

# చార్వాకం

**యావజ్జీవేత్సుఖం జీవేత్, ఋణం కృత్వా ఘృతం పిబేత్ ।**
**భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః ॥**

భారతీయ దర్శనాలలో చార్వాక మతం ఒకటి ఉంది. వీళ్ళు నాస్తికులు, భౌతికవాదులు. 'మనకు ప్రత్యక్షంగా కళ్ళ ఎదురుగా కనిపిస్తున్నదే ప్రపంచం. ఇదే సత్యం. దీనికి మించిన మరే సత్యం లేదు. ఎందుకో పుట్టాం, ఎందుకో గిడతాం. పుట్టుకకు ముందూ జన్మలూ గిన్మలూ లేవు, చావు తర్వాతా అంతే. వేదాలూ, వేదోక్తమయిన కర్మకాండలూ, వేదాంతమని చెప్పే ఉపనిషద్వాదాలూ వీటన్నిటికీ ఏ ప్రమాణమూ లేదు. ఆత్మా, పరమాత్మా మనం చూడగలిగేవి కాదు. కాబట్టి, యివన్నీ అభూతకల్పనలే, అని స్థూలంగా వీళ్ళ విశ్వాసం.

మరి జీవిత ధ్యేయం ఏమిటి? అదే చార్వాకులు పై శ్లోకంలో చెప్పుకొన్నారు.

**యావజ్జీవేత్ సుఖం జీవేత్**–ఎంతకాలం జీవిస్తామో (అంతకాలమూ) సుఖంగా జీవించాలి.

**ఋణం కృత్వా ఘృతం పిబేత్**–అప్పుచేసి, నెయ్యి తాగాలి.

**భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః**–భస్మీభూతమయిపోయిన దేహానికి పునరాగమనం (పునర్జన్మ) ఎలా ఉంటుంది?

'చారు వాక్కులు' మనోహరమయిన మాటలు చెప్తారు కనక వీళ్ళని చార్వాకులన్నారు. వీళ్ళ గురువు 'బృహస్పతి' అనే దార్శనికుడు. (దేవగురువు బృహస్పతి కాదు). ఇది నాస్తిక దర్శనం. అంటే వీళ్ళు వేదాన్ని ప్రమాణంగా ఒప్పుకోరు. దేవుడున్నాడని గానీ, పరలోకాలుంటాయని గానీ నమ్మరు.

సనాతన ధర్మం బోధించే ఆచార్యుల పరంపరలో ఎవరూ చార్వాకాన్ని సమర్థించరు. సిద్ధాంతపరంగా వీరు చెప్పే మతంలో చాలా లొసుగులున్నాయి. వీరి సిద్ధాంతాలు కొంచెం ప్రమాదకరం కూడా. పశుప్రాయంగా పుట్టి, గిట్టడం, కేవలం భౌతిక సుఖాలనుభవించడం మించి మానవజన్మకి మరే ప్రయోజనం లేదనటం సరికాదు అనటంలో శంకర, రామానుజ, మధ్వాది ఆచార్యులకెవరికీ ఎలాంటి సందేహం లేదు.

అయితే ప్రస్తుతం మన చుట్టూ ఉన్న ప్రపంచంలో తెలిసో, తెలియకో ఈ మతాన్ని అవలంబించేవారూ, ఈ సిద్ధాంతాలను పాటించేవారే ఎక్కువగా కనిపిస్తున్నారు.

# చార్వాకం-2

**పశుశ్చే న్నిహతః స్వర్గం జ్యోతిష్టోమే గమిష్యతి**
**స్వపితా యజమానేన తత్ర కస్మాన్న హన్యతే?**
**మృతానామపి జంతూనాం శ్రాద్ధం చే తృప్తి కారణమ్**
**గచ్ఛతామిహ జంతూనాం వ్యర్థం పాథేయ కల్పనమ్ ॥**

ఈ శ్లోకాలు కూడా చార్వాక సిద్ధాంతానికి సంబంధించినవి. “నేను చూడని వస్తువు సృష్టిలో లేనట్లే లెక్క. ఉన్నదని ఒప్పుకోను. ఏ ఋషో ‘దర్శించి’ చెప్పాడంటే నేను నమ్మను. ప్రత్యక్ష ప్రమాణమే సత్యానికి రుజువు” అంటారు వీరు. ‘నేను లండన్ చూడలేదు కనుక లండన్ ఉన్నదని నేను ఒప్పుకోను. లండన్ నగరం ఉన్నదీ, మేం చూసొచ్చాం అని చెప్పేవాళ్ళంతా మోసగాళ్ళు!’ అన్న వాదం సహేతుకమయినదేనా? చార్వాకుల వాదం, స్థూలంగా, అలా ఉంటుంది.

‘నేను పట్టిన కుందేలుకు మూడుకాళ్ళే. ఎందుకంటే, నాలుగో కాలు నాకు యింకా కనబడలేదు. కనక లోకంలో కుందేళ్ళన్నింటికీ మూడుకాళ్ళే. కాదన్నవాళ్ళు మోసగాళ్ళు, దొంగలు’. యిదే హేతువాదమనటం సబబు కాదని వీరు ఒప్పుకోరు.

రకరకాల గుడ్డి నమ్మకాలనూ మతమేనని నమ్మే చాదస్తులూ, ‘మేమెరగనిదేమీ లేదు. ఎవరయినా ఉన్నదంటే వాళ్ళు బుద్ధిహీను’లని చాటే చార్వాకులూ ఉత్తర, దక్షిణ ధ్రువాలుగా కనిపిస్తారు.

పై శ్లోకాలు చార్వాకులు వైదికమయిన కర్మకాండను నిరసిస్తూ చెప్పినవి.

**పశుః చేత్ నిహతః స్వర్గమ్ జ్యోతిష్టోమే గమిష్యతి**–జ్యోతిష్టోమ యజ్ఞంలో హతమయిన పశువే స్వర్గానికి పోగలిగినట్లయితే

**స్వపితా యజమానేన తత్ర కస్మాత్ న హన్యతే**–అక్కడ, యజ్ఞంచేసే యజమానుడి చేత, సొంత తండ్రి ఎందుకు చంపబడడు? (ఆ జంతువుకు బదులు తండ్రిని చంపితే తండ్రి స్వర్గానికి వెళతాడు కదా?)

**మృతానామపి జంతూనాం శ్రాద్ధం చేత్ తృప్తి కారణమ్**–చనిపోయిన ప్రాణులకు శ్రాద్ధం తృప్తికారణం అయితే

**గచ్ఛతామిహ జంతూనాం వ్యర్థం పాథేయ కల్పనం**–ప్రయాణం చేసే మనుషుల కోసం, తిండి కట్టి యివ్వడం వ్యర్థం. వాళ్ళ బదులు, ఎవరయినా యింటిదగ్గర భోంచేస్తే, వాళ్ళ ఆకలి తీరుతుంది గదా!

# రేపు నీదే(నా)?

**వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్**
**నిశార్థమర్థం దివసే యతేతి ।**
**వార్థక్య హేతోర్వయసా నవేన**
**పరత్ర హేతో రిహ జన్మనా చ ॥**

ఇది ఒక సుభాషితం. అన్ని కాలాలు ఒకలాగా సాగవు కనుక, మనిషి మంచికాలం ఉన్నప్పుడే, తరువాత రాగల గడ్డుకాలం కోసం ముందు జాగ్రత్త పడడం మంచిదని బోధిస్తుంది.

ఏడాదిలో నాలుగు నెలలు వర్షాకాలం, పనులు సరిగా సాగవు. సంపాదన కుంటుపడచ్చు. కనుక మిగిలిన ఎనిమిది నెలలలోనే ప్రయత్నించి, వర్షాకాలం నాలుగు నెలలకు కూడా గ్రాసానికి, తదితరమయిన అవసరాలకూ తగిన ఏర్పాట్లు చేసుకొంటే, కష్టాలు తప్పుతాయి. అలాగే రాత్రి పనిచేయలేం కాబట్టి, పగలే రాత్రికి కావలసిన వస్తు విశేషాలు అమర్చుకోవాలి. వయసు మీరిన తర్వాత రాగల యిబ్బందులను ఎదుర్కొనేందుకు, వయసులో ఉన్నప్పుడే ముందు జాగ్రత్తలు అవసరం. అలాగే మృత్యువు తరువాత ఈ లోకం వదిలి, పరలోకాల కెక్కడికో పోవటం తప్పదు కనుక ఈ శరీరం అనే ఉపాధి ఉన్నప్పుడే, ఇహలోకం లోనే పరలోకంలో శ్రేయస్సు పొందగలిగే విధంగా సాధనలు చేయడం మంచిది.

**వర్షార్థం అష్టౌ ప్రయతేత మాసాన్**–వర్షాకాలం కోసం ఎనిమిది మాసాలు ప్రయత్నాలు చేసుకోవాలి.

**నిశా అర్థం అర్థం దివసే యతేతి**–రాత్రి కొరకు మిగిలిన సగం దినంలో యత్నం చేయాలి.

**వార్థక్య హేతోః వయసా నవేన**–వృద్ధాప్యదశ కోసం యౌవన కాలంలో

**పరత్ర హేతోః ఇహ జన్మనా చ**–పరలోకం కోసం ఇక్కడి జన్మతో (ప్రయత్నించాలి)

జీవితకాలమంతా ఇహలోకంలో సంపాదన కోసం, దారా పుత్ర ప్రయోజనాల కోసం పూర్తిగా వినియోగించి, ఎంత చేసినా ఏమి సంపాదించినా, ఒకనాటికి అవన్నీ, ఆ నామరూపాలతో సహా యిక్కడే వదిలేసి వెళ్ళాల్సిందే కదా! తదనంతరం ప్రయోజనాల కోసం ఏం తీసికెళ్ళగలుగుతున్నాం అన్నది ఆలోచించాల్సిన విషయం. లేకపోతే, వయసులో ఉన్నప్పుడు విరివిగా సంపాదించి, వయసులోనే అదంతా విరివిగా ఖర్చు కూడా చేసేసిన వృద్ధుడు వృద్ధాప్యంలో కనీసావసరాలు తీర్చుకోలేక కష్టాల పాలయినట్టూ, ఇబ్బంది పడవలసి వస్తుంది.

# ప్రత్యక్ష దైవాలు

**యా సృష్టిః స్రష్టు రాద్యా, వహతి విధి హుతం యా హవిః, యాచహోత్రీ**
**యేద్వే కాలం విధత్తః, శ్రుతి విషయ గుణా యా స్థితా వ్యాప్య విశ్వమ్ ।**
**యామాహుః సర్వభూత ప్రకృతి రితి, యయా ప్రాణినః ప్రాణవంతః**
**ప్రత్యక్షాభిః ప్రపన్నః తనుభి రవతు వః తాభి రష్టాభిరీశః ॥**

ఇది అభిజ్ఞాన శాకుంతలమ్ నాటకంలో మొట్టమొదటి శ్లోకం. శివభక్తుడయిన కాళిదాసు పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాడు.

ఈశ్వరుడికి ఎనిమిది ప్రత్యక్షమయిన శరీరాలున్నాయట. ఆ ఎనిమిది ప్రత్యక్షరూపాలతో కూడిన ఈశ్వరుడు మిమ్మల్ని రక్షించుగాక, అని కవి ప్రార్థన. ఇంతకీ ఏమిటి ఆ ఎనిమిది రూపాలు?

ఒకటి, **'యా-స్రష్టుః-సృష్టిః-ఆద్యా'**-ఏదయితే సృష్టికర్త యొక్క మొట్టమొదటి సృష్టిగా ఏర్పడిందో (జలము)

రెండు, **'వహతి-విధిహుతం-యా-హవిః'**-ఏదయితే యథావిధిగా యజ్ఞహవిస్సును మోస్తుందో (అగ్ని)

మూడు, **'యా-చ-హోత్రీ'**-ఎవరు ఋత్విక్కో (యజ్ఞం చేయించే పురోహితుడు-ఋత్విక్కు)

నాలుగూ, అయిదూ, **'యే-ద్వే-కాలం-విధత్తః'**-ఏ యిద్దరూ కాలాన్ని సృష్టిస్తారో (సూర్య, చంద్రులు)

ఆరు, **'శ్రుతి విషయ గుణా-యా-స్థితా-వ్యాప్య విశ్వమ్'**-ఏదయితే శబ్దం గుణంగా కలిగి, విశ్వమంతా వ్యాపించి ఉందో (ఆకాశం)

ఏడు, **'యాం-ఆహుః-సర్వ-భూత-ప్రకృతిః-ఇతి'**-ఎవరిని సర్వభూత ప్రకృతి అంటారో (భూమి)

ఎనిమిది, **'యయా ప్రాణినః ప్రాణవంతః'**-ఎవరివల్లనయితే ప్రాణులకు ప్రాణశక్తి లభిస్తుందో (వాయువు)

**'తాభిః-అష్టాభిః-ప్రత్యక్షాభిః-తనుభిః-ప్రపన్నః'**-ఆ ఎనిమిది ప్రత్యక్షమయిన తనువులతో కూడి ఉన్నవాడయిన

**'ఈశః-వః-అవతు'**-పరమేశ్వరుడు మిమ్మల్ని రక్షించుగాక!

# హరి

**వైద్యరాజ నమస్తుభ్యం**
**యమరాజ సహోదర!**
**యమస్తు హరతి ప్రాణాన్**
**వైద్యో ప్రాణాన్ ధనాని చ.**

**"శరీరే, జర్జరీ భూతే, వ్యాధిగ్రస్తే, కళేబరే, ఔషధం జాహ్నవీతోయం వైద్యో నారాయణో హరిః"** అని శ్లోకం చెప్పుకొంటూ, మందు తీసుకుంటే, ఆ మందు మరింత త్వరగా పనిచేస్తుందని పూర్వకాలంలో ఒక నమ్మకం. (శిథిలమయిన, రోగగ్రస్తమయిన ఈ శరీరానికి ఔషధం గంగాజలం. శ్రీమన్నారాయణుడయిన హరి వైద్యుడు)

కాలం మారిపోయింది. మనుషులూ మారిపోయారు. వైద్యులు కొత్త కొత్త పద్ధతులతో చికిత్సలు చేస్తున్నారు. ఒకరు కుడిచెవి నిపుణులూ, మరొకరు ఎడమచెవి నిపుణులూ. **'ధనమూల మిదం జగత్'** కాబట్టి కొందరు వైద్యులు, రోగి ఆరోగ్య పరిస్థితీ, ఆర్థిక పరిస్థితీ రెంటినీ సమీక్షించి, అనుసంధానం చేసి రోగి రోగం కుదిర్చే రోజులకు వచ్చాం. ఈ కాలానికి అనుగుణమయిన పై శ్లోకాన్ని కొందరు వైద్యులు ఉటంకిస్తూ ఉంటారు.

**వైద్యరాజ, నమః తుభ్యం**–వైద్యశ్రేష్ఠా, నీకో నమస్కారం.

**యమరాజ సహోదర!**–యమధర్మరాజు సోదరుడా!

**యమః తు హరతి ప్రాణాన్**–యముడు ప్రాణాలే తీసుకెళతాడు.

**వైద్యః ప్రాణాన్ ధనాని చ**–వైద్యుడు ప్రాణాలూ, ధనాలూ రెండూ తీసేస్తాడు.

# అమరం

**యస్య జ్ఞాన దయాసింధో రగాధ స్యానఘా గుణాః ।**
**సేవ్యతా మక్షయోధీరాః స శ్రియై చామృతాయచ ॥**

అమరకోశం సంస్కృతంలో శ్లోకరూపంలో ఉన్న అద్భుతమయిన నిఘంటువు. సంస్కృత విద్యార్థుల చేత బాల్యంలోనే, మొట్టమొదటే ఇది వల్లె వేయించటం సంప్రదాయం.

అమరకోశాన్ని అమరసింహుడనే జైనుడు రాశాడట. ఈయన శంకరాచార్యుల సమకాలికుడు. మహాపండితుడు. శంకరుల దిగ్విజయం సందర్భంలో, ఆయన అమరసింహుడిని వాదానికి పిలిచారట. శంకరులతో తను వాదించి గెలవలేననే భయం వల్ల అమరసింహుడు, జైనుడైనా, సరస్వతిని ఉపాసించాడట. ఆమె దయ దల్చి, 'వాదనకి ముందు, నీకూ శంకరుడికి మధ్య ఒక తెర కట్టి, నన్ను ఆవాహన చేయి. నేను వచ్చి నీ బదులు శంకరుడి ప్రశ్నలకు జవాబిస్తాన'ని చెప్పిందట. అలాగే వాదం మొదలయిందట. అమరసింహుడి బదులు సాక్షాత్తూ సరస్వతే సమాధానాలిస్తున్నదని శంకరుడికి తెలిసిపోయిందట.

'తల్లీ! వేదబాహ్య మతం అవలంబించిన నాస్తికుడి పక్షాన నువ్వెలా వాదిస్తావమ్మా?' అని శంకరుడు ప్రార్థించగా తల్లి అంతర్ధానమయిపోయింది. వాదంలో అమరసింహుడు ఓడిపోయి, ఆ పరాభవం సహించలేక తను రాసిన గ్రంథాలన్నీ ఒక్కొక్కటే నిప్పులో వేసి కాల్చేయడం ప్రారంభించాడట. ఆ విషయం శంకరులకు తెలిసి ఆయనే వచ్చి, 'నీ మతం వేరయితేనేమి, నీ గ్రంథాలు గొప్పవి. వాటిని నాశనం చేయద్దు' అని వారించాడట. అప్పటికి కాలకుండా ఒక్కపుస్తకమే మిగిలిందట. అదే అమరకోశం.

పై శ్లోకం అమరకోశంలో మొదటి శ్లోకం.

**ధీరాః**–ధీరులారా!

**యస్య జ్ఞాన దయాసింధోః అగాధస్య అనఘాః గుణాః**–ఏ జ్ఞాన, కరుణా సముద్రుడయిన పరమేశ్వరుని కయితే అంతులేని సద్గుణాలున్నాయో, **'సః అక్షయః'** – ఆ క్షయములేని ఈశ్వరుడు

**సేవ్యతామ్**–సేవించబడాలి.

**శ్రియై చ అమృతాయ చ**–సంపద కొరకు, అమృతత్వానికి (మోక్షానికి).

ఒకానొకప్పుడు సంస్కృతం నేర్చుకొనే కొంటెకుర్రాళ్లు, కొందరు బడిలోంచి రహస్యంగా జారుకొనే ధ్యాసలో, గురువుగారికి అమరం అప్పజెప్పేప్పుడు పై శ్లోకాన్ని **'యస్య జ్ఞాన దయాసింధోః–గోడ దూకితే అదే సందోః'** అని చెప్పేసి భంగపడ్డారని ఓ పిట్టకథ!

# లీలలు

**అంభోధిః స్థలతాం, స్థలం జలధితాం, ధూళీలవః శైలతామ్**
**మేరుర్మృత్కణతాం, తృణం కులిశతాం, వజ్రో తృణప్రాయతామ్ ।**
**వహ్నిః శీతలతాం హిమం దహనతాం ఆయాతి యస్యేచ్ఛయా**
**లీలా దుర్లలితాద్భుత వ్యసనినే దేవాయ తస్మై నమః ॥**

**దేవాయ తస్మై నమః**–ఆ భగవంతుడికి నమస్కారం అని ముగుస్తున్నది.

**లీలా దుర్లలిత అద్భుత వ్యసనినే**–లీలలూ, క్లిష్ట కార్యాలూ, అద్భుతాలు వ్యాసంగంగా గల

**దేవాయ తస్మై నమః**

ఎలాంటి లీలలు?

**యస్య ఇచ్ఛయా**–ఎవరి ఇచ్ఛ మాత్రం గానే,

**అంభోధిః స్థలతాం ఆయాతి**–సముద్రం భూమిలా, స్థలంగా మార్పును పొందుతుందో,

**స్థలం జలధితాం**–స్థలము సముద్రంగా (మారుతుందో),

**ధూళీలవః శైలతామ్**–దుమ్ము కణం పర్వతం (అయిపోగలదో),

**మేరుః మృత్ కణతామ్**–మేరు పర్వతము మట్టి రేణువంత (అయిపోగలదో),

**తృణం కులిశతామ్**–గడ్డిపరక వజ్రాయుధం లా (మారగలదో),

**వజ్రో తృణ ప్రాయతామ్**–వజ్రాయుధం గడ్డిపోచలా (అయిపోగలదో),

**వహ్నిః శీతలతామ్**–అగ్ని చల్లగా (మారుతుందో),

**హిమం దహనతామ్**–మంచు అగ్నిగా (మారగలదో),

**దేవాయ తస్మై నమః**–ఆ దేవుడికి నమస్కారం

సర్వశక్తిమంతుడయిన భగవంతుడు ఘటనాఘటన సమర్థుడు. ఆయన ఇచ్ఛవల్ల ఏదయినా సాధ్యం.

**మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిం**
**యత్కృపా తమహం వందే, పరమానంద మాధవమ్**

(మూగవాణ్ణి వాగుడుకాయగా చేయగలదీ, కుంటివాడిని కొండపైకి ఎవరి కృప గెంతించగలదో ఆ పరమానంద స్వరూపుడైన మాధవుణ్ణి నమస్కరిస్తున్నాను) అనే మరో ప్రసిద్ధ శ్లోకాన్ని ఈ శ్లోకం జ్ఞప్తికి తెస్తున్నది.

ఈ శ్లోకం బల్లాలసేనుడి 'భోజప్రబంధం'లో కనిపిస్తుంది.

# పెద్దగా చెప్పేందుకేముంది?

**వక్తవ్యం కిము విద్యతేత్ర బహుధా? బ్రహ్మైవ జీవ స్స్వయమ్**
**బ్రహ్మైతజ్జగదాపరాణు సకలం, బ్రహ్మాద్వితీయం శ్రుతేః।**
**బ్రహ్మైవాహమితి ప్రబుద్ధ మతయః సంత్యక్త బాహ్యాః స్ఫుటం**
**బ్రహ్మీ భూయ వసంతి సంతత చిదానందాత్మనైవ ధ్రువమ్ ॥**

ఈ శ్లోకం ఆదిశంకరుల 'వివేక చూడామణి' గ్రంథంలోది (శ్లోకసంఖ్య 395). వివేక చూడామణి శంకరులు వ్రాసిన ప్రకరణ గ్రంథాలలో మకుటాయమానం. ప్రకరణ గ్రంథాలంటే సులభశైలిలో, అట్టే పాండిత్యం, పరిజ్ఞానం లేని వేదాంత విద్యార్థులకు వేదాంతబోధ చేసే పరిచయ గ్రంథాలు. వేదాంతంలో మూలగ్రంథాలు (ఉపనిషత్తులూ, బ్రహ్మసూత్రాలూ, గీతా యిత్యాదులు) విశ్వవిద్యాలయ స్థాయి గ్రంథాలలాంటివయితే, భాష్య గ్రంథాలు కళాశాల స్థాయి గ్రంథాలు, ప్రకరణ గ్రంథాలు స్కూలు స్థాయి గ్రంథాలుగా చెప్పుకోవచ్చు నంటారు స్వామి చిన్మయానంద.

**వక్తవ్యం కిము విద్యతే అత్ర బహుధా**–విస్తారంగా చెప్పడానికి ఏమి ఉంది ఇక్కడ?

**బ్రహ్మ ఏవ జీవః స్వయమ్** – సాక్షాత్తూ పరబ్రహ్మమే జీవుడు.

**బ్రహ్మ ఏతత్ జగత్ ఆపరాణు సకలం** – పరమాణువుతో ఆరంభించి ఈ జగత్తంతా బ్రహ్మమే.

**బ్రహ్మ అద్వితీయం శ్రుతేః** – బ్రహ్మ అద్వితీయమని శ్రుతుల (మాట).

**(ఏకమేవ అద్వితీయం బ్రహ్మ, ఆత్మైవ ఇదం సర్వం** అని ఉపనిషత్తులు చెప్తున్నాయ్)

**బ్రహ్మ ఏవ అహం–ఇతి–ప్రబుద్ధ మతయః–సంత్యక్తబాహ్యాః స్ఫుటం బ్రహ్మీభూయ–వసంతి–సంతత చిదానందాత్మనా–ఏవ–ధ్రువం** ప్రబుద్ధమతులు (అంటే, బ్రహ్మ జ్ఞానులు) బ్రహ్మయే నేను అని, బాహ్య విషయాలు త్యజించి, స్పష్టంగా, బ్రహ్మీభూతులై, బ్రహ్మముతో ఐక్యత తెలుసుకొని సంతత చిదానందస్థితితోనే వసిస్తారు. ఇది తథ్యం.

ఇది శంకరుల అద్వైతసారం.

'ఈ విషయాన్ని ఎంత విస్తరించి చెప్పి ఏమి లాభం? ఈ విషయం శ్రవణం, మననం, నిదిధ్యాసనం (ధ్యానం) చేసి, ఆ సాధనతో పరబ్రహ్మమే నేనని గుర్తించి, మీరున్నూ బ్రహ్మత్వం పొంది బ్రహ్మీభూతులు కావాలి' అని జగద్గురువుల సందేశం.

**బ్రహ్మ సత్యం, జగన్మిథ్య, జీవో బ్రహ్మైవ, న అపరః** అన్న అర్ధ శ్లోకంలో అర్థాన్ని అనుభవపూర్వకంగా తెలుసుకొంటే, అద్వైతసిద్ధి కలిగినట్లే. సాధన చేయగా, చేయగా ఈ జన్మకో, పై జన్మలలోనో సిద్ధించే మహాభాగ్యం అది.

# సూక్తి వైరాగ్యం

**బోద్ధారో మత్సరగ్రస్తాః - ప్రభవః స్మయ దూషితాః ।**
**అబోధోపహతాశ్చాన్యే - జీర్ణమంగే సుభాషితమ్ ॥**

భర్తృహరి నీతి శతకంలో మొదటి సుభాషితం. చిత్రం చూడండి. సుభాషితాలన్నిట్లో మొదటిది 'సుభాషితం ఎవరికీ చెప్పి లాభం లేదు, నీలోనే ఉంచుకొ'మ్మని!

సుభాషితం పండితులకు చెప్పాలంటే, వారు వినరూ, మెచ్చరూ, ఆచరించే ప్రశ్నే లేదు. కారణం, **బోద్ధారః మత్సరగ్రస్తాః** పండితులు మాత్సర్యగ్రస్తులు, కుళ్ళుబోతులు.

పోనీ ఏ రాజుకో, జమీందారుకో, మంత్రివర్యుడికో చెప్పాలంటే, **ప్రభవః స్మయ దూషితాః**-ప్రభువులు గర్విష్ఠులు, ఒకరు చెప్పేది వినరు.

పెద్దవాళ్ళతో ఏం పనీ, మిగిలిన పామరజనానికే చెప్పొచ్చు గదా అంటే, **అబోధా-ఉపహతాః-చ-అన్యే**-ఇతరులు, అబోధ, అజ్ఞానం వల్ల ఉపహతులు, దెబ్బతిని ఉన్నారు. వీళ్ళకు చక్కని సుభాషితం అర్థం చేసుకొనే శక్తీ లేదూ, ఆచరించే తీరికా లేదు.

అందువల్ల **జీర్ణం అంగే సుభాషితం** చెప్పదలచుకొన్న సుభాషితం మనసులోనే యింకిపోయింది.

తమ తమ అనుభవంవల్ల నేర్చుకొన్న రెండు మంచిముక్కలు మరొకడికి చెబుదామనుకొన్న వాళ్ళందరూ ఈనాటికి కూడా ఎదుర్కొనే యిబ్బందే యిది. మనం చెప్పేది పండితులకు రుచించదు, ఎందుకంటే పండితులలో సమకాలికులయిన యితర పండితులను మెచ్చే సద్గుణం చాలా అరుదు. పామరులకు ఈ మంచిమాటలు పట్టవు, ఒక పాళాన బుర్రకెక్కవు. కూటికీ, గుడ్డకూ పనికిరాని చెత్తగా కనిపిస్తాయి. మరి ఎవరికోసం ఈ సుభాషితం?

క్రీ.శ. ఒకటో శతాబ్దం వాడట భర్తృహరి. అంటే రెండు వేల సంవత్సరాల పూర్వం. అప్పటికీ యిప్పటికీ ఈ సమస్య సర్వకాలీనంగా నిలిచిఉండటం విశేషమే. దీనికి భవభూతి చెప్పుకొన్న సమాధానం ఈ పుస్తకంలోనే మరో చోట యివ్వబడింది.

# శివ-శివా

**శివః శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం ।**
**న చే దేవం దేవః న ఖలు కుశలో స్పందితు మపి ॥**
**అతస్త్వాం ఆరాధ్యాం హరి హర విరించాదిభి రపి ।**
**ప్రణంతుం స్తోతుం వా కథ మకృతపుణ్యః ప్రభవతి ॥**

శంకరుల సౌందర్యలహరీ స్తోత్రం కవిత్వపరంగానూ, భక్తిపరంగానూ, మంత్ర, తంత్ర శాస్త్ర పరంగానూ ఉత్కృష్టమయిన, అద్భుతమయిన స్తోత్రం. దాన్ని చదివినవారికి వాళ్ళ వాళ్ళ స్థాయిని బట్టి రామణీయకాలూ, గూఢార్థాలు గోచరిస్తాయి. అందులో మొట్టమొదటి శ్లోకం ఇది.

**శివః శక్త్యా యుక్తో యది**-శివుడు శక్తితో కలిసి ఉంటే గనుక

**ప్రభవితుం శక్తః భవతిః**-సృష్టించడానికి శక్తుడై, సమర్థుడై ఉంటాడు

**న చేత్ ఏవం**-అలా కాకపోయినట్లయితే

**న ఖలు కుశలః స్పందితుం అపి**-కదిలేందుకు, స్పందించేందుకు కూడా కుశలుడయి, శక్తికలవాడయి ఉండడు సుమా.

**అతః**-అందుచేత, **త్వాం ఆరాధ్యాం హరి హర విరించాదిభిః అపి**-హరి, హర బ్రహ్మాదుల చేత ఆరాధ్యవు, పూజనీయవయిన నిన్ను

**ప్రణంతుం స్తోతుం వా**-నమస్కరించటానికి గానీ, స్తుతించటానికి గానీ

**కథం అకృత పుణ్యః, ప్రభవతి**-పుణ్యం చేసుకొని ఉండని అకృతపుణ్యుడు, ఎలా సమర్థుడవుతాడు?

ఇది స్థూలార్థం. ఈశ్వరుడు చైతన్యస్వరూపుడు, కానీ నిష్క్రియుడు, నిర్గుణుడు. త్రిగుణాత్మకమయిన శక్తితో కలిస్తే కాని ఏమీ సృష్టించలేడు. అయితే, ఇది చమత్కారంగా చెప్పిన మాటే. శివుడూ, శివుడి శక్తీ ఎప్పుడూ విడదీయలేకుండా కలిసి ఉంటాయి కనుక. నిప్పునించీ, వేడిని విడదీసి వేడిలేనినిప్పు కాల్చలేదు అని చెప్పొచ్చా? వేడి అనే ధర్మం (శక్తి) లేకపోతే నిప్పు నిప్పుకాదు.

శివతత్త్వంతో ఐక్యాన్ని పొంది శివ-శక్తి-ఐక్య-రూపిణిగా ఉండే పరాశక్తి శివేచ్ఛవల్ల, సృష్టి ప్రథమంలో ఆ శివతత్త్వం నుంచీ అభివ్యక్తమై, సృష్టికార్యాన్ని నిర్వహిస్తుంది.

# జన్మాంతర సౌహృదాలు

**రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్**
**పర్యుత్సుకో భవతి యత్సుఖితోపి జంతుః ।**
**తచ్చే తసా స్మరతి నూన మబోధపూర్వమ్**
**భావస్థిరాణి జననాంతర సౌహృదాని ॥**

అభిజ్ఞాన శాకుంతలం నాటకంలో పంచమాంకంలో కాళిదాసు చెప్పిందీ శ్లోకం (5.2). సుఖంగా ఉన్న ప్రాణి కూడా ఒక్కొక్క సందర్భంలో ఒక చక్కని దృశ్యం చూసినా, ఒక కమ్మని నాదం విన్నా చలించిపోతుంది. ఆ దృశ్యం వల్లనో, శబ్దం వల్లనో కలిగిన అనుభూతి మనసును కదిలించి, అంతకు పూర్వం తెలియని ఒక కలతనూ, ఉద్వేగాన్నీ కలుగచేస్తుంది. బహుశా దానికి కారణం వెనక జన్మలలో ఎప్పుడో ఏర్పడిన సంబంధాలు కావచ్చు.

**రమ్యాణి వీక్ష్య**–రమ్యమైన దృశ్యాలను చూచీ,

**మధురాన్ చ నిశమ్య శబ్దాన్**–మధురమైన శబ్దాలను వినీ,

**పర్యుత్సుకో భవతి యత్ సుఖితః అపి జంతుః**–సుఖంగా ఉన్న ప్రాణి కూడా ఒక చెప్పలేని ఉద్వేగానికి లోనవుతుంది.

**తత్ చేతసా స్మరతి నూనం అబోధ పూర్వం**–నిజంగా మునుపెరుగని ఏదో అనుభూతిని ఆ ప్రాణి మనసులో స్మరిస్తుంది.

**భావస్థిరాణి జనన అంతర సౌహృదాని**–వెనక జన్మల అనుబంధాలు ఆ ప్రాణి భావాలలో తెలియకుండా చోటు చేసుకొని ఉంటాయి.

'ఏ విచారమూ లేకుండ, సుఖముగానున్న మానవుడు మనోహరమైన దృశ్యములను చూచుచు, మధురమైన శబ్దములను వినుచు, ఆనందమును పొందుటకు బదులు ఒకప్పుడు మనస్సులో ఏదో కలత చెందును. అతనికి అంతకుముందు అనుభవమునకు రాక, చైతన్యములో నిగూఢముగా నున్నట్టి పూర్వజన్మ స్నేహములు, ఆ క్షణమున జ్ఞప్తికి రాదొడంగుటయే దానికి కారణము. (ఇది) ఒక అసాధారణమైన మానసిక తత్త్వ రహస్యము. ఈ శ్లోక రచన వలన 'కవీనాం కవి' యగు కాళిదాసు 'గురూణాం గురు'వై లోకమున కొక పరమసత్యముపదేశించెను'–ఆచార్య పింగళి లక్ష్మీకాంతం– 'సాహిత్య శిల్ప సమీక్ష' (1966).

# వాక్చాతుర్యం

**నానృగ్వేద వినీతస్య నాయజుర్వేద ధారిణః ।**
**నాసామవేద విదుషః శక్యమేవం ప్రభాషితుమ్ ॥**
**నూనం వ్యాకరణం కృత్స్నమ్ అనేన బహుధాశ్రుతమ్ ।**
**బహువ్యాహరతానేన న కించిదపశబ్దితమ్ ॥**

వాల్మీకం కిష్కింధ కాండలో హనుమంతుడి పాండిత్యాన్ని గురించి శ్రీరాముడు చెప్పిన మాటలు యివి (రామాయణం 4-3-29,30). "ఋగ్వేదం నేర్వనీవాడికీ, యజుర్వేదం తెలియనివాడికీ, సామవేదంలో విద్వాంసుడు కానివాడికీ ఇలా మాట్లాడటం శక్యం కాదు. ఇతని చేత వ్యాకరణం కూలంకషంగా నేర్చుకోబడింది. ఇన్ని మాటలు మాట్లాడినా ఇతని చేత ఒక్క అపశబ్దమూ పలకబడలేదు".

రావణుడు సీతను ఎత్తుకుపోయిన తర్వాత, ఆమె కోసం వెదుకుతూ, దుఃఖిస్తూ రామలక్ష్మణులు, కబంధుడి సలహా ప్రకారం, సుగ్రీవుణ్ణి కలిసేందుకు పంపాతీరంలో ఉన్న ఋశ్యమూక పర్వతం దగ్గిరకి వెళ్ళారు. వాలికి భయపడి ఋశ్యమూకం మీద నివసిస్తున్న సుగ్రీవుడు రామలక్ష్మణులను చూసి మొదట వాళ్ళు వాలి మనుషులని కంగారుపడ్డాడు. తన మంత్రి హనుమంతుడిని రామలక్ష్మణుల వృత్తాంతమేమిటో కనుక్కురమ్మని పంపాడు.

హనుమంతుడు తన కపిరూపం వదిలి, సన్న్యాసి వేషంలో వాళ్ళ దగ్గరకు చేరి, నమస్కరించి, వాళ్ళతో మాట్లాడాడు : "ఓ సజ్జనులారా, స్ఫురద్రూపులారా, రాజకుమారులారా! నేను వాయుసుతుడిని, వానరుడిని, కామరూపశక్తికలవాడిని, వాలి వల్ల రాజ్యం పోగొట్టుకొని ఋశ్యమూకం మీద దుఃఖిస్తూ తిరుగుతున్న సుగ్రీవ మహారాజు మంత్రిని. ఆయన పంపగా మీ వృత్తాంతం తెలుసుకొనేందుకు వచ్చాను. చెప్తారా?" అన్నాడు. హనుమంతుడు వాక్యజ్ఞుడు, వాక్యకుశలుడు. ఎంతో నేర్పుగా మాట్లాడగలవాడు. (ఆయన వాక్చాతుర్యాన్ని రామాయణంలో అనేక సందర్భాల్లో అనేకులు ప్రశంసిస్తారు)

అతని మాటల ధోరణి శ్రీరాముడికి ఎంతో సంతోషాన్ని కలిగించింది.

ఆ సందర్భంలో రాముడు లక్ష్మణుడితో చెప్పిన మాటలు ఇవి. అర్థమూ, అన్వయమూ సులభమే.

**నానృగ్వేద వినీతుడు** - ఋగ్వేదంలో శిక్షితుడు కానివాడు కానివాడు. అంటే ఋక్ యజుర్, సామ వేదాలలో శిక్షితుడు అయిన వాడికే యిలా మాట్లాడటం సాధ్యం అవుతుంది అని అర్థం.

**న అయజుర్వేద ధారీ** - యజుర్వేద పండితుడు కానట్టివాడు కానివాడు,

**న అసామ వేద విద్వాన్** - సామవేద విద్వాంసుడు కానట్టివాడు కానివాడు, (మాత్రమే యిలా మాట్లాడగలడు)

ఇంత చక్కగా మాట్లాడితే, చంపటానికి కత్తి ఎత్తిన శత్రువు కూడా చల్లబడాల్సిందే (**'కస్య న ఆరాధ్యతే చిత్తం ఉద్యతాసేః అరే రపి?'**)-అని కూడా అంటాడు రాముడు (4.3.34). ఈ ఘట్టంలోనే శ్రీరామ-ఆంజనేయుల సంబంధానికి బీజం పడింది!

# అర్థి

**జాతం వంశే భువన విదితే పుష్కరావర్తకానామ్**
**జానామి త్వాం ప్రకృతి పురుషం కామరూపం మఘోనః ।**
**తేనార్థిత్వం త్వయి విధివశాద్దూర బంధు ర్గతోహం**
**యాచ్నా మోఘా వర మధిగుణే నాధమే లబ్ధ కామా ॥**

మేఘదూత కావ్యం కాళిదాసు రాసినది. కుబేరుడి కొలువులో పనిచేసే ఒక యక్షుడు, తన సేవలో చూపిన అప్రమతత్తకు శిక్షగా, అతనికి ఒక సంవత్సరకాలం దేశాంతర వాసం సంభవించింది. భార్యావిరహంతో వేగిపోతున్న ఆ యక్షుడికి ఆషాఢమాసంలో, వర్షాకాలంలో, విరహాన్ని తట్టుకోవడం మరింత కష్టమైపోయింది. ఆకాశంలో కనిపించి, పయనిస్తున్న మేఘుడి ద్వారా యక్షుడు తన భార్యకొక సందేశం పంపటం ఈ కావ్యంలో విషయం. కావ్యం మొదటినించీ చివరిదాకా, సుమారు 120 శ్లోకాలు, యక్షుడు మేఘుడికి పెట్టుకొన్న మొర మాత్రమే. మేఘదూత కావ్యంలోది పై శ్లోకం.

ఓ మేఘమా! ప్రళయకాలంలో ఈ లోకాల్నే ముంచెత్తగల, ప్రసిద్ధమయిన పుష్కర ఆవర్తక మేఘాల వంశంలో పుట్టిన ధన్యుడివి నువ్వు. కోరినరూపం ధరించగలవాడివి. ఇంద్రుడికి ప్రధాన సహాయకుడివి. మరి నేను విధి వశం వల్ల బంధువియోగం పొంది నీ సహాయం అభ్యర్థించే స్థితిలో ఉన్నాను. నీకు చేసిన అభ్యర్థన వ్యర్థమయినా కూడా నాకు బాధ లేదు. నీవంటి గుణవంతుడికి చేసిన అభ్యర్థన వ్యర్థమయినా అది గుణహీనుడికి చేసిన ఫలవంతమయిన ప్రార్థన కంటే, చాలా నయం! అల్పుణ్ణి యాచించి ఫలం పొందటం కంటే, మహానుభావుణ్ణి యాచించి ఫలం పొందలేక పోయినా అదే ఉత్తమం.

**జాతం–వంశే–భువన–విదితే–పుష్కర–ఆవర్తకానాం జానామి త్వాం** పుష్కర–ఆవర్తకాలనే–భువన ప్రసిద్ధమయిన–మేఘాల–వంశంలో–పుట్టినవాడివిగా నిన్ను నేనెరుగుదును. **కామ రూపం**–కామరూప శక్తిగలవాడివిగా, **మఘోనః ప్రకృతిపురుషం** –ఇంద్రుడి ప్రధాన సహాయకుడిగా, **జానామి త్వాం**–నిన్నెరుగుదును.

**తేన అర్థిత్వం త్వయి విధివశాత్ దూరబంధుః గతః అహం**–అందువల్ల విధివశాన, బంధువులకు దూరమయిన నేను నీయందు అర్థిత్వానికి (సహాయం కోరే స్థితికి) వచ్చాను.

**యాచ్నా మోఘా వరం అధిగుణే న అధమే లబ్ధ కామా**–అధముడి నుద్దేశించి చేసిన ఫలవంతమయిన యాచన కంటే ఉత్తముడి నుద్దేశించి చేసిన వ్యర్థమయిన యాచన శ్రేష్ఠం. (**యాచ్న** అంటే యాచన. **మోఘా** అంటే వ్యర్థం. **లబ్ధకామా**–లభించిన కోరిక గలది, లేక ఫలవంతమయినది. **వరం**–శ్రేష్ఠం)

# కొత్తా - పాతా

**పురాణమిత్యేవ న సాధు సర్వం**
**న చాపికావ్యం నవమిత్యవద్యం ।**
**సన్తః పరీక్ష్యాన్యతరద్భజంతే**
**మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః ॥**

లోకం పోకడలో చాలా విషయాల్లో 'కొత్తొక వింత, పాతొక రోత' అనే పద్ధతి చూస్తూ ఉంటాం. కానీ సాహిత్య విషయాలలో అప్పుడప్పుడు దీనికి వ్యతిరేకంగా 'పాతకవుల లాగా కొత్త కవులు రాయలేరు. ఆ రోజులే వేరు, ఆ కవులే వేరు' అనే అభిప్రాయం కూడా వినిపిస్తుంటుంది. క్రొత్తగా కావ్యమో నాటకమో రాసుకొన్న కవులకు వెంటనే ప్రజాదరణ లభించటం తరచుగా జరగదు. ఈ పోకడ కూడా మానవనైజంలో ఎప్పటినించో వస్తున్నది. కాళిదాస మహాకవికి కూడా యిలాంటి యిబ్బంది తప్పినట్లు లేదు.

అందుకే 'మాళవికాగ్నిమిత్రం' నాటకం మొదట్లోనే సూత్రధారుడి చేత పై శ్లోకం పలికించాడు (1.2)

పాతదనగానే అంతా మంచి అనటానికి వీలులేదు. అలాగే కొత్త కావ్యమనగానే అది దోష భూయిష్ఠమయిన చెత్త అనుకోవడం సరికాదు. సద్విమర్శకులు పరీక్షించి, అందుకు వ్యతిరేకంగా కూడా భావించవచ్చు. మరొకరి అభిప్రాయం ఎలా ఉంటే, తమ అభిప్రాయం కూడా అలాగే మలుచుకొనే పర ప్రత్యయ నేయ బుద్ధులు మూర్ఖులు. వారి అభిప్రాయానికి ఎలా విలువనిస్తాం?

**పురాణం ఇతి ఏవ న సాధు సర్వం**–పాతది అనే (ఓ వస్తువు) పూర్తిగా మంచిది అయిపోదు.

**న చ అపి కావ్యం నవం ఇతి అవద్యం**–కావ్యం కొత్తది అని దోషపూరితం కాదు కూడా

**సంతః పరీక్ష్య అన్యతరత్ భజంతే**–సద్విమర్శకులు పరీక్షించి మరో రకంగా భావించుతారు.

**మూఢః పర ప్రత్యయ నేయ బుద్ధిః**–మూర్ఖుడు మాత్రమే పరుల అభిప్రాయము పట్టి నడుచుకొనే బుద్ధి గలవాడుగా ఉంటాడు.

ఇప్పుడు మరొకసారి శ్లోకం చదివితే భావం స్పష్టంగా బోధపడుతుంది.

# నారాయణ సూక్తం

**ఓం! సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వ శంభువమ్।**
**విశ్వం నారాయణం దేవం అక్షరం పరమం పదం॥**
**విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్।**
**విశ్వమే వేదం పురుషః తద్విశ్వ ముపజీవతి॥**
**పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్।**
**నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్॥**
**నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణః పరః।**
**నారాయణ పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః॥**

ఇది నారాయణ సూక్తంలో భాగం. నారాయణ సూక్తం తైత్తిరీయ ఆరణ్యకంలో వస్తుంది (4-10-13). వేదమంత్రాలు గురుముఖతః నేర్చుకొని, ఉచ్చారణ లోపాలు లేకుండా చదవాలి, గ్రంథాలనించీ మంత్రాలు చదవడం నేర్చుకోరాదనీ, దానివల్ల దుష్ఫలితాలు కలగొచ్చనీ పెద్దలు చెబుతారు.

**సహస్ర శీర్షం**-వెయ్యి తలలు కలవాడిని, **దేవం**-ప్రకాశిస్తున్నవాడిని, **విశ్వాక్షం**-సమస్తమూ చూస్తున్నవాడిని, **విశ్వ శంభువమ్**-లోకానికి మంగళము కలిగించేవాడిని, **విశ్వం**-లోకమే తానయినవాడిని, **పరమం పదం**-పరమపదము (అత్యున్నత స్థితి) అయిన వాడిని,

**విశ్వతః**-విశ్వం కంటే, **పరమాత్**-ఉన్నతమయినవాడిని, **నిత్యం**-నిత్యుడినీ, **విశ్వం**-విశ్వరూపమయిన వాడిని, **నారాయణగ్ం హరిం**-నారాయణుని, హరిని (నమస్కరిస్తున్నాను, ధ్యానిస్తున్నాను) **విశ్వమ్ ఏవ ఇదం పురుషః**-ఈ పురుషుడే విశ్వము.

**తత్ విశ్వం ఉపజీవతి**-అతని మీద విశ్వము ఆధారపడి ఉంది. **పతిం విశ్వస్య**-విశ్వమునకు నాధుడు అయినవానిని, **ఆత్మేశ్వరగ్ం**-జీవులకు ఈశ్వరుని, **శాశ్వతగ్ం**-శాశ్వతుని, **శివం**-మంగళ స్వరూపుడిని, **మహాజ్ఞేయమ్**-విశేషముగా తెలుసుకొనదగినవాడిని, **విశ్వఆత్మానం**-ఎల్లరకూ ఆత్మ అయినవాడినీ, **పరాయణమ్**-శరణు కోరదగిన వాడినీ నమస్కరిస్తున్నాను, **నారాయణః పరోజ్యోతిః**-నారాయణుడే పరంజ్యోతి, **ఆత్మా నారాయణః పరః**-నారాయణుడే పరమాత్మ, **నారాయణః పరంబ్రహ్మ**-నారాయణుడే పరబ్రహ్మ, **తత్త్వంనారాయణః పరః**-నారాయణుడే పరతత్త్వము.

వేదమంత్రముల ఉచ్చారణ, అర్థములూ వేదపండితులయిన గురుముఖంగా నేర్చుకోవాలి. పై అనువాదం రామకృష్ణ మఠం, చెన్నై వారి 'సస్వర వేదమంత్రాలు' పుస్తకాన్ని అనుసరించి మంత్రార్థం గురించి పైపై అవగాహన కోసం మాత్రమే చెప్పబడింది.

# భాగవతోత్తముడు

**సర్వభూతేషు యః పశ్యేత్ భగవద్భావ మాత్మనః**
**భూతాని భగవత్యాత్మన్ యేన భాగవతోత్తమః ॥**
**ఈశ్వరే, తదధీనేషు, బాలిశేషు, ద్విషత్సుచ**
**ప్రేమమైత్రీ కృపోపేక్షా యః కరోతి స మధ్యమః ॥**
**అర్చయామేవతు హరేః పూజయా శ్రద్ధ యేహతే**
**న తద్భక్తేషు చాన్యేషు స భక్తః ప్రాకృతః స్మృతః ॥**

భక్తులలో తర తమ భేదాలు పై మూడు శ్లోకాల్లో చెప్పబడ్డాయి. ఇవి భాగవతం ఏకాదశ స్కంధంలో శ్లోకాలు.

**సర్వభూతేషు యః పశ్యేత్ భగవద్భావం ఆత్మనః** – ఎవరయితే అన్ని భూతాల లోనూ తనలో నున్న భగవంతుణ్ణే చూస్తాడో, **భూతాని భగవతి ఆత్మని** – తనలోని భగవంతుని యందు అన్ని భూతాలూ, **యేన** – ఎవరిచేత (చూడబడతాయో), **భాగవతోత్తమః** – (అతడు) భాగవతోత్తముడు.

**ఈశ్వరే, తదధీనేషు, బాలిశేషు, ద్విషత్సు చ – ప్రేమ, మైత్రీ, కృపా, ఉపేక్షా, యః కరోతి స మధ్యమః** – ఈశ్వరుడి మీదా, ఈశ్వర శరణాగతులయిన భక్తులమీదా, అజ్ఞానులమీదా, శత్రువుల మీదా వరసగా ప్రేమా, మైత్రీభావం, జాలీ, ఉపేక్ష ఎవడు చూపుతాడో వాడు మధ్యముడు.

**అర్చయామ్ ఏవ తు హరేః పూజా యః శ్రద్ధయా ఈహతే** – ఎవరయితే, హరిని అర్చన చేస్తూ, పూజ శ్రద్ధగా జరిపే యత్నం చేస్తాడో

(**న తద్భక్తేషు చ అన్యేషు** – హరిభక్తులందు ఇతరులందు అలాంటి శ్రద్ధ చూపడో)

**సః భక్తః ప్రాకృతః స్మృతః** – ఆ భక్తుడు పామరుడిగా సామాన్యుడిగా చెప్పుకోబడతాడు.

ఉత్తమమైన భక్తుడికి అన్ని భూతాల్లోనూ, తనలోనూ ఒకే భగవంతుడు కనిపిస్తాడు.

మధ్యమతరగతి భక్తుడు భగవంతుడి మీద ప్రేమ, తోటి భక్తులయందు స్నేహం, అజ్ఞానులమీద జాలీ, శత్రువుల మీద ఉపేక్షా చూపిస్తాడు. అందరిలోనూ ఒకే భగవంతుణ్ణి దర్శించి, అందరినీ ఒకేలా చూడలేడు.

పామరభక్తుడు హరిపూజ శ్రద్ధగానే చేస్తాడు గానీ, హరిభక్తులనీ ఇతరులనీ పట్టించుకోడు.

# గీతా శ్లోకాలు-1

**వాసాంసి జీర్ణాని యథా విహాయ**
**నవాని గృహ్ణాతి నరోపరాణి ।**
**తథా శరీరాణి విహాయ జీర్ణా**
**న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥**

భగవద్గీత రెండో అధ్యాయం సాంఖ్యయోగంలో యిరవై రెండో శ్లోకం.

మహాభారత యుద్ధం మొదట్లోనే అర్జునుడికి ధర్మసంకటం ఎదురయింది. 'నా వాళ్ళని నేనుచంపితే, ఇహలోకంలోనూ, పరలోకంలోనూ కూడా దుష్ఫలమే కలుగుతుం'దని అతని బాధ. ('నేను, నాదీ, నా వాళ్ళు అనే మమకారం; నేను చంపేవాడిని, వాళ్ళు చచ్చేవాళ్ళనే అహంకారం; దాని వల్ల ఇహంలో పరంలో కలిగే ఫలితాల గురించి చింతా- ఈ మూడూ సంసార విషవృక్షానికి బీజాలు.'- శ్రీ శిష్టా సుబ్బారావు, 'శ్రీమద్భగవద్గీత-తాత్పర్యదీపిక' (1996)) ఇవే అర్జునుడి విషాదానికి కారణాలు. కృష్ణుడు అననే అన్నాడు : 'అనవసర విషయాల గురించి శోకిస్తూ, జ్ఞానిలాగా ప్రజ్ఞావాదాలు చెప్తావేమయ్యా, పిచ్చివాడా!' అని. పుట్టేది ఏదయినా చావక తప్పదు. మధ్యలో వచ్చిన శరీరం, మధ్యలో పోక తప్పదు. కాని అందులో ఉన్న ఆత్మనెవరూ చంపలేరు. అది అనాది, కాబట్టి అనంతం అన్నాడు.

మనిషి చిరిగిపోయిన పాతబట్టలు విడిచి, కొత్త బట్టలు వేసుకొన్నట్టు, దేహంలో ఉన్న దేహి జీర్ణమయిన దేహాన్ని వదిలేసి కొత్త దేహాన్ని పొందుతాడు, అన్నాడు.

**వాసాంసి జీర్ణాని యథా విహాయ**-జీర్ణమయిన బట్టలనువిడిచి ఎలాగయితే,

**నవాని గృహ్ణాతి నరః అపరాణి**-నరుడు వేరే కొత్త (బట్టలు) గ్రహిస్తాడో,

**తథా శరీరాణి విహాయ జీర్ణాని**-అలాగే జీర్ణమయిన శరీరాలను విడిచి,

**అన్యాని సంయాతి నవాని దేహీ**-దేహి నూతనమయిన వేరే శరీరాలు పొందుతాడు.

దేహి కొత్త శరీరం పొందుతాడు అనలేదు. కొత్త శరీరాలు పొందుతాడు అని బహువచనం వాడారు. అంటే వేరు వేరు జన్మలలో అనేక శరీరాలు పొందుతాడు అని. మృత్యువంటే పాతశరీరం వదిలి కొత్త శరీరం పొందటమే, కొత్త బట్టలు వేసుకొన్నట్లు, దానికి చింత ఎందుకు? అని కృష్ణుడి ప్రశ్న.

దీనితో ఆరంభించి, ఈ పుస్తకంలో ప్రస్తావించబడ్డ గీతా శ్లోకాలు చాలా ముఖ్యమైనవి. ఆసక్తికరమైనవి. తరచూ మననం చేయదగ్గవి. వేదాంత సారమని చెప్పదగ్గవి.

# గీతా శ్లోకాలు-2

**నైనం ఛిందంతి శస్త్రాణి**
**నైనం దహతి పావకః ।**
**న చైనం క్లేదయంత్యాపో**
**న శోషయతి మారుతః ॥**

భగవద్గీత రెండో అధ్యాయంలోనే మరో శ్లోకం.

'యుద్ధంలో నా బంధువులందరూ చచ్చిపోతారు, చచ్చిపోతారని వృథాగా విలపించద్దు. అశాశ్వతమయిన దేహం ఎలాగూ పోయేదే, నేడు కాకపోతే రేపు. దాన్ని గురించి వగచి లాభమేమిటి? శాశ్వతమయిన దేహి (ఆత్మ)కి చావులేదు. దానికి ఆదీ లేదూ, అంతం లేదు. దాన్ని చంపటం నీ తరం కాదు. దాన్ని గురించి చింత మరీ అనవసరం' అంటూ కృష్ణ భగవానుడు పై శ్లోకం కూడా చెప్పాడు.

**న ఏనం ఛిందంతి శస్త్రాణి**-దీనిని (ఈ ఆత్మని) శస్త్రాలు ఛేదించలేవు. ఆత్మ నిరవయవం, అవిభాజ్యం, దాన్ని ముక్కలు చేయలేవు.

**న ఏనం దహతి పావకః**-దీన్ని పావకుడు (అగ్నిదేవుడు) దహించలేడు

**న చ ఏనం క్లేదయంతి ఆపః**-దీన్ని నీళ్ళు తడపనూ లేవు.

**న శోషయతి మారుతః**-వాయువు దీన్ని ఆరనివ్వలేదు.

పంచభూతాల వల్ల బాధ పాంచభౌతికమయిన స్థూల శరీరానికే కాని దాన్లో ఉన్న ఆత్మకు కాదు.

ఇదే భావాన్ని దీని తరవాతి శ్లోకంలో కూడా పునరుక్తి చేశాడు : **'అచ్ఛేద్యః అయం, అదాహ్యః అయం, అక్లేద్యః అశోష్యః'** అని.

గీతలో రెండో అధ్యాయం సాంఖ్యయోగం. ఆత్మ-అనాత్మ విచారణలో శాశ్వతమైన 'ఆత్మ'ను ఒక తత్త్వంగానూ, అశాశ్వతమైన అనాత్మ విషయాలను ఇరవైనాలుగు తత్త్వలుగానూ (ప్రకృతి, మహత్, అహంకారం, మనస్సు, జ్ఞానేంద్రియాలు ఐదూ, కర్మేంద్రియాలు ఐదూ, ఇంద్రియ విషయాలైన శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాలు ఐదూ, పృథివి-అప్-తేజ-వాయు-ఆకాశాలనే పంచ భూతాలు ఐదూ), సంఖ్యలతో విశ్లేషించేది సాంఖ్య విద్య. గీతలో రెండో అధ్యాయం ఆత్మ తత్త్వాన్ని వివరిస్తుంది.

# గీతా శ్లోకాలు-3

**కాంక్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః ।**

**క్షిప్రం హి మానుషేలోకే సిద్ధి ర్భవతి భారత ॥**

భగవద్గీత నాలుగో అధ్యాయం జ్ఞానయోగంలో శ్లోకం.

మనుష్యలోకంలో చాలామంది రకరకాల దేవతలను పూజిస్తుంటారు. సర్వేశ్వరుడయిన భగవంతుడిని కాకుండా, ఇలాంటి ఇతర దేవతలను పూజించటం వల్ల ప్రయోజనం ఉందా? అనే ప్రశ్నకు పై శ్లోకంలో కృష్ణ భగవానుడి సమాధానం 'నిస్సందేహంగా ప్రయోజనం ఉంది. అలాంటి పూజలూ ఫలాన్నిస్తాయి. ముఖ్యంగా మనుష్యలోకంలో. ఆ ఫలం కూడా చాలా తొందరగానే లభిస్తుంది' అని.

ఏ దేవుళ్ళకు శ్రద్ధతో మొక్కుకున్నా, శ్రద్ధని బట్టి త్వరగానే కోరిన ఫలం లభిస్తుంది.

అయితే ఒకటే చిక్కు. దేవుణ్ణి ఓ కోరిక కోరావు, అది తీరింది. దానితో తృప్తి కలిగి మరి కోరికలు కలగకుండా ఉంటాయా? పెళ్ళి కావాలని కోరావు, అయింది. చాలా? చాలదు. సంతానం కావాలని కోరావు, కలిగింది, చాలా? అదీ చాలదు. వారికి చదువులు రావాలని కోరావు, వచ్చాయి. చాలా? ఊహూఁ. ఆరోగ్యం కలగాలని కోరావు, కలిగింది. చాలా? ఊహూఁ. వాళ్ళకి ఉద్యోగాలు రావాలని కోరావు. వచ్చాయి. చాలా? చాలదు, వాళ్ళకి పెళ్ళిళ్ళు కావాలి. అవయితే చాలా? చాలదు. మరో కోరిక. మనిషి కోరికల పుట్ట. తెల్లారి లేచినప్పట్నించీ దేవుడు తీర్చాల్సిన కోరిక లెన్నెన్నో! వీటికి అంతులేదు. ఎన్ని కోరికలు తీరినా, కొత్త కోరికలు కలుగుతూనే ఉంటాయి. కోరటం మానేసి, నిష్కామంగా, వైరాగ్యంగా ఉంటే అది నిజమయిన ఆనందానికి దారి. అందుకే **కృపణాః ఫలహేతవః** (ఫలం కోసం కర్మలు చేసేవాళ్ళు దీనులు) అన్నారు.

**కర్మణాం సిద్ధిం కాంక్షన్తః ఇహ దేవతాః యజన్తే**-కర్మల ఫలప్రాప్తి కాంక్షిస్తూ ఆ లోకంలో దేవతలను ప్రార్థిస్తున్నారు.

**భారత, మానుషే లోకే సిద్ధిః క్షిప్రం హి భవతి**-అర్జునా, మనుష్యలోకంలో అలాంటి ఫలసిద్ధి త్వరగానే అవుతుంది.

# గీతా శ్లోకాలు-4

**కామ ఏషః క్రోధ ఏషః రజోగుణ సముద్భవః ।**
**మహాశనో మహా పాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ ॥**
**ధూమే నా వ్రియతే వహ్నిః యథాదర్శో మలేన చ**
**యథోల్బేనావృతో గర్భః తథా తేనేదమావృతమ్ ॥**
**ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్య వైరిణా**
**కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేనచ ॥**

భగవద్గీత మూడో అధ్యాయం (కర్మయోగం)లో అర్జునుడు కృష్ణుడికి చాలా ముఖ్యమయిన ప్రశ్న ఒకటి వేశాడు. పాపం వల్ల దుష్ఫలితాలు ఎదుర్కొక తప్పదని తెలిసి కూడా మనిషి అసలు పాపం ఎందుకు చేస్తాడు, ఎప్పుడూ మంచి పుణ్యకర్మలే చేస్తూ సుఖపడొచ్చు కదా? దీనికి శ్రీకృష్ణభగవానుడు పై శ్లోకాలలో చక్కని సమాధానం యిచ్చాడు.

'తెలిసి తెలిసీ మనిషి పాపకర్మలు చేసుకోవటానికి కారణం కామం, కోరిక. అది విఫలమయితే క్రోధంగా మారుతుంది. ఇది రజోగుణంనించీ పుడుతుంది. ఇది తీరేది కాదు. మహాపాపిష్ఠిది. మనిషికి ఎప్పుడూ, పక్కలో బల్లెంలా, వెంట ఉండే అంతశ్శత్రువు. ఇది జ్ఞానాన్ని కప్పేసి, మనిషిని పాపకర్మలకి పురికొల్పుతుంది' అని.

**'ఏషః కామః'**-ఇది (పాపానికి కారణము) కామం, కోరిక

**'ఏషః క్రోధః'**-ఇదే క్రోధం అవుతుంది. (కోరిక తీరకపోతే క్రోధం కలుగుతుంది)

**'రజోగుణ సముద్భవః'**-ఇది రజోగుణం నించీ పుట్టింది.

**'మహా అశనః'**-గొప్ప తిండిపోతు (ఎంతకీ తృప్తి పొందని సర్వభక్షకం). **'మహాపాప్మా'**-పరమ పాపిష్ఠిది. **'విద్ధి-ఏనం-ఇహ-వైరిణమ్'**-ఇది ఇక్కడ శత్రువు అని తెలుసుకో.

**'యథా ధూమేన ఆవ్రియతే వహ్నిః'**-ఎలాగయితే పొగచేత నిప్పు కప్పబడుతుందో

**'యథా ఆదర్శః మలేన చ'**-ఎలాగయితే అద్దం మురికిచేత కప్పబడుతుందో

**'యథా ఉల్బేన ఆవృతః గర్భః'**-ఎలాగయితే మావిచేత గర్భము కప్పబడుతుందో

**'తథా తేన ఇదం ఆవృతమ్'**-అలాగ దానిచేత (కామం చేత), ఇది (జ్ఞానం) కప్పబడుతుంది.

**'కౌంతేయ'**-అర్జునా

**'జ్ఞానినః నిత్యవైరిణా'**-జ్ఞానులకు నిత్యశత్రువయిన

**'దుష్పూరేణ అనలేన'**-తృప్తిచెందని అగ్ని వంటిదయిన

**'ఏతేన కామరూపేణ'**-ఈ కామరూపముచే

**'జ్ఞానం ఆవృతమ్'**-జ్ఞానము కప్పబడి ఉంటుంది.

ఈ కామం వల్లనే, క్రోధం వల్లనే మనిషి జ్ఞానం కోల్పోయి, పాపకర్మలు చేసి వాటి ఫలితంగా దుఃఖం అనుభవిస్తుంటాడు.

# గీతా శ్లోకాలు-5

**ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః ।**
**అహంకార విమూఢాత్మా కర్తాహమితి మన్యతే ॥**
**తత్త్వవిత్తు, మహా బాహో, గుణకర్మ విభాగయోః ।**
**గుణాః గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే ॥**

భగవద్గీత మూడో అధ్యాయం కర్మయోగంలో చెప్పిన ఈ శ్లోకాలలో జ్ఞానికీ మామూలు మనిషికీ తేడా చెప్తున్నాడు జగద్గురువు వాసుదేవుడు.

ఈ లౌకిక ప్రపంచంలో పనులన్నీ ప్రకృతి వల్ల జరిగేవే. ప్రకృతి అంటే ఆయా తత్త్వాల భౌతిక ధర్మాలు. ప్రకృతి నుంచి సత్వరజస్తమోగుణాలు వస్తాయి. ఈ త్రిగుణాలే మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం, పంచభూతాలూ, చేతులూ కాళ్ళూ మొదలయిన కర్మేంద్రియాలు, కళ్ళూ, ముక్కూ మొదలయిన జ్ఞానేంద్రియాలు, శబ్ద స్పర్శ మొదలయిన ఇంద్రియ విషయాలు మొత్తం ఇరువయి నాలుగు తత్త్వాలుగా మారుతున్నాయి.

దేహాన్ని ఒక ఉపాధిగా, సాధనంగా ధరించిన ఆత్మ, ప్రకృతి ప్రేరేపణ వల్ల ఈ ఇరవై నాలుగు తత్త్వాల ద్వారా జరిగే కర్మలన్నిటికీ సాక్షి మాత్రమే. కర్మలు ఆత్మ వలన జరగవు. కర్మలు ప్రకృతి వలన జరుగుతాయి. ఉన్న నిజం యిది.

జ్ఞాని ఈ విషయం సరిగా గుర్తిస్తాడు. త్రిగుణాల వల్లా, ప్రకృతి జన్యమయిన తత్త్వాల వల్లా కర్మలు జరుగుతున్నాయి అని తెలిసి తను సాక్షిగా, నిర్లిప్తంగా కర్మలతో కర్తృత్వ సంబంధం లేదని చక్కగా ఎరిగి, ఎప్పుడూ పరమానంద స్థితిలో ఉంటాడు.

ఆ జ్ఞానం సిద్ధించని, మామూలు మనిషి ఈ దేహం తనేననుకొని దాంతో తాదాత్మ్యం పొంది, జరుగుతున్న కర్మలకు తననే కర్తగా భావించుకొని, తబ్బిబ్బయి బాధలు అనుభవిస్తాడు. ఈ కర్మలన్నింటికీ ప్రకృతి ధర్మాలు కర్తలు, దేహంలో తాత్కాలికంగా కూర్చొని ఉన్న నేను సాక్షిని మాత్రమే అనే ఎరుక అతనికి ఉండదు.

**ప్రకృతేః-క్రియమాణాని-గుణైః-కర్మాణి-సర్వశః**-ప్రకృతి యొక్క-గుణములచే-చేయబడుతున్న -కర్మలను, అన్ని విధాలుగా,

**అహంకార-విమూఢాత్మా-'కర్తా అహం'-యితి-మన్యతే**- అహంకారం-చేత-భ్రాంతిలో పడేవాడు -'కర్తను నేను'-అని అనుకొంటాడు.

**తత్వవిత్-తు-గుణకర్మ విభాగయోః**-త్రిగుణములు, కర్మల తత్త్వమెరిగినవాడు మాత్రం,

**గుణాః గుణేషు వర్తంతే యితి మత్వా న సజ్జతే**-త్రిగుణాలు తమ కార్యాలందు మునిగి ఉన్నాయి అని గ్రహించి, దానితో సంబంధం పెట్టుకోకుండా ఉంటాడు.

# గీతా శ్లోకాలు-6

**విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే, గవి, హస్తిని ।**
**శునిచైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః ॥**

విద్యా వినయ సంపన్నుడయిన బ్రహ్మజ్ఞానిలో గానీ, ఒక గోవులో గానీ, ఒక ఏనుగులో గానీ, ఓ కుక్క యందు గానీ, ఆ కుక్క మాంసం తినే చండాలుడిలో గాని సమదృష్టి గలవారే పండితులు.

పై మాటల అర్థమూ, అన్వయమూ తేలిగ్గానే తెలుస్తున్నయ్.

ఈ శ్లోకం భగవద్గీత అయిదో అధ్యాయంలో కర్మసన్న్యాస యోగంలో చెప్పిన, కంఠస్థం చేసుకోవడానికి యోగ్యమైన, మణిపూస.

పండితుడూ, జ్ఞానీ అయిన వాడి ముఖ్యమైన లక్షణం ఈ సమదృష్టి. జ్ఞాని ఈ చరాచర జగత్తూ, ప్రాణికోటీ, జీవులూ, పరమాత్మా అన్నీ ఒక చైతన్యపు ముద్దేననీ, దీనిలో లేని ముక్కలను ఊహించుకొని, వాటికి నామరూపాలు యిచ్చి, వాటిలో ఒక ఊహాజనితమయిన ముక్కను 'నేను' అనుకొని బాధలు పడటం అనవసరమనీ అనుభవపూర్వకంగా ఎరిగినవాడు.

కాబట్టి **'ఆత్మవత్ సర్వభూతాని'** తన వంటివే చరాచర ప్రాణికోటి అంతా అని ఆయనకు తెలుసు.

బలవత్తరమయిన 'మాయ'వల్ల, ప్రాణులు భిన్నత్వాన్నే చూస్తాయి గానీ వాటి వెనక ఉన్న ఏకత్వము, అద్వైతమూ, అఖండమయిన చైతన్యాన్ని గుర్తించలేవు. అలా చేయాలంటే నిరంతర సాధన కావాలి. **'అహం బ్రహ్మోస్మి'** లాంటి ఉపనిషద్వాక్యాలు గురు ముఖతః నేర్చుకొని, నిరంతరం మననం చేస్తూ, నిదిధ్యాసన అనే సాధన నిత్యమూ చేస్తూ ఉంటే జన్మజన్మాంతరాల సాధన తర్వాత జ్ఞానప్రాప్తి కలగవచ్చు.

**సైవాహం న చ దృశ్య వస్త్వితి దృఢ ప్రజ్ఞాపి యస్యాస్తి చేత్ ।**
**చండాలోస్తు స తు ద్విజోస్తు గురురిత్యేషా మనీషా మమ ॥**

(ఆ బ్రహ్మమే నేను గానీ ఈ కనిపించే శరీరం నేను కాదని దృఢమైన జ్ఞానం కలవాడు చండాలుడైనా, బ్రాహ్మణుడైనా గురువేనని నా విశ్వాసం.) అంటారు ఆదిశంకరులు తమ 'మనీషా పంచకం'లో.

# గీతా శ్లోకాలు-7

**ఉద్ధరేదాత్మ నాత్మానం, నాత్మానమవసాదయేత్ ।**
**ఆత్మైవ హ్యాత్మనో బంధుః ఆత్మైవ రిపురాత్మనః ॥**

భగవద్గీత ఆరవ అధ్యాయం ధ్యానయోగంలో శ్లోకం ఇది.

**ఉద్ధరేత్ ఆత్మనా ఆత్మానం**-జీవుడు తనను తన చేతనే ఉద్ధరించుకోవాలి.

**న ఆత్మానం అవసాదయేత్**-తనను తాను అధోగతికి దిగజార్చుకోకూడదు.

**ఆత్మా ఏవ హి ఆత్మనః బంధుః**-తనకు తనే బంధువు (శ్రేయోభిలాషి).

**ఆత్మా ఏవ రిపుః ఆత్మనః**-తనకు తనే శత్రువు.

ఆత్మ అంటే 'తాను, తన మనసూ' అని ఒక అర్థం. ఆత్మ అంటే తన శరీరంలో ఉండే శాశ్వతమయిన చైతన్యం లేక జీవుడు కూడా. ఈ శ్లోకంలో ఆత్మ అనే మాటకి మొదటి అర్థం.

నువ్వు ఐహిక జీవితంలో గానీ, ఆధ్యాత్మిక సాధనలో గానీ ప్రగతి సాధించినా, అధోగతి పొందినా, దానికి నువ్వే కారణం. గురువూ, దైవం, శాస్త్రాలూ దోవ జూపించవచ్చు. దోహదం చేయచ్చు, ప్రేరణ యివ్వచ్చు. కానీ నీ ప్రయత్నం లేకుండా నీ ప్రయాణం సాగదు. నీ సాధన నువ్వే చేయాలి. నీ ఇంద్రియాలనూ, మనసునూ నువ్వే నిగ్రహించుకోవాలి. మనసువల్లే బంధమూ, మనసు వల్లే మోక్షమూ! దాన్ని 'చెడు' దారిలో పోనిచ్చి, విషయసుఖాల మీదికి మళ్ళిస్తే, కర్మ బంధాలలో బందీవవుతావు. దాన్ని అఖండ పరబ్రహ్మ ధ్యానం వైపు మళ్ళిస్తే అదే మోక్షదాయకం.

నీ మనసూ, శరీరం నీ వశంలో ఉంటే నీకు బంధువులు. నువ్వు చెప్పినట్లు విని, నీ ప్రగతి కోసం పనిచేస్తాయి. వాటి వశంలో నువ్వుంటే అవి చెప్పినట్లు నువ్వు చేయాలి. అది నీ అధోగతికే దారితీస్తుంది. అప్పుడు అవి నీకు శత్రువులు.

నువ్వు ధర్మం వైపు పోతావో, అధర్మం వైపు పోతావో నువ్వు గట్టిగా నిర్ణయం చేసుకొని, నీ మనస్సును కూడా నీతో లాక్కుపోగలిగితే అధర్మం వైపెందుకు పోతావు? పాపం ఎందుకు కట్టుకొంటావు? ధర్మం వైపే వెళతావు. అప్పుడు అవి నీకు నీ యాత్రలో బంధువులూ, స్నేహితులూ, సహాయకాలు.

నీ యింద్రియాలూ, మనస్సూ లాగుతున్న వైపుకు నువ్వు పోక తప్పదంటే, వాటి ఆధీనంలో నువ్వుంటావు. అవి అధర్మం వైపే, అధోగతి వైపే, పాపకర్మల వైపే నిన్ను లాక్కెళతాయ్. ఎందుకలా? ప్రాకృతికమయిన రజోగుణం నించి పుట్టే కామమూ, దాన్నించీ పుట్టే క్రోధమూ మనిషి జ్ఞానాన్ని కప్పేసి, అతని చేత అన్ని పాపాలూ చేయించి కర్మబద్ధుణ్ణి చేయటం స్వాభావికం. దాన్నించి యత్నపూర్వకంగా తప్పించుకోవాలి.

# గీతా శ్లోకాలు-8

**నైవ కించిత్ కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।**
**పశ్యన్, శృణ్వన్, స్పృశన్, జిఘ్రన్, అశ్నన్, గచ్ఛన్, స్వపన్, శ్వసన్ ॥**
**ప్రలపన్, విసృజన్, గృహ్ణన్, ఉన్మిషన్, నిమిషన్నపి ।**
**ఇన్ద్రియాణి ఇంద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్ ॥**

**న ఏవ కించిత్ కరోమి యితి** (నేను ఏ కొంచెమూ చేయటం లేదు) అని యుక్తుడయిన తత్త్వవిత్తు భావిస్తాడు. **'తత్త్వవిత్'** అంటే పరమార్థతత్త్వం ఎరిగిన జ్ఞాని. యుక్తుడంటే యోగయుక్తుడు, అంటే చిత్తాన్ని ఆత్మలో లగ్నం చేసిన యోగి.

అలాంటివాడు చూస్తున్నా, వింటున్నా, స్పృశిస్తున్నా, ఆఘ్రాణిస్తున్నా, భుజిస్తున్నా, నడుస్తున్నా, కలకంటున్నా, శ్వాసిస్తున్నా, మాట్లాడుతున్నా, తీసుకొంటున్నా, వదిలేస్తున్నా, కళ్ళు తెరుస్తున్నా, మూస్తున్నా - యిలా ఏ పని చేస్తున్నా, **నైవ కించిత్కరోమి**-నేను ఏం కొంచెమూ చేయటం లేదు అన్న భావనతో ఉంటాడు. 'ప్రకృతి ధర్మాల ప్రకారం ఇంద్రియాలు వాటి వాటి విషయాలందు వర్తిస్తున్నాయి. **ఇంద్రియాణి ఇంద్రియార్థేషు వర్తంతే**-నా సంకల్పం, ప్రమేయం, బాధ్యతా ఏమీ లేదు. నేను కేవలం సాక్షిని, కర్తను కాదు. కలలో కనిపించే సంఘటనలకు నేనెలా కర్తను కాదో, మేలు కొన్నప్పుడు జరిగే వాటికి కూడా నేను కర్తను కాదు.' అని ఆత్మా ఆరాముడై, అందులో ఎప్పుడూ ఆనందానుభవంలో ఉంటాడు. ఇది యుక్తుడూ, తత్త్వజ్ఞుడూ అయిన యోగి మాట.

మరి సామాన్యుడు? నిజానికి కర్తృత్వం ఎవరికీ లేదు. ప్రకృతి ద్వారా ప్రాకృతిక ధర్మాలే జరిగిపోతూ ఉన్నాయి. అయితే సామాన్యుడు ఈ శరీరమనే కట్టెతో అదే నేను అనే తాదాత్మ్యభావాన్ని కలిగించుకొని, పెంచుకోవటం వల్ల శరీరం ద్వారా జరిగే పనులన్నిటికీ తను సాక్షిని మాత్రమే గాదు కర్తనీ అనుకొంటున్నాడు. ఇది అజ్ఞానం. దీపం వేసిన గదిలో జరిగే విషయాలకు దీపం సాక్షి. అది కర్త అవుతుందా?

ఈ నవద్వారపురం లాంటి శరీరంలో జరిగే వాటికి నువ్వు అందులో తాత్కాలికంగా కూర్చొన్న సాక్షివి. ఈ పురానికి నువ్వే యజమానివి, పాలకుడివి, రాజువి, బాధ్యుడివి అనే తాదాత్మ్యత తగదు. అది సామాన్యుడికి ఉంటుంది. యోగులకు ఉండదు. వాళ్ళు నిత్య సుఖులు.

అయిదో అధ్యాయం (కర్మా సన్న్యాసయోగం)లో 8-9 శ్లోకాలు ఇవి.

# గీతా శ్లోకాలు-9

**తస్మాత్త్వ ముత్తిష్ఠ యశోలభస్వ, జిత్వాశత్రూ న్భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।**
**మయైవేతే నిహతాః పూర్వమేవ, నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్ ॥ 11.33**

ఇది భగవద్గీత పదకొండో అధ్యాయం. విశ్వరూప సందర్శన యోగంలో శ్లోకం. (11.33)

'ఈ యుద్ధంలో నావాళ్ళని నేను చంపితే ఆ దుష్టకర్మఫలం అనుభవించాలి' అని అర్జునుడు భయపడుతుండగా, శ్రీకృష్ణుడు జ్ఞానబోధ చేశాడు. 'అసలు చంపేదెవరు, చచ్చేదెవరు, ఆత్మకు చావు లేదూ, పుట్టుకా లేదూ, యిది ముందు గ్రహించ'మన్నాడు. 'నా వాళ్ళు, నా వాళ్ళని పాకులాడుతావు. నీ వాళ్ళెవ్వరయ్యా, అది అర్జునుడు అనే నామరూపాలు గల శరీరానికి సంబంధించిన బంధుత్వం మాత్రమే' అన్నాడు. 'నిష్కామంగా ఫలాపేక్ష లేకుండా నీ కర్తవ్యమేదో చేసుకో. అప్పుడు నీకు కర్మఫలం అంటుకొనే ప్రశ్నే లేదు, యిదీ తెలుసుకో' అన్నాడు. 'ఈ చరాచర జగత్తుకు ఈశ్వరుణ్ణి నేను, దీన్నంతా వ్యాపించి నేను ఉన్నాను. ఈ బ్రహ్మాండంలో ఉన్న విభూతులన్నీ నేనే. నన్ను మించి మరేదీ లేదు' అని అతనికి దివ్యనేత్రాలిచ్చి, విశ్వరూపం చూపాడు.

'నేను లోకసంహారం చేసే కాలస్వరూపుడిని కూడా. ఇప్పుడు లోకసంహార ప్రవృత్తిలో ఉన్నాను. ఈ సైన్యాల్లో ఉన్న వీరులందరూ, నువ్వు లేకపోయినా, జీవించి ఉండరు **(ఋతేపి త్వా న భవిష్యంతి సర్వే)** వాళ్ళ చావు ఖాయం' అంటూ ఆ తర్వాత ఈ పై శ్లోకం చెప్పాడు.

**తస్మాత్ త్వం ఉత్తిష్ఠ, యశః లభస్వ**-అందుచేత నువ్విక లేవాలి, కీర్తి సంపాదించుకో. **జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్**-శత్రువుల్ని గెలిచి సమృద్ధి గల రాజ్యం అనుభవించు.

**మయా ఏవ ఏతే నిహతాః పూర్వం ఏవ**-నా చేతనే, వీళ్ళు పూర్వమే నిహతులయ్యారు. **నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్**-అర్జునా, నువ్వు నిమిత్తమాత్రుడిగా ఉండు.

నిమిత్తం అంటే పైకి కనిపించే కారణం, నెపం. ఏదో నీ చేతిమీదిగా ఈ పని జరిగిపోతున్నది కానీ నువ్వు దీనికి బాధ్యుడివి కాదు. నిజానికి ఈ కర్మకు కర్త వేరెవరో, నువ్వు కేవలం నిమిత్తమాత్రుడివి.

**'నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్'** అన్న వాక్యం ఒక నానుడిగా నిలిచిపోయింది.

# గీతా శ్లోకాలు-10

**మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।**
**మామే వైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోసిమే ॥**
**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।**
**అహంత్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥**

ఈ రెండూ భగవద్గీతలో అర్జునుడికి శ్రీకృష్ణుడు చేసిన ఉపదేశంలో చిట్టచివరి శ్లోకాలు (18.65,66)

అర్జునా, చెప్పాల్సిందంతా చెప్పాను. నువ్వు దీన్ని గురించి జాగ్రత్తగా ఆలోచించుకొని, **'యథేచ్ఛసి తథా కురు'** (ఎలా కావాలనుకొంటే అలా చెయ్యి!) అని చెప్పేశాడు.

ముక్తాయింపుగా మాత్రం, సర్వగుహ్యతమం, అన్నిటికంటే అతి రహస్యమయిన విషయం, ఈ రెండు శ్లోకాల్లో చెప్పాడు.

**మన్మనాః భవ మద్భక్తః మద్యాజీ**-నన్నే మనసులో నింపుకో, నా భక్తుడివి, ఆరాధకుడివి అవు.

**మాం నమస్కురు**-నాకు నమస్కరించు, **మాం ఏవ ఏష్యసి**-నన్నే పొందగలవు, **సత్యం**-ఇది నిజం (అని) **ప్రియః అసి తే ప్రతిజానే**-ఇష్టుడివి గనుక నీకు ప్రతిజ్ఞ చేసి చెప్తున్నాను.

ఇక తరవాతది, వైష్ణవులు చరమశ్లోకమని పరమ పవిత్రంగా భావించే ఆఖరి శ్లోకం.

**సర్వధర్మాన్ పరిత్యజ్య మాం ఏకం శరణం వ్రజ**-అన్ని ధర్మాలూ వదిలి నన్ను ఒక్కడిని శరణు పొందవయ్యా!

**అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః**-నేను, నిన్ను, సర్వ పాపముల నుండీ, విముక్తుణ్ణి చేస్తాను, శోకించబోకు!

అన్ని ధర్మాలూ వదిలి నన్ను జేరు, అన్ని పాపాలనించీ విముక్తి కలిగిస్తాను-అని యింత నిర్ద్వంద్వంగా భగవంతుడు ప్రాణికోటికి శరణు ఇస్తున్నాడు గనుక, ఆత్మసమర్పణ, శరణాగతి మోక్షమార్గాలుగా విశ్వసించే వైష్ణవులకు ఈ చరమశ్లోకం సర్వ వేదాంత వాఙ్మయసారం.

**సర్వధర్మాన్** అంటే అందులో ధర్మాలూ, అధర్మాలూ రెండు వస్తాయని శంకరభాష్యం. యుద్ధంలో చంపగూడని బంధువులను చంపితే అధర్మమనీ, జననష్టం జరిగి వర్ణసంకరం జరిగితే వర్ణాశ్రమ ధర్మాలు చెడిపోతాయని, ఆచార్యులతో యుద్ధం చేస్తే అధర్మమనీ, దాయాదులతో పోరు అనైతికమనీ, యిలా రకరకాల ధర్మాధర్మాల చర్చలో పడి అర్జునుడు ఏ వైపూ ముందడుగు వేయలేని వివశత్వంలో పడిపోయాడు. కాబట్టి, శ్రీకృష్ణుడు ఇక ఆ చర్చ వదిలేయమన్నాడు. మహాధర్మమయిన భగవంతుడి శరణాగతిని చక్కగా పాటిస్తే తక్కిన అవాంతర ధర్మాలన్నీ పాటించినట్టేననీ, **శతే పంచాశత్** (నూరులో యాభయ్ ఇమిడే ఉంటుంది కదా) అన్న న్యాయం బట్టి మహద్ధర్మం ఆశ్రయించేవాళ్ళు, చిన్న ధర్మాలను ప్రత్యేకంగా ఆచరించలేక పోయినా ఫరవాలేదనీ అన్నట్లుగా శ్రీశ్రీశ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వామి వారి వ్యాఖ్యానం.

# ఓం శ్రీ మాత్రే నమః

**సిందూరారుణ విగ్రహామ్ త్రి నయనామ్ మాణిక్య మౌళిస్ఫురత్**
**తారానాయక శేఖరామ్ స్మిత ముఖీ మాపీన వక్షోరుహామ్ ।**
**పాణిభ్యామలిపూర్ణ రత్న చషకం రక్తోత్పలం బిభ్రతీమ్**
**సౌమ్యాం రత్న ఘటస్థ రక్తచరణాం ధ్యాయేత్పరామంబికామ్ ॥**

ఇది లలితా సహస్రనామ స్తోత్రంలో మొట్టమొదటి ధ్యానశ్లోకం.

**సిందూర అరుణ విగ్రహామ్**–సిందూరంలా ఎర్రనైన శరీరం కలదానిని, **త్రి నయనామ్**–మూడు కన్నులు కలదానిని,

**మాణిక్య మౌళి స్ఫురత్ తారా నాయక శేఖరామ్**– మాణిక్యమయమయిన కిరీటం ధరించిన శిరస్సుమీద ప్రకాశిస్తున్న చుక్కలరేడు అనే ఆభరణం కలదానిని,

**స్మితముఖీమ్**–చిరునవ్వు నవ్వుచున్న ముఖము కలదానిని, **ఆపీన వక్షోరుహామ్**–ఆపీన వక్షోరుహములు కలదానిని, **పాణిభ్యాం అలిపూర్ణ రత్న చషకం రక్తోత్పలం భిభ్రతీం**–చేతులతో తుమ్మెదలు గుమిగూడిన రత్నమయమైన మధుపాత్రనూ, ఎర్రతామరపూవునూ ధరించి ఉన్నదానిని, **సౌమ్యాం**–శాంత స్వభావురాలిని, **రత్న ఘటస్థ రక్త చరణాం**–రత్నమయమయిన ఘటమునందు ఉంచబడిన ఎర్రని పాదములు కలదానిని, **పరాం అంబికాం**–సర్వోత్కృష్టమయిన పరాశక్తి అయిన అంబికను, **ధ్యాయేత్**–ధ్యానించవలెను.

హైందవ సంప్రదాయంలో ఉన్న స్తోత్రాలన్నింటిలో లలితా సహస్రనామ స్తోత్రమ్, విష్ణు సహస్ర నామ స్తోత్రమ్ అతి ముఖ్యమయినవి. ఇవి మహామంత్రాలు. ఇహలోకంలో కామిత ఫలాలు పొందేందుకు గానీ, ఆధ్యాత్మిక ప్రగతి సాధించేందుకు గానీ ఈ స్తోత్రాల యథాశక్తి, యథావిధి పారాయణం తోడ్పడుతుందని నమ్మకం. విష్ణు సహస్రనామ స్తోత్రం మహాభారతంలో భాగం; లలితా సహస్రనామస్తోత్రం బ్రహ్మాండ పురాణంలో ఉంది. కలియుగంలో ధర్మం ఆచరించటం కష్టం కనక నామసంకీర్తనతో సుఖశాంతులు పొంది, తరించమన్నారు. లలితా సహస్రనామ స్తోత్రంలో తు, చ, స్మ, తథా, హ లాంటి వ్యర్థ పదాలు లేనేలేవు! ఒకే నామం రెండుసార్లు రావటం అనేది ఈ స్తోత్రంలో లేదు. శబ్ద, అర్థ గాంభీర్యంతో అనేకాలంకారాలతో ప్రకాశించే ఈ స్తోత్రం మంత్రశాస్త్ర సర్వస్వంగా కూడా వర్ణించబడింది.

# నాటకేషు శకుంతలా

**యాస్యత్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్టముత్కంఠయా**
**కంఠఃస్తంభిత బాష్పవృత్తి కలుషః చిన్తా జడం దర్శనమ్ ।**
**వైక్లబ్యం మమ తావ దీదృశ మహో! స్నేహాదరణ్యౌకసః**
**పీడ్యంతే గృహిణః కథంను తనయా విశ్లేష దుఃఖైర్నవైః ॥**

ఇది కాళిదాస మహాకవి 'శాకుంతలమ్' నాటకంలో నాలుగో అంకంలో శ్లోకం.

**'కావ్యేషు నాటకం రమ్యం, నాటకేషు శకుంతలా,**
**తత్రాపి చ చతుర్థోంకః, తత్రశ్లోక చతుష్టయమ్'**

అని లోకోక్తి ఉంది. (కావ్యాలలో నాటకం రమ్యంగా ఉంటుంది. ఆ నాటకాలలో కూడా కాళిదాసుని శకుంతల నాటకం మరీ రమ్యంగా ఉంటుంది. అందులోనూ నాలుగో అంకంలో కణ్వుడు శకుంతలను అత్తవారింటికి పంపే ఘట్టం, ఇంకా రమ్యంగా ఉంటుంది. ఆ నాలుగో అంకంలో కూడా ఆ నాలుగు శ్లోకాలు, కణ్వుడు చెప్పినవి, మరీ మరీ రమ్యం.) పై శ్లోకం 'ఆ నాలుగు' శ్లోకాల్లో ఒకటి.

'ఈరోజు శకుంతల వెళ్ళిపోతుందంటేనే మనసు చాలా భారమయిపోతున్నది. కన్నీరు ఆపుకొన్న కొద్దీ గొంతు గద్గదమయిపోతున్నది. కన్నీటిపొర కళ్ళను కప్పేస్తున్నది. అరణ్యవాసిని నాకే, కేవలం పెంచిన స్నేహం వల్ల, ఇంత బెంగగా ఉన్నదే, పాపం కన్నకూతురిని, కొత్తగా అత్తవారింటికి పంపే సందర్భంలో, ఆ దుః ఖం గృహస్థులను ఎంత బాధపెడుతుందో గదా!' అంటున్నాడు కణ్వ మహర్షి. మేనకా–విశ్వామిత్రుల సంతానమయిన శకుంతలను ఆయన తన ఆశ్రమంలో పెంచాడు కదా?

**'యాస్యతి–అద్య–శకుంతలా–ఇతి'**–ఈరోజు శకుంతల వెళ్ళిపోతున్నది అని

**'హృదయం–సంస్పృష్టం–ఉత్కంఠయా'**–మనసు ఉత్కంఠతో బరువెక్కింది.

**'కంఠః–స్తంభిత–బాష్పవృత్తి–కలుషః'**–బాష్పధార–స్తంభింపచేయగా–గొంతు–బొంగురుపోయింది.

**'చిన్తా జడం దర్శనమ్'**–దిగులుతో చూపు మందమయింది.

**'అహో!–స్నేహాత్–అరణ్యౌకసః–మమ'**–ఆహా! కేవలం పెంచిన స్నేహం వల్ల అరణ్యవాసినయిన నాకే

**'వైక్లబ్యం–తావత్–ఈదృశం'**–ఇంతింత దిగులుగా (ఉన్నదే)

**'తనయా–విశ్లేష–దుఃఖైః–నవైః'**–తొలిసారి పుత్రికా వియోగంవల్ల కలిగే దుఃఖాలచే

**'గృహిణః–కథం–ను–పీడ్యంతే'**–గృహస్థులు–ఎంతగా–పీడించబడతారో కదా!

# ఈశావాస్యం

**ఈశావాస్య మిదగ్ం సర్వం**
**యత్కించ జగత్యాం జగత్ ।**
**తేనత్యక్తే న భుంజీథాః**
**మా గృధః కస్యస్విద్ధనమ్ ॥**

ఇది ఈశావాస్యోపనిషత్తులో మొదటి మంత్రం.

'ఈశావాస్యం' అని ప్రారంభమవుతున్నది కనుక ఈ ఉపనిషత్తును 'ఈశావాస్యోపనిషత్తు' లేక 'ఈశోపనిషత్తు' అంటారు. ముఖ్యమయిన దశోపనిషత్తులు పదిలో యిది ఒకటి. ఇది కూడా యజుర్వేదానికి చెందిన ఉపనిషత్తు. ఈ ఉపనిషత్తు జగత్తూ బ్రహ్మల ఏకత్వాన్నే బోధిస్తుంది. ఈ ఉపనిషత్తు శుద్ధ పరబ్రహ్మ గురించి కాకుండా, బ్రహ్మ జగత్తుల సంబంధాన్ని తెలిపే పరమేశ్వర తత్త్వం గురించి చెప్తుంది.

**ఇదం–సర్వం–యత్–కించ–జగత్యాం–జగత్–ఈశ–ఆవాస్యం**–ఇదంతా, అంటే ఈ జగత్తులో చలించేదంటూ ఉన్నదేదయినా ఈశ్వరునిచే ఆవరించబడి ఉన్నదే. చరాచర జగత్తంతా ఈశ్వర చైతన్యంతో నిండి ఉన్నదే.

**తేన**–అందుచేత, **త్యక్తేన భుంజీథాః**–ప్రపంచ విషయాలు, వైరాగ్యంతో త్యాగబుద్ధితో భుజించు. **మా గృధః కస్యస్విత్ ధనమ్**–ఎవరిదో అయిన సొమ్ము గ్రహించవద్దు. అంతా ఈశ్వర వ్యాప్తమయినప్పుడు, ఇందులో సొమ్మంతా పరుల సొమ్ము కింద భావించి, అహంకార, మమకారాలు లేని వైరాగ్యంతో దాన్ని అనుభవించు.

(**తేన త్యక్తేన భుంజీథాః**–అంటే కొందరు 'ఆ ఈశ్వరుడి చేత నీకు వదలబడిన భాగమేదో, దాన్ని అనుభవించు. ఇతరుల భాగం ఆశించద్దు' అని అర్థం చెప్తారు)

**త్యక్తేన భుంజీథాః**–అంటే త్యాగబుద్ధితో అనుభవించమని చెప్పారు. ఎలాంటి త్యాగబుద్ధి? దేన్ని త్యాగం చేయాలి? నేను కర్తను కాదు, వచ్చేపోయే వాటిల్లో, జరిగే వాటిల్లో నా 'ఇచ్ఛ' అంటూ ఏదీ లేదు, అని ఆ స్వ–ఇచ్ఛా భావాన్నీ, అహంకారాన్నీ (అహంకారం అంటే పొగరుకాదు, 'నేను తనం' అంటే, శరీరం గురించి నేను, నాది అనే భావం) త్యజిస్తూ అనుభవించమని కొందరు పండితుల వాఖ్యానం. నేనూ, నువ్వూ, వాడూ అని వేరు వేరు నామరూపాలుగా జగత్తును చూసే ఆ భ్రాంతి భావననూ, ఆ వంకర చూపునూ త్యజిస్తూ, నిర్లిప్తంగా అనుభవించమని.

# ఆనందో బ్రహ్మ

**యతోవా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి**

**యత్ప్రయంతి, అభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి.**

తైత్తిరీయోపనిషత్తు మూడో అధ్యాయం 'భృగువల్లి'లో అనువాకం ఇది (3.1)

వరుణుడి కొడుకు భృగువు. అతని ఆధ్యాత్మిక సాధనను వివరించేది భృగువల్లి.

భృగువు తన తండ్రి దగ్గరికి వెళ్ళి, నాకు బ్రహ్మవిద్య ఉపదేశించమని ప్రార్థించాడట. ఆయన, 'అన్నమూ, ప్రాణమూ, కన్నూ, చెవి, మనసూ, వాక్కు ఇవి ఉపయోగించు. బ్రహ్మవిద్య నువ్వే తెలుసుకోవడానికి ప్రయత్నం చెయ్యి' అంటూ పరబ్రహ్మ గురించి మూడు ముక్కలలో పై విధంగా కుమారుడికి పరిచాయ వాక్యాలు చెప్పాడు. ఇతర విద్యలు పండితుడయిన తండ్రి, కొడుకుకు నేర్పగలడేమో గానీ బ్రహ్మవిద్య అలా నేర్పబడేది కాదు. ఏ గురువయినా పరిచయ వాక్యాలు చెప్పగలడు, మార్గదర్శనం చెయ్యగలడు. ఆపైన ఆ విద్య నేర్చుకోవడానికి ఒకటే మార్గం. అదే తపస్సు. నిరంతర ధ్యానం. అపరోక్షంగా ఆ బ్రహ్మానుభూతి తనంతట తాను పొందేవరకూ కఠోరసాధన.

**యతః వా ఇమాని భూతాని జాయంతే**–ఎక్కడినించీ ఈ భూతాలన్నీ పుడుతున్నాయో,

**యేన జాతాని జీవంతి**–ఎవరివల్లయితే పుట్టిన భూతాలు జీవిస్తున్నాయో,

**యత్ ప్రయంతి, అభిసంవిశంతి**–జన్మ అయిపోయి వెళ్ళేటప్పుడు ఎందులో లీనమవుతున్నాయో,

**తత్ విజిజ్ఞాసస్వ, తత్ బ్రహ్మ ఇతి**–దాన్ని తెలుసుకోవటానికి యత్నించు, అది 'బ్రహ్మ' అని

అది విని భృగువు తపస్సుకు వెళ్ళిపోయాడు.

కొంత తపస్సు చేసిన తర్వాత అన్నం బ్రహ్మ అనీ, ఆ తరువాత మరింత తపస్సాధన చేసి 'ప్రాణం బ్రహ్మ' అనీ, 'మనసు బ్రహ్మ' అనీ, 'విజ్ఞానం బ్రహ్మ' అనీ, ఇంకా తపసు చేసి చివరికి 'ఆనందో బ్రహ్మ' (ఆనందమే బ్రహ్మ) అనీ తెలుసుకొన్నాడని తైత్తిరీయంలో భృగువల్లి చెప్తుంది.

# మాతృ దేవో భవ

**మాతృ దేవోభవ, పితృదేవోభవ**

**ఆచార్య దేవోభవ, అతిథి దేవోభవ**

ఈ మంత్రం కృష్ణ యజుర్వేదానికి సంబంధించిన తైత్తిరీయోపనిషత్తులోది. వేదవిద్యని ఒక తిత్తిరి పిట్ట వేగంగా తినేసి మళ్ళీ కక్కేసిందట. దానిని కొందరు ఋషులు పక్షిరూపం ధరించి మళ్ళీ తినేసి, ఇతరులకు తైత్తిరీయోపనిషత్తుగా బోధించారని ఒక 'పిట్ట' కథ.

గురుకులంలో వేదాధ్యయనం పూర్తిచేసి, గృహస్థాశ్రమం స్వీకరించేందుకు ఇంటికి తిరిగి వెళుతున్న శిష్యుడికి చెప్పిన ముఖ్యమైన నీతివాక్యాలు ఈ ఉపనిషత్తు మొదటి భాగమయిన శిక్షావల్లీలో ఉన్నాయి. పై అనువాకం ఆ సందర్భంలోది.

'సత్యం వద, ధర్మం చర' అంటూ గురువుగారు (సత్యం పలుకు, ధర్మం ఆచరించు) తన సందేశం మొదలెట్టి, మనిషి పూజించాల్సిన భూలోక దేవతలను క్రమంలో చెప్పారు.

మొదట, **'మాతృదేవః–భవ!'.** అంటే 'నువ్వు మాతృదేవతవి అయిపో' అని కాదు, అది అసాధ్యం కదా? 'తల్లియే దేవుడిగా కలవాడిగా అయిపో!' అని. తల్లిని దైవంగా భావించే వ్రతం అవలంబించమని. **'యత్ర నార్యస్తు పూజ్యంతే, రమంతే తత్రదేవతాః , యత్రైతాస్తు న పూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః'** (స్త్రీని పూజించు, ఎక్కడ స్త్రీలు పూజించబడతారో, అక్కడ దేవతలుంటారు. ఎక్కడ స్త్రీలను పూజించరో, అక్కడి పనులన్నీ నిష్ఫలమౌతాయ్) అని స్మృతి వాక్యం. స్త్రీలలో కూడా మొదటి పూజ తల్లిది. ఇది సనాతన సంప్రదాయం.

తరవాత **'పితృదేవః–భవ'** తండ్రియే దైవంగా కలవాడివిగా అయిపో.

ఆ తరువాతి స్థానం గురువుది. **'గురుదేవః–భవ'. గురుర్బ్రహ్మా, గురుర్విష్ణుః, గురుర్దేవో మహేశ్వరః–** గురువు త్రిమూర్తి స్వరూపుడు. తల్లిదండ్రుల తర్వాత అత్యంత పూజనీయుడు.

ఆపైన **'అతిథి దేవః–భవ'** ఇంటికొచ్చిన అతిథిని దేవుడిగా పూజించు.

**'అభ్యాగతః స్వయం విష్ణుః'** అన్నారు. భారతీయ సనాతన విచారధారలో అందరినీ తన లాగే చూసుకోవటం, అందరినీ తననూ కూడా అఖండమయిన పరమాత్మ చైతన్యంగా గుర్తించడం అనే ధర్మానికి ఎంతో ప్రాముఖ్యత యిచ్చారు. కానీ, అనేక కారణాల వల్ల ఇలాంటి ధర్మాచరణం లుప్తమయింది. ఇది దురదృష్టం.

# మనసుకే మనసు

**యద్వాచా నాభ్యుదితమ్, యేన వాగభ్యుద్యతే ।**
**యన్మనసా న మనుతే యే నా హుర్మనో మతమ్ ।**
**యచ్చక్షుషా న పశ్యతే యేన చక్షూంషి పశ్యతి ।**
**తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥**

ఈ మాటలు కేనోపనిషత్తులోంచి తీసుకొన్న మచ్చుతునకలు. (1-5,6,7) 'కేన?' ఎవరిచేత? అని మొదలవుతుంది. కనక దీన్ని కేనోపనిషత్తు అన్నారు. ఎవరిచేత ప్రేరేపించబడి ఈ మనసు పనిచేస్తుంది? ఎవరి ప్రేరణలో కళ్ళూ, ముక్కూ లాంటి జ్ఞానేంద్రియాలు పనిచేస్తాయి అని శిష్యుడి ప్రశ్నకు ఈ చిన్న ఉపనిషత్తు సమాధానాలు యిస్తుంది.

పైన చెప్పిన మంత్రాలలో బ్రహ్మ పదార్థాన్ని వర్ణిస్తున్నారు.

**యత్ వాచా న అభ్యుదితమ్ యేన వాక్ అభ్యుద్యతే**-ఏది మాటలతో చెప్పబడలేదో, దేని వల్ల మాటలు వెలువడతాయో

**యత్ మనసా న మనుతే యేన ఆహుః మనో మతమ్**-ఏది మనసు ద్వారా ఆలోచింపబడలేదో, దేని వల్ల మనస్సు ఆలోచించగలుగుతుందని చెప్పారో

**యత్ చక్షుషా న పశ్యతి యేన చక్షూంషి పశ్యతి**-ఏది కళ్ళతో చూడబడదో, దేనివల్ల కళ్ళు చూడగలుగుతాయో

**తత్ ఏవ బ్రహ్మ త్వం విద్ధి**-అదే బ్రహ్మ అని నువ్వు తెలుసుకో

**న ఇదం యత్ ఇదం ఉపాసతే**-ఇక్కడ ఉపాసించబడుతున్నదేదో, అది కాదు బ్రహ్మ.

అంటున్నదీ ఉపనిషత్తు.

**శ్రోత్రస్య శ్రోత్రమ్, మనసః మనః యః, వాచః హ వాచం, స ఉ ప్రాణస్య ప్రాణః** -జ్ఞానేంద్రియాలూ, మనస్సూ వాటంతటవి పనిచేయవు. చైతన్యం గల ప్రతి ప్రాణిలో మనసుకు మనసుగా, చెవికే చెవిగా, ప్రాణానికే ప్రాణంగా ఉండే ఆ చైతన్యమే బ్రహ్మ అని ఈ ఉపనిషత్తు చెప్తున్నది.

# రథ యాత్ర

**ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు ।**
**బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ ॥**
**ఇంద్రియాణి హయాణ్యాహుః విషయాంస్తేషు గోచరాన్ ॥**
**ఆత్మేంద్రియ మనోర్యుక్తమ్ భోక్తేత్యాహుర్మనీషిణః ॥**

ఇది కఠోపనిషత్తులోంచి అనువాకం (1-3, 3-4)

ఆత్మను రథంలో ప్రయాణం చేస్తున్న ఒక రథికుడుగా ఊహించుకో. అది ప్రయాణం చేస్తున్న రథం శరీరం. శరీరం అనాద్యంతమయిన ఆత్మకు తాత్కాలికమయిన ఉపాధి (సాధనం). రథాన్ని నడిపే సారథి బుద్ధి (అంటే వివేచనా శక్తి).

బుద్ధి క్రియాత్మకం. ఇది ఇంద్రియానుభవానికి కార్యరూపం కలిగించి ఇంద్రియాలచేత కర్మ చేయిస్తుంది. మనసు కళ్ళెం. మనసు సుఖదుఃఖాలు అనుభవించే అంతర్ ఇంద్రియం. మామూలు భాషలో మనం 'హృదయం' అంటాం. రాగ, ద్వేషాలు దీనివల్లే కలుగుతాయి. బహిరింద్రియాలకు కనిపిస్తున్న, అనిపిస్తున్న దృశ్యాలకూ, అనుభవాలకూ 'ఇది సుఖం, ఇది దుఃఖం, ఇది కావాలి, ఇది వద్దు' లాంటి తారతమ్యాలను ఏర్పరచేది మనస్సు. ఇది బహిరింద్రియాల అనుభవాలన్నీ సేకరిస్తుంది. కానీ, యిది క్రియ చేయలేదు. క్రియ కోసం ఇది బుద్ధిని ప్రేరేపించాల్సిందే. క్రియాత్మకమయినది బుద్ధి, ఇంద్రియాల చేత క్రియలు చేయించేది బుద్ధి. దానికి ప్రేరణ మనసు. మనసుకు ప్రేరణ ఇంద్రియాల నుంచి లభిస్తున్న విషయజ్ఞానం.

**ఆత్మానం రథినం విద్ధి**–ఆత్మను రథికుడుగా తెలుసుకో **శరీరం రథ మేవ తు**–శరీరమే అతని రథం **బుద్ధిం తు సారథిం విద్ధి**–శరీరాన్ని క్రియాత్మకంగా నడిపే సారథి 'బుద్ధి' **మనః ప్రగ్రహమేవ చ**–మనసు గుర్రాలకు కట్టిన కళ్ళెం **ఇంద్రియాణి హయాని ఆహుః**–బహిరింద్రియాలు (జ్ఞానేంద్రియాలూ, కర్మేంద్రియాలు) గుర్రాలని చెప్తారు. **విషయాన్ తేషు గోచరాన్**–ప్రాపంచిక విషయాలు ఆ గుర్రాలు పరిగెత్తే మార్గాలు అంటారు. **ఆత్మా ఇంద్రియ మనః యుక్తమ్ భోక్తా ఇతి అహుః మనీషిణః**–ఆత్మ ఇంద్రియాలతో మనసుతో కలిస్తే దాన్ని పండితులు 'భోక్త' అన్నారు. కర్మఫలాలూ, సుఖదుఃఖాలు అనుభవించే ప్రాణి.

తన సారథిని బాగా అర్థం చేసుకొని, మనసు పగ్గాలు బాగా నిగ్రహించగలవాడు, మార్గంలో చివరిదాకా వెళ్ళి గమ్యం చేరగలుగుతాడు. అదే పరమపదం. సారథి చేత గుర్రాలను సరిగా నడిపించలేకపోతే అవి పక్కదోవలు పట్టి వాటి యిష్టం వచ్చినట్లు వెళతాయి. ఎప్పటికీ గమ్యం చేరలేవు – అని చెప్తుంది కఠోపనిషత్తు.

# మాటలు కాదు

**నాయమాత్మా ప్రవచనేన లభ్యః - న మేధయా, బహునా శ్రుతేన ।**
**యమేవైష వృణుతే తేన లభ్యం-తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్ ॥**

ఇది కఠోపనిషత్తులో మంత్రం (1-2-23). ఆత్మ అనేది ప్రవచనం వల్ల లభించేది కాదు. ఇది మేధాశక్తి వల్లా, పాండిత్యం వల్లా, శాస్త్రాలు చదవటం వల్ల లభించేది కాదు. ఇది అవాఙ్మానస గోచరమయిన విషయం.

పటికబెల్లం తింటే ఎలా ఉంటుందో, అది ఏమిటో ఎరగనివాడికి ఎంత చెప్పినా అర్థం కాదు. అంతో యింతో అర్థం అయినా దానివల్ల వాడికి ప్రయోజనం ఏముంది? దాని తీపి వాడికి అనుభవంలోకి వస్తే, ఆ మాధుర్యంలో మజా తెలుస్తుంది. పటికబెల్లం అనే పదార్థమే ఎప్పుడూ చూసి ఉండని పండితుడు దాన్ని గురించి ఎన్ని పుస్తకాలు చదివినా, ఎన్ని ప్రవచనాలు విన్నా, ఎందరితో చర్చించినా, అది కేవలం విషయ పరిజ్ఞానమే. మాధుర్యం అనుభవించేందుకు ఈ చర్చలూ, అధ్యయనాలూ ఎందుకూ పనికిరావు. పటికబెల్లం ముక్క తిని దాని తీపి చవి చూసినవాడికి కూడా, ఆ తీపిని గురించిన గ్రంథాలూ, వ్యాఖ్యానాలూ, ప్రవచనాలూ అనవసరమే. మార్గదర్శనానికీ, విషయ సూచనకు మాత్రమే ఆత్మ గురించిన చర్చలు పనికొస్తాయి. అసలయిన ఆత్మజ్ఞాన ప్రాప్తి సాధనవల్లనే లభిస్తుంది.

**న అయం ఆత్మా ప్రవచనేన లభ్యః**-ఈ ఆత్మ ప్రవచనం వల్ల లభించదు.

**న మేధయా, బహునా శ్రుతేన**-మేధాశక్తి వల్ల గానీ, ఎక్కువ పాండిత్యం వల్ల గానీ లభించదు

**యం ఏవ ఏషః వృణుతే, తేన లభ్యం**-ఏ ఆత్మను సాధకుడు ఎన్నుకొని, వెతుకుతూ వెళతాడో, వాడిచేతనే లభ్యము. వాడికే లభిస్తుంది.

**తస్య ఏషః ఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్**-అతనికి ఈ ఆత్మ తన స్వస్వరూపాన్ని ప్రదర్శిస్తుంది. ఇది శంకరుల వివరణ, అద్వైత పరమయిన వివరణ.

అద్వైతేతరులు **యం ఏవ ఏషః వృణుతే, తేన లభ్యం** అంటే ఎవరినయితే ఆత్మ ఎన్నుకుంటుందో వాడికే అది లభ్యం. అంటే ఆ పరమాత్మ అనుగ్రహం ఉంటేనే అది లభ్యం అని అర్థం చెప్పుకొంటారు.

'భక్తి కర్మలు ఆత్మజ్ఞాన ప్రాప్తికి కేవలం మెట్లు, సాధనాలు కావు' అనే అద్వైత సిద్ధాంతానికీ, 'భక్తి భగవదనుగ్రహం, దానివల్ల జ్ఞానప్రాప్తి కలుగుతాయి' అనే ద్వైత, విశిష్టాద్వైతుల బోధలకూ తేడా యిలాంటి వ్యాఖ్యాన భేదాల వల్లనే వస్తుంది. వేదాలూ, ఉపనిషత్తుల వాక్యాలు అద్వైత, ద్వైత, విశిష్టాద్వైతాలు మూడింటికీ ప్రమాణమే. వాటికి అర్థం చెప్పుకోవటంలోనే తేడాలు.

# అణువులో అణువు

**అణోరణీయాన్ మహతోమహీయాన్**
**ఆత్మాస్య జంతోః నిహితో గుహాయామ్ ।**
**తమక్రతుః పశ్యతి వీతశోకో**
**ధాతుప్రసాదాత్ మహిమాన మాత్మనః ॥**

పరమాత్మ తత్త్వం పట్టుకోవడమెలా అన్నది గడ్డుప్రశ్న. విద్యలన్నిటిలో కష్టమైనది బ్రహ్మవిద్య. పరమాత్మ అంగుష్ఠ మాత్రంగా నీలోనే ఆత్మ రూపంలో ఉంది. ఈ ఉపాధి పొరలను చీల్చి దాన్ని పట్టుకొంటే పరమాత్మను పట్టుకొన్నట్టే. చిత్తశుద్ధితో, ఏకాగ్రతతో, బాహ్యసాధనాలతో, అంతఃసాధనాలతో, అంతర్ముఖుడివై బహుకాలం ధ్యానిస్తే దాన్ని కనుక్కొంటావు. ఇది కఠోపనిషత్తు సందేశం. దానిలోదే పై అనువాకం (1.2.20). ఇదే మంత్రం కొద్ది తేడాతో శ్వేతాశ్వతరోపనిషత్తు లో కూడా కనబడుతుంది (3.20).

**అణోరణీయాన్, మహతోమహీయాన్**–అతి చిన్న అణువు కంటే చిన్నది, అతి పెద్ద వాటి కంటే పెద్దది అయిన, **ఆత్మా అస్య జంతోః నిహితః గుహాయామ్**–ఈ జంతువు ఆత్మ, బుద్ధి గుహలో దాగి వుంది. **తం అక్రతుః పశ్యతి వీత శోకః**–దాన్ని, సర్వసంకల్పాలు, క్రియలూ వదిలినవాడూ, ఎలాటి శోకమూ, చింతా లేనివాడు చూడగలుగుతాడు. **ధాతు ప్రసాదాత్**–మనసు, ఇంద్రియాలు శాంతించటం వల్ల; ధాతువులు ప్రసాదించుట వల్ల. **మహిమానం ఆత్మనః**–ఆత్మ యొక్క గొప్పతనాన్ని

ఆత్మ మనిషి హృదయ గుహలో దాగే ఉంది. అది అణువు కంటే చిన్నది. బ్రహ్మాండం కంటే పెద్దది. దాన్ని తెలుసుకోవాలంటే ధాతువులను (యింద్రియాలను) ప్రసాదింపజెయ్యాలి, శాంతింపజెయ్యాలి. మోక్షచింత తప్పా, మిగిలిన చింతలు వదిలేయాలి. క్రతువులూ, క్రియలూ సంకల్ప సహితంగా చెయ్యడం వదిలేసిన సంకల్ప వర్జితుడికి ('అక్రతువు'కు) మాత్రమే ఆత్మజ్ఞానం లభిస్తుంది. మోక్షం భగవదనుగ్రహం వల్లనే లభిస్తుందని నమ్మే అద్వైతేతర సంప్రదాయాల ఆచార్యులు, చివరిపాదంలో 'ధాతుః ప్రసాదాత్' (ధాత లేక సృష్టికర్త అనుగ్రహం వల్ల) అని విడదీసి, సాధకుడు ఆత్మ యొక్క గొప్పతనం భగవదనుగ్రహం చేతనే గ్రహించగలుగుతాడని వ్యాఖ్యానిస్తారు. 'ధాతు ప్రసాదాత్' అంటే ఇంద్రియములు శాంతింపచేసి చేయటం అని అర్థం చెప్పి, అలాచేసి వాంఛారహితుడయిన యోగి ఆత్మజ్ఞానం పొందుతాడని శంకరులు వ్యాఖ్యానించారు.

# పదములె చాలు

**త్వదన్యః పాణిభ్యాం అభయ వరదో దైవత గణః**
**త్వమేకా నైవాసి ప్రకటిత వరాభీత్యభినయా ।**
**భయాత్త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛా సమధికం**
**శరణ్యే లోకానాం! తవహి చరణావేవ నిపుణౌ ॥**

ఇది శంకరాచార్యుల సౌందర్యలహరి స్తోత్రంలో శ్లోకం. సౌందర్యలహరి శ్లోకాలు అత్యంత రమణీయాలే గాక. మంత్ర, తంత్ర శాస్త్రాల రహస్య గర్భితాలు. పై శ్లోకానికి స్థూలార్థం మాత్రమే చెప్పుకొందాం.

సాధారణంగా, దేవతల విగ్రహాలు చూస్తే, ఆయా దేవతలు అభయ ముద్ర చేత్తో చూపిస్తున్నట్లు కల్పించబడి ఉంటాయి. అమ్మవారి విగ్రహాలు మామూలుగా అలా చెక్కబడి ఉండవు. కారణం ఆచార్యుల వారు చెప్తున్నారు.

**త్వదన్యః దైవతగణః**–నీవు కాకుండా, యితర దేవతా బృందము

**పాణిభ్యాం అభయ వరదః**–చేతులతో అభయాన్నీ, వరప్రసాదాన్నీ ప్రకటిస్తూ ఉంటారు.

**త్వం ఏకా న ఏవ అసి ప్రకటిత వర అభీతి అభినయా**–నీవు ఒక్కతెవే ప్రదర్శిస్తున్న వర, అభయ అభినయము లేని దానివి.

**భయాత్ త్రాతుం**–భయం నించీ రక్షించడానికి

**దాతుం ఫలం అపి చ వాంఛా సమధికమ్**–కోరిన దానికంటే ఎక్కువగా ఫలము నిచ్చుటకు గానీ

**తవ హి చరణౌ ఏవ నిపుణౌ**–నీ చరణాలే సమర్థమయినవి

**శరణ్యే లోకానాం**–లోకాలకు శరణమయిన ఓ తల్లీ! అని సంబోధన.

'కర్మల వల్ల, భక్తి వల్లా మోక్షం లభించటం కల్ల, మోక్షం జ్ఞానం వల్లే లభిస్తుంది' అని ఎన్నో సందర్భాలలో కుండబద్దలు కొట్టినట్టు చెప్పిన భగవత్పాదులవారు భక్తి ప్రకటించే స్తోత్రాలు ఇన్ని తనే స్వయంగా ఎందుకు రాశారు? ఎందుకంటే, భక్తి వల్ల నేరుగా మోక్షం లభించకపోయినా, మోక్షసాధనకు కావలసిన ఏకాగ్రతను భక్తి కలిగించగలదు కనుక. భక్తి ద్వారా జ్ఞానమార్గం పట్టుకోవచ్చు కనక. 'మోక్ష కారణ సామగ్ర్యాం భక్తిరేవ గరీయసి' – మోక్షసాధనకు ఉపకరించే సామగ్రిలో భక్తి ముఖ్యమైనది అని కూడా జగద్గురువులే బల్లగుద్ది చెప్పారు (వివేక చూడామణి–32).

అందుకే సౌందర్యలహరీ, శివానందలహరీ మొదలయిన స్తోత్రరత్నాలు జనబాహుళ్యానికి ప్రసాదించారు. మరొక్కసారి శ్లోకం చదివితే భావం స్పష్టమవుతుంది.

# అపరోక్షానుభూతి

**యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ ।**

**యన్మౌనం యోగిభిర్గమ్యం తద్భజేత్సర్వదా బుధః ॥**

వాక్కు, మనస్సు లౌకికమయిన వస్తువులను గుర్తించేందుకు మాత్రమే పనికివస్తాయి. అఖండ, సచ్చిదానంద స్వరూపమయిన పరబ్రహ్మ నిర్వికారం, నిర్వికల్పం, నిర్విశేషం. అలాంటి వికల్పమూ, వికారము, విశేషమూ లేని విషయాన్ని వాక్కూ, మనస్సూ గుర్తించలేవు. రూపం లేని గాలిని కన్ను గుర్తించలేకపోయినట్లు.

'అపరోక్షానుభూతి' అనే ప్రకరణ గ్రంథంలో శంకరాచార్యులు ఈ విషయమే పై శ్లోకంలో చెప్పారు (శ్లోకసంఖ్య 107).

**యతః వాచః నివర్తన్తే అప్రాప్య మనసా సహ**–దేన్ని అయితే వాక్కూ, దాంతో బాటు మనస్సూ, అందుకోలేక తిరిగి వచ్చేస్తాయో,

**యత్ మౌనం యోగిభిః గమ్యం**–(వాక్కుతో సాధించలేక వాక్కు తిరిగిపోతే అక్కడ మిగిలేది మౌనమే గదా.) యోగులకు గమ్యమయిన ఆ మౌనాన్ని,

**తత్ భజేత్ సర్వదా బుధః**–పండితుడు ఎప్పుడూ దానిని (ఆ అవాఙ్మానస గోచరమయిన పరబ్రహ్మనే) ధ్యానించాలి.

'అపరోక్షానుభూతి'లో మాటలకందని పరబ్రహ్మను గురించి చాలా మాటలు చెప్పారు. ఇది విషయ సూచన, మార్గదర్శనం. జ్ఞానప్రాప్తికి త్రోవ. జ్ఞానం కాదు, జ్ఞానం మాటల కందదు. అది అనుభూతి. "నేను అంటే ఈ దేహం కాదు, ఈ దేహంలో ప్రకాశిస్తున్న నిజమైన 'నేను' పరమాత్మయే, పరబ్రహ్మమే. అది సత్ చిత్ ఆనంద స్వరూపం. నిర్వికారమూ (మార్పులు పొందనిది), నిరాకారమూ (ఆకారం లేనిది), నిరవద్యము (ఏ దోషమూ లేనిది), అవ్యయమూ (నాశనం లేనిది), నిర్గుణమూ (గుణాలు లేనిది), నిష్క్రియమూ, నిత్యమూ, నిత్యముక్తమూ, నిత్య శుద్ధమూ, నిత్యసత్యమూ. అశాశ్వతమయిన, అసత్ రూపమయిన దేహము నేను కాదు అని అనుభవరూపంగా తెలుసుకోవటం జ్ఞానం". ఎవరో చెపితే పరోక్షంగా ఈ జ్ఞానం కలగదు. అది ఎవడికి వాడు అపరోక్షంగా (స్వయంగా) అనుభవించాలి. అందుకు యమ, నియమాది ప్రక్రియలతో తీవ్రంగా, నిరంతరంగా యోగ సాధనలు అవసరం. ధ్యానమూ, సమాధి వంటి సాధనలతోనే బ్రహ్మ సాక్షాత్కారం సాధించాలి. 'అపరోక్షానుభూతి' గ్రంథంలో సందేశం ఇది.

# బ్రతుకు భయం

**భోగే రోగ భయం, కులే చ్యుతి భయం, విత్తే నృపాలాద్భయమ్**
**మానే దైన్య భయం, బలే రిపు భయం రూపే జరాయా భయమ్ ।**
**శాస్త్రే వాద భయం, గుణే ఖలభయం కాయే కృతాంతాద్భయమ్**
**సర్వం వస్తు భయాన్వితం భువి నృణాం వైరాగ్యమే వాభయమ్ ॥**

సంతానసుఖం, భోజనసుఖం, దారాపుత్రాదుల వల్ల సుఖం, శయ్యాసుఖం, సంగీత సాహిత్యాల వల్ల సుఖం ఇలా అనేక రకాలయిన సుఖదాయకమయిన సాధనాలూ, విశేషాలతో నిండి ఉన్న ఈ జీవితం దుఃఖభూయిష్ఠం ఎలా అవుతుంది, వేదాంతుల నిరంతర నిరాశావాదం కాకపోతే, అని అప్పుడప్పుడూ అనుమానం వస్తుంది.

సుఖదుఃఖాలు రెండూ అనుభవించి చూచిన జ్ఞానులనేదేమంటే, లౌకిక సుఖాల వల్ల నీకు కలిగేది సుఖం కాదు, సుఖభ్రాంతి. దానితో సమస్యలు మూడు – ఒకటి, అది శాశ్వతం కాదు, కనుక ఉన్న సుఖం ఎప్పుడు చేజారిపోతుందోనన్న భయం ఎప్పుడూ ఉంటుంది. రెండు, సుఖానుభవం పూర్తయిన తర్వాత మామూలు జీవితమే, బరువుగా, భారంగా, దుర్భరంగా అనిపిస్తుంది. మూడు, సుఖం ఎంత అనుభవించినా, యిక చాలు అనే తృప్తి కలగడం అసంభవం.

నిజమయిన సుఖం, వైరాగ్యంలోనే ఉంది అంటూ 'వైరాగ్య శతకం'లో భర్తృహరి చెప్పినది పై శ్లోకం (శ్లోకసంఖ్య 31).

**భోగే రోగ భయం**–అనుభవిద్దాం, తిందాం, తిరుగుదాం–అంటే అతి అయిపోయి రోగమొస్తుందేమో నని భయం. **కులే చ్యుతి భయం**–కులీనుణ్ణి అని సంతోషించేవాడికి, ఆ కులగౌరవం ఏనాడు ఏ క్షణంలో కోల్పోతానో అని భయం. **విత్తే నృపాలాత్–భయం**–బాగా డబ్బుంటే ప్రభువుల నించీ భయం, పన్నులూ, అపరాధ శుల్కాలు వగైరాల భయం.

**మానే దైన్య భయం**–అభిమానవంతుడికి ఎవరి దగ్గరో చేయి చాచి యాచించాల్సిన అవసరం ఎప్పుడయినా వస్తుందేమోనని భయం, **బలే రిపు భయం**–బలవంతుడికి, తనకన్నా బలవంతుడయిన శత్రువు ఎప్పుడొచ్చి ఓడించేస్తాడోనని భయం, **రూపే జరాయాః భయం**–సౌందర్యవంతులకు ముసలితనం వచ్చి అందం ఎప్పుడెప్పుడు చెడిపోతుందోనని భయం, **శాస్త్రే వాద భయం**–విద్వాంసుడికి తనకన్నా గొప్ప విద్వాంసుడితో వాదంలో ఓడిపోయి పరాభవం చెందాల్సొస్తుందోనని భయం. **'గుణే ఖల భయం'**–గుణవంతులకు, దుర్మార్గులనించీ భయం. **'కాయే కృతాంతాత్ భయం'**–శరీరానికి యముడినించీ మృత్యుభయం, **'సర్వం వస్తు భయాన్వితం భువి'**–భూమిలో అన్ని వస్తువులూ భయంతో కలిసి ఉండేవే. **'నృణాం వైరాగ్యం ఏవ అభయమ్'**–మనుషులకు అభయం వైరాగ్యం ఒక్కటే.

# కావ్య కళ

**యానేవ శబ్దాన్ వయమాలపామః**
**యానేవ చార్థాన్ వయ ముల్లిఖామః ।**
**తైరేవ విన్యాస విశేష భవ్యైః**
**సమ్మోహయన్తః కవయః జగన్తి ॥**

కవిత్వశక్తిని గురించిన సుభాషితం.

రవి–కాంచనిచో–కవి–కాంచును. సూర్యుడు పైనించీ చూడలేని, చూపించలేని అందాలనూ, ప్రదేశాలనూ ఈ భూమి మీద కవి చూపించగలడు అన్నారు.

మహాకవులు మనం సంభాషణలలో వాడే మాటలే వాడతారు. మనం రాసేలాంటి మాటలే రాస్తారు. కాని వాటిచేత చిత్ర, విచిత్రాలయిన విన్యాసాలు చేయిస్తారు. అద్భుతమయిన, అలౌకికమయిన అందాలు సృష్టిస్తారు.

**యాన్ ఏవ శబ్దాన్ వయం ఆలపామః**–ఏవయితే మాటలు మనం మాట్లాడతామో

**యాన్ ఏవ చ అర్థాన్ వయం ఉల్లిఖామః**–ఏవయితే అర్థాలను మనం మామూలు రాతకోతల్లో వాడతామో

**తైః ఏవ విన్యాస విశేష భవ్యైః**–విన్యాస విశేషాల చేత అద్భుతంగా కనిపించే వాటితోనే (ఆ శబ్దార్థాలతోనే)

**సమ్మోహయన్తః కవయః జగన్తి**–కవులు లోకాలను సమ్మోహితం చేస్తారు.

వీరిలో ఒక్కొక్క మహాకవి కవితా కాంతను ఎలా అలంకరించారో జయదేవుడు వ్రాసినట్లుగా చెప్పబడే ఈ శ్లోకంలో చెప్పారు:

**యస్యాః చోరః చికుర నికురః, కర్ణపూరో మయూరః,**
**భాసః హాసః, కవికుల గురుః కాళిదాసో విలాసః**
**హర్షః హర్షః హృదయ వసతిః పంచబాణస్తు బాణః**
**కేషాం నైషా, కథయ, కవితా కామినీ కౌతుకాయ?**

ఈ కవితాకాంత ఎవరికి ఉత్సాహమూ, ఉల్లాసమూ కలిగించదు, చెప్పు. **(ఏషా కవితా కామినీ కేషాం కౌతుకాయ న? కథయ)** ఆమెకు చోరకవి ముంగురులు, మయూర మహాకవి కర్ణాభరణం, భాసుడు చిరునవ్వు, కాళిదాసు సొగసులు, హర్షకవి హర్షం, బాణుడు మనసులో తిష్ఠ వేసి ఉన్న మన్మథుడు! ఇన్ని అందాలూ, అలంకారాలూ ఆమెవి.

# కంఠశోష

**ఘటోవా మృత్పిండో ప్యణురపి చ ధూమోగ్ని రచలః**
**పటో వా తంతుర్వా పరిహరతి కిం ఘోర శమనమ్ ।**
**వృథా కంఠక్షోభం వహసి తరసా తర్కవచసా**
**పదాంభోజం శంభోః భజ పరమసౌఖ్యం వ్రజ సుధీః ॥**

ఆదిశంకరుల శివానందలహరీ స్తోత్రంలో ఆరవశ్లోకం ఇది.

**ఘటః వా, మృత్పిండః అపి, అణుః అపి, చ ధూమః అగ్నిః అచలః**–కుండగానీ, మట్టిముద్ద గానీ, అణువు గానీ, పొగ కానీ, నిప్పు కానీ, కొండ కానీ

**పటః వా తంతుః వా**–వస్త్రంగానీ, దానిలో దారంపోగు గానీ

**పరిహరతి కిం ఘోర శమనమ్**–భయంకరమయిన యముడిని అడ్డుకొంటాయా?

**వృథా కంఠక్షోభం వహసి తరసా తర్కవచసా**–గడగడా, తర్క వచనాలతో వ్యర్థంగా కంఠశోష పొందుతున్నావు.

**పద అంభోజం శంభోః భజ**–శంభుడి పదకమలం సేవించు

**పరమసౌఖ్యం వ్రజ, సుధీః**–పరమసౌఖ్యం పొందు, బుద్ధిమంతుడా!

కుండకీ, మట్టికీ సంబంధం ఏమిటి? అణువులేమిటి? పొగ, నిప్పు, కొండ యివన్నీ ఏమిటి, ఎలా వచ్చాయి? నూలుతో బట్టనెలా నేస్తారు? ఇలాంటి అపరవిద్యలన్నీ క్షుణ్ణంగా నేర్చుకొని, ఎంత విజ్ఞానం సంపాదించి, ఎన్ని సిద్ధాంతాలు తయారుచేసి, శుష్కంగా వాటిని చర్చించి ఏమిటి లాభం–కంఠ శోష తప్పా? శివుణ్ణి ఆరాధించు. ఇతర కార్యకలాపాల వల్లా, పరిశోధనల వల్లా, చర్చల వల్లా ఫలితం శూన్యం.

**సంప్రాప్తే సన్నిహితే కాలే నహి నహి రక్షతి డుకృఞ్ కరణే**–కాలుడు వచ్చి మీద పడ్డప్పుడు ఈ 'డుకృఞ్ కరణే' లాంటి వ్యాకరణ చర్చలు రక్షించవు అని 'భజగోవిందం' స్తోత్రంలో చెప్పినమాటే ఇక్కడా చెప్తున్నారు ఆచార్యులవారు.

లౌకికమయిన దృశ్యమానమయిన ప్రపంచానికి సంబంధించిన విద్యలన్నీ అపరవిద్యలు. ఒక్కొక్క విషయంలో ఎన్నో పరిశోధనలు జరుపుతారు. ఎన్నో పిహెచ్.డీ.లు పొందుతారు. ప్రకృతి రహస్యాలు ఛేదించామంటారు. కానీ, వీటి ఉపయోగం కేవలం ఈ వ్యావహారిక ప్రపంచంలో గడిపే కొద్దికాలం మాత్రమే. ఇవి క్షణికమయిన నశ్వరమయిన, ఐహిక ప్రపంచానికి మాత్రమే సంబంధించినవి. ఈ జీవితకాలం ముగియగానే, ఈ కల కరగగానే, ఈ అపరవిద్యలూ కరిగిపోతాయి.

భక్తి ద్వారా ఏకాగ్రత సాధించి, పరావిద్యను పట్టుకో. బ్రహ్మతత్త్వాన్ని శోధించి సాధించు. దానివల్ల జన్మరాహిత్యం, శాశ్వతమయిన ఆనందం పొందు.

# మాయాజాలం

**ఏ తస్మాత్కిమివేంద్ర జాల మపరం యద్గర్భవాస స్థితం**

**రేత శ్చే తతి హస్త మస్తక పద ప్రోద్భూత నానాంకురమ్ ।**

**పర్యాయేణ శిశుత్వ యౌవన జరా వేషై రనేకైర్వృతమ్**

**పశ్యత్యతతి శృణోతి జిఘ్రతి తథా గచ్ఛత్యథాగచ్ఛతి ॥**

**ఏతస్మాత్ కిం ఇవ ఇంద్రజాలం అపరం**–దీనికంటే మరో ఇంద్రజాలం ఏమిటి? అని ప్రశ్నిస్తున్నారు విద్యారణ్యస్వామి, తన 'వేదాంత పంచదశి' గ్రంథంలో (6–147).

ఈ విశ్వంలో విశేషాలు చూస్తుంటే, ఇందులో జరుగుతున్న ఊహాతీతమయిన అద్భుతాలకు తార్కికమైన కారణాలు దొరకవు. సృష్టి రహస్యాల గురించి ఎంత పరిశోధన జరిపినా, ఏదో ఒక స్థాయిలో 'ఇది ఏమిటో నాకు కొంచెం కూడా తెలియటం లేదు' అని చివరికి చెప్పుకోవటమే నీకు శరణ్యం అవుతుంది, అంటుంది వేదాంత పంచదశి ('న జానామి కిమపి ఏతత్ ఇతి అంత్యే శరణం తవ' : 6–146) ఈ సృష్టినిండా అలాంటి ఇంద్రజాలాలెన్నో!

**యత్–గర్భవాస స్థితం రేతః చేతతి, హస్త మస్తక పద ప్రోద్భూత నానా అంకురమ్**–గర్భవాసంలో చేరిన రేతస్సు చేతులూ, తలా, కాళ్ళూ మొదలయిన మొగ్గలను ఏర్పరచి వాటిని చైతన్యవంతముగా చేస్తున్నది.

**పర్యాయేణ శిశుత్వ యౌవన జరా వేషైః అనేకైః వృతమ్**–క్రమేణా, శిశువుగా, యువకుడుగా, వృద్ధుడుగా అనేకవేషాలు తొడుక్కొని

**పశ్యతి, యతతి, శృణోతి, జిఘ్రతి**–చూస్తుంది, యత్నాలు చేస్తుంది, వింటుంది, వాసన చూస్తుంది. **తథా గచ్ఛతి యథా ఆగచ్ఛతి**–(చివరికి) ఎలా వచ్చిందో అలా పోతుంది. **ఏతస్మాత్ కిం ఇవ ఇంద్రజాలం అపరం**–దీనికంటె ఇంద్రజాలం వేరే ఏం ఉంటుంది?

నిజమే! ఆలోచించండి. ఒక్క రేతః కణం. గర్భంలో చేరి రెండుకణాల పిండమై, కాళ్ళూ, చేతులూ, ముక్కూ, ముఖంగా తయారయి, అవన్నీ వాటంతటవే వికసించి, చైతన్యవంతమయిన శిశువు కావడమేమిటి? శిశువు యువకుడుగా ఎదిగి, వడిలి వృద్ధుడై, ఎలా వచ్చాడో చివరికి అలాగే పోవటమేమిటి? ఇది నిత్యకృత్యంగా, అతి సాధారణంగా జరిగిపోతూ ఉండటానికి కారణం ఏమిటి, ప్రేరణ ఏమిటి, ఇన్ని క్లిష్టమయిన మార్పులు ఎలా జరుగుతున్నాయి? ఎందుకు జరుగుతున్నాయి?

# మనోగతం

**దూరదేశ గతే పుత్రే జీవత్యే వాత్ర తత్పితా।**

**విప్రలంభక వాక్యేన మృతం మత్వా ప్రరోదతి ॥**

**మృతేపి తస్మిన్ వార్తాయాం అశ్రుతాయాం న రోదితి।**

**అతః సర్వస్య జీవస్య బంధకృన్మానసం జగత్ ॥**

ఈ రెండు శ్లోకాలూ విద్యారణ్యస్వామి వ్రాసిన 'వేదాంత పంచదశి' గ్రంథంలోవి (4-34,35). సహజంగా స్వేచ్ఛాజీవి అయిన మనిషికి బంధనాలు కలిగించేది ప్రాపంచిక వస్తువులూ, విషయాలూ, సంఘటనలూ కావు, మనస్సు. **మనః ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః** (మనసే మనిషికి బంధమోక్షాలకు కారణం) అని ఉపనిషత్తులో చెప్పింది గుర్తు చేస్తున్నారు విద్యారణ్యులు. దీనికి ఒక స్థూలమయిన ఉదాహరణ ఈ శ్లోకాల్లో యిచ్చారు.

**దూరదేశ గతే పుత్రే**-తన కొడుకు దూరదేశం వెళ్ళి ఉండగా

**జీవతి ఏవ**-(అతను) జీవించి ఉండగానే, **అత్ర తత్పితా**-అక్కడ (స్వదేశంలో) అతని తండ్రి

**విప్రలంభక వాక్యేన**-తప్పుడు సమాచారం చేత

**మృతం మత్వా ప్రరోదతి**-చనిపోయాడనుకొని రోదిస్తాడు.

**మృతే అపి**-ఆ కుమారుడు నిజంగా చనిపోయి ఉండగా కూడా

**తస్మిన్ వార్తాయాం అశ్రుతాయామ్**-ఆ వార్త వినకపోతే,

**న రోదితి**-రోదించడు, **అతః**-అంచేత, **సర్వస్వ జీవస్య**-సర్వజీవులకూ,

**బంధకృత్ మానసం జగత్**-బంధాన్ని కలిగించేది మానసిక ప్రపంచమే.

కొడుకు దూరదేశంలో సురక్షితంగా ఉన్నా, అతడు చనిపోయాడని తప్పు సమాచారం వస్తే ఆ తండ్రి నిజంగా పుత్రశోకం అనుభవిస్తాడు. అలాగే, దూరదేశంలో ఉన్న కొడుకు మృత్యువు వాతపడ్డా, ఆ విషయం తెలియనంతవరకు పుత్రుడి మరణం అనే యథార్థం అతన్ని బాధించదు.

# ఏకశ్లోకి

**కిం జ్యోతిస్తవ? భానుమానహని మే రాత్రౌ ప్రదీపాదికం**
**స్యాదేవం, రవిదీప దర్శన విధౌ కిం జ్యోతిరాఖ్యాహిమే।**
**చక్షుస్తస్య నిమీలనాది సమయే కిం? ధీర్ధియో దర్శనే**
**కిం? తత్రాహమతో భవాన్పరమకం జ్యోతిస్తదస్మి ప్రభో॥**

ఇది కూడా శంకరాచార్య విరచితమే.

దీన్ని 'ఏకశ్లోకి' అని వ్యవహరిస్తారు. ఇది గురుశిష్యుల సంభాషణరూపంలో ఉంది. ఉపనిషత్సారం ఒకే ఒక్క శ్లోకం రూపంగా అద్వైతపరంగా శంకరులు ఇందులో చెప్పారు.

*గురువు :* **కిం జ్యోతిః తవ**–నీకు దీపం ఏది?

*శిష్యుడు :* **మే భానుమాన్ అహని, రాత్రౌ ప్రదీపాదికమ్**–నాకు పగలు సూర్యుడూ, రాత్రిపూట దీపాదులు (దోవచూపుతాయి)

*గురువు :* **స్యాత్ ఏవం, రవి దీప దర్శన విధౌ కిం జ్యోతిః ఆఖ్యాహి మే** – అదలా ఉండనియ్యి, సూర్యుణ్ణీ, దీపాన్ని దర్శించటానికి నీకు వెలుగుగా పనికొచ్చేదేమిటి నాకు చెప్పు.

*శిష్యుడు :* **చక్షుః**–కన్ను

*గురువు :* **తస్య నిమీలనాది సమయే కిం?**–దాన్ని మూసుకొన్న సమయంలో, ఏది వెలుగు?

*శిష్యుడు :* **ధీః**–బుద్ధే వెలుగు

*గురువు :* **ధియో దర్శనే కిం**–బుద్ధిని గ్రహించాలంటే ఏది వెలుగు? (నీకు బుద్ధి అనే సాధనం ఉందని నీకు ఎరుక కలిగించేది లేక తెలియచెప్పేది ఏమిటి?)

*శిష్యుడు :* **తత్ర అహం**–అందుకు నేనే (మరే సాధనం లేదు. ఆ బుద్ధి వెనక నేనే – జీవాత్మను. దానివల్లే శరీరమూ, బుద్ధీ, ఇంద్రియాలు కాని 'నేను వెనుక నేను', 'నేను కాని నేను' ఉన్నానన్న స్ఫురణ నాకు కలుగుతుంది)

*గురువు :* **అతః భవాన్ పరమకం జ్యోతిః**–అందువల్ల, నువ్వే పరంజ్యోతివి (వెలుగులకు వెలుగువు).

*శిష్య :* **తదస్మి, ప్రభో** (అది నేనే, స్వామీ!)

ఇది కంఠస్థం చేసి, మననం చేసుకొంటూ ఉంటే అద్వైత సిద్ధాంతం క్రమేణా లోతుగా అవగతం చేసుకోవచ్చు.

మరొక్కసారి శ్లోకం చదవండి. అర్థమూ, అన్వయమూ స్పష్టమౌతాయి.

# ప్రశ్నోత్తర మాలిక

**లోభశ్చేదగుణేన కిం? పిశునతా యద్యస్తి కిం పాతకైః?**
**సత్యం చేత్తపసా చ కిం? శుచిమనో యద్యస్తి తీర్థేన కిమ్?**
**సౌజన్యం యది కిం బలేన? మహిమా యద్యస్తి కిం మండనైః?**
**సద్విద్యా యది కిం ధనైః? అపయశో యద్యస్తి కిం మృత్యునా?**

ఈ పుస్తకంలో భర్తృహరి సుభాషితాల నించీ యిచ్చిన పది శ్లోకాలలో యిదొకటి. ఈ శ్లోక రచనా సంవిధానం ప్రశ్నోత్తర మాలికారూపంలో ఉంది. నీతి శతకం 'దుర్జన పద్ధతి'లో 44వ శ్లోకం.

**లోభః చేత్, అగుణేన కిం?**–పీనాసితనం ఉంటే వేరే దుర్గుణాలేవీ అక్కర్లేదు. అది ఒక్కటే నూరు దుర్గుణాలకు సాటి.

**పిశునతా యది అస్తి, కిం పాతకైః?**–చాడీలు చెప్పే అవలక్షణం ఒక్కటి ఉంటే, వేరే పంచమహా పాతకాలూ చెయ్యక్కర్లేదు.

**సత్యం చేత్, తపసా చ కిం**–సత్యసంధత ఒక్కటి ఉంటే, వేరే జపతపాలు ఎందుకు, అక్కర్లేదు.

**శుచి మనో యది అస్తి, తీర్థేన కిమ్?**–చిత్తశుద్ధి, మంచి మనసు ఉంటే, తీర్థాలకు వెళ్ళి స్నానాలు చేయవలసిన అవసరం లేదు.

**సౌజన్యం యది, కిం బలేన?**–సజ్జనుడికి బలంతో ఏం అవసరం?

**మహిమా యది అస్తి, కిం మండనైః?**–గొప్పతనమే ఉంటే, ఆభరణాలూ, అలంకారాలూ ఎందుకు?

**సద్విద్యా యది, కిం ధనైః?**–చక్కని పాండిత్యం ఉంటే ధనం ఎందుకు? అది తేలికగానే సంపాదించ వచ్చు.

**అపయశో యది అస్తి, కిం మృత్యునా?**–అప్రతిష్ఠతో బతికేవాడికి వేరే చావు ఎందుకు? అలా బతకటం మృత్యువుతో ఎలాగూ సమానమే.

ఈ వరసలోనే **సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్?** చక్కని కవిత్వం చెప్పగలిగితే, రాజ్యమెందుకు? అని కూడా కొందరు అంటారు.

# తలరాత

**యద్ధాత్రా నిజఫాలపట్ట లిఖితం స్తోకం మహద్వా ధనమ్**
**తత్ప్రాప్నోతి మరుస్థలేపి నితరాం మేరౌ చ నాతోధికమ్ ।**
**తద్ధీరోభవ విత్తవత్సు కృపణాం వృత్తిం వృథా మా కృథాః**
**కూపే పశ్య పయోనిధావపి ఘటో గృహ్ణాతి తుల్యం జలమ్ ॥**

ఇది భర్తృహరి నీతిశతకంలో శ్లోకం (శ్లోకసంఖ్య 40).

నీ నుదుట బ్రహ్మదేవుడు ఎంత రాశాడో అంత మాత్రం ధనం నువ్వు ఎడారిలో కూర్చొన్నా నీకు దొరకక మానదు. నువ్వు మేరు పర్వతం మీదికి వెళ్ళినా, అంతకంటే ఎక్కువేమీ లభించదు. అందువల్ల దీనంగా వాళ్ళనీ వీళ్ళనీ ప్రాధేయపడనక్కర్లేదు. నీ ప్రాప్తం ఏదో అది మార్చలేవు. నీ కుండను తీసుకెళ్ళి బావిలో ముంచినా, సముద్రంలో ముంచినా, దాన్లోకి కుండెడు నీళ్ళే వస్తాయి. సముద్రమని ఎక్కువ రావు, బావి అని తక్కువ రావు.

**'యత్-ధాత్రా-నిజ-ఫాల పట్ట-లిఖితం'**-ఏదయితే బ్రహ్మచేత తన నుదుటిమీద రాయబడి ఉన్న

**'స్తోకం-మహత్-వా-ధనమ్'**-ధనం, తక్కువ గానీ ఎక్కువగానీ

**'తత్-ప్రాప్నోతి-మరుస్థలే-అపి-నితరాం'**-అది ఎడారిలోనయినా కచ్చితంగా పొందుతాడు.

**'మేరౌ-చ-న-అతః-అధికమ్'**-మేరుపర్వతంలో కూడా అంతకంటె ఎక్కువరాదు.

**'తత్-ధీరో-భవ-విత్తవత్సు'**-అందువల్ల ధనికుల దగ్గరకు వెళ్ళినా ధైర్యంగానే ఉండు

**'కృపణాం-వృత్తిం-వృథా-మా-కృథాః'**-దైన్యత్వ భావనను వ్యర్థంగా చేయకు

**'పశ్య'**-చూడు, **'కూపే-పయోనిధౌ-అపి-ఘటం-తుల్యం-జలం-గృహ్ణాతి'**-బావిలో గానీ, సముద్రంలో గానీ కుండ సమానంగా జలం గ్రహిస్తుంది.

'వనజ భవుండు నెన్నొసట వ్రాసినదెంత ఘనంబొ కొంచెమో విను మరుభూమి కేగిన లభించును, మేరువు చేరబోయినన్ ధనమధికమ్ము రాదు' అని ఏనుగు లక్ష్మణకవి దీన్ని అందంగా అనువదించాడు.

# ధర్మ సందేహాలు

**కో లాభః? గుణి సంగమః, కి మసుఖం? ప్రాజ్ఞేతరైః సంగతిః**

**కా హానిః? సమయచ్యుతిః, నిపుణతా కా? ధర్మ తత్త్వేరతిః ।**

**కః శూరః? విజితేంద్రియః, ప్రియతమా కా నువ్రతా, కిం ధనమ్?**

**విద్యా, కిం సుఖ మప్రవాసగమనమ్, రాజ్యం కి మాజ్ఞాఫలమ్ ॥**

ప్రశ్నోత్తరాల రూపంలో ఉన్న ఒక చాటు శ్లోకం యిది.

**కో లాభః**–లాభం కలిగించే విషయం ఏమిటి?

**గుణి సంగమః**–సద్గుణములు గల సజ్జనుల సాంగత్యం.

**కి మసుఖం**–ఇబ్బంది కలిగించే విషయం ఏమిటి?

**ప్రాజ్ఞేతరైః సంగతిః**–ప్రాజ్ఞులు కాని పామరుల సాంగత్యం.

**కా హానిః**–హాని ఏమిటి?

**సమయచ్యుతిః**–విలువయిన సమయాన్ని వృథాగా పోగొట్టడం.

**నిపుణతా కా?**–నైపుణ్యం అంటే ఏది?

**ధర్మ తత్త్వే రతిః**–ధర్మం గురించి ఆసక్తి.

**కః శూరః**–శూరుడెవరు?

**విజితేంద్రియః**–ఇంద్రియాల్ని జయించినవాడు.

**ప్రియతమా కా**–ప్రియతమురాలు ఎవరు?

**అనువ్రతా**–అనుకూలంగా వర్తించే భార్య.

**కిం ధనమ్**–నిజమైన ధనం ఏది?

**విద్యా**–చదువు.

**కిం సుఖమ్**–సుఖం ఏమిటి?

**అప్రవాస గమనమ్**–దేశాంతరాలకూ, దూరప్రాంతాలకు పోకుండా ఉండటమే.

**రాజ్యం కిమ్**–రాజ్యం ఏది?

**ఆజ్ఞాఫలమ్**–నీ ఆదేశం ఎంత మేర వరకు పాలించబడుతుందో అంతవరకూ (నీ రాజ్యం).

# భక్తి - విభక్తి

**కృష్ణోరక్షతు నో జగత్త్రయ గురుః కృష్ణం నమస్యామ్యహం**
**కృష్ణే నామర శత్రవో వినిహతాః కృష్ణాయ తస్మై నమః ।**
**కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోస్మ్యహం**
**కృష్ణే భక్తి రచంచలాస్తు భగవన్ హే కృష్ణ! తుభ్యం నమః ॥**

ఈ శ్లోకం కులశేఖర ఆళ్వారు రచించిన 'ముకుందమాలా' స్తోత్రంలోది. ఈ మహాభక్తుడు రాజకవి (రాజు, కవీ కూడా). చేరవంశం వాడు. సుమారు 8వ శతాబ్ది వాడు.

ఈ శ్లోకంలో కృష్ణుడిని ఏడు విభక్తులతోనూ, ఆపైన సంబోధన ప్రథమా విభక్తితోనూ స్తుతించారు.

**కృష్ణః రక్షతు** నః–మమ్మల్ని **కృష్ణుడు** రక్షించు గాక (ప్రథమా విభక్తి)

**కృష్ణం నమస్యామి అహం–శ్రీకృష్ణుడిని** నేను నమస్కరిస్తున్నాను (ద్వితీయ)

**కృష్ణేన అమర శత్రవో వినిహితాః–కృష్ణుడిచేత** దేవతల విరోధులయిన రాక్షసులు చంపబడ్డారు (తృతీయ)

**కృష్ణాయ తస్మై నమః**–అలాంటి **కృష్ణుని కొరకు** నమస్కారము (చతుర్థీ)

**కృష్ణాత్ ఏవ సముత్థితం జగత్ ఇదం–కృష్ణుడి నుంచే** ఈ జగత్తు ఉద్భవించింది (పంచమీ)

**కృష్ణస్య దాసః అస్మి అహమ్**–నేను **కృష్ణుని యొక్క** దాసుడను (షష్ఠీ)

**కృష్ణే భక్తిః అచంచలా అస్తు–కృష్ణుని యందు** భక్తి అచంచలంగా ఉండుగాక (సప్తమీ)

విభక్తులు సంబంధాన్ని తెలియజేస్తాయి కాబట్టి అన్ని విభక్తులూ వాడటం వల్ల శ్రీకృష్ణుడితో సర్వ విధాలా సంబంధం వాంఛనీయం అని కవి సూచిస్తున్నాడని పండితాభిప్రాయం. ఇలాంటి శ్లోకమే మరొకటి.

**రామో రాజమణిః సదా విజయతే, రామం రమేశం భజే।**
**రామేణాభిహతాః నిశాచర చమూః రామాయ తస్మై నమః॥**
**రామాన్నాస్తి పరాయణం పరతరం, రామస్య దాసోస్మ్యహం।**
**రామే చిత్త లయః సదాభవతు మే, భో రామ! మాముద్ధర॥**

# ద్వైతం

**శ్రీ మధ్వ మతే హరిః పరతరః, సత్యం జగత్, తత్త్వతః**

**భేదో, జీవగణాః హరే రనుచరాః, నీచోచ్చ భావం గతాః।**

**ముక్తి ర్నైజ సుఖానుభూతి రమలా, భక్తిశ్చ తత్ సాధనం**

**హ్యక్షాది త్రితయం ప్రమాణమ్, అఖిలా మ్నాయైక వేద్యో హరిః॥**

ప్రసిద్ధ ద్వైతాచార్యులు శ్రీ వ్యాసరాయలు చెప్పిన ఈ శ్లోకంలో విశిష్టత ఏమిటంటే, ఒకే ఒక్క శ్లోకంలో ద్వైత సిద్ధాంతం అంతా క్లుప్తంగా చెప్పి, ఆ సిద్ధాంతంలో తొమ్మిది ముఖ్య స్తంభాలను కేవలం నాలుగు పాదాలలో ప్రతిష్ఠించడం.

**శ్రీ మధ్వమతే**–శ్రీ మధ్వాచార్యుల మతంలో

ఒకటి, **హరిః పరతరః**–విష్ణువు పరిపూర్ణుడయిన పరతత్త్వం

రెండు, **సత్యం జగత్**–జగత్తు సత్యము (అద్వైతంలోలా జగత్తు మిథ్య కాదు)

మూడు, **తత్త్వతో భేదః**–(చైతన్యం కల జీవుడికీ, జడమయిన ప్రపంచానికీ, ఈశ్వరుడికీ కల భేదం నిజమయినది, శాశ్వతమయినది.) వాటి తత్త్వాలే వేరు. (అవి అభిన్నమయి, అద్వైత రూపమనటం ఒప్పదు.)

నాలుగు, **జీవగణాః హరే రనుచరాః**–జీవులు భగవదధీనంలో ఉన్న అస్వతంత్రులు. (అద్వైతులు చెప్పినట్లు జీవుడే బ్రహ్మ కాదు.)

అయిదు, **నీచ ఉచ్చ భావం గతాః**–జీవులలో ఉచ్చ నీచ తారతమ్యాలున్నాయి. ముక్తులున్నారు, అముక్తులున్నారు. అముక్తులలో ముక్తియోగ్యులయిన ఋషులు ఉత్తములు, సంసారులు మధ్యములు, నాస్తికులూ, రాక్షసులూ మొదలయిన వారు అధములు.

ఆరు, **ముక్తిః నైజ సుఖ అనుభూతిః**–నిజమయిన ఆనందం యొక్క అనుభూతి ముక్తి.

ఏడు, **అమలా భక్తిః చ తత్ సాధనమ్**–అలాంటి ముక్తిని సాధించే సాధనం నిర్మలమయిన భక్తి.

ఎనిమిది, **అక్ష ఆది త్రితయమ్ ప్రమాణమ్**–తత్త్వాన్వేషణకు మూడు రకాల ప్రమాణాలు: ప్రత్యక్ష విషయాలు (కంటికి కనబడేవి), అనుమాన విషయాలు (చూచిన దాన్ని బట్టి ఊహించగల విషయాలు), శ్రుతి శబ్దాలు (అపౌరుషేయమయిన శబ్దాలుగా

నమ్మబడే వేదాలూ, ఉపనిషత్తులూ). ఈ విషయంలో అవైదిక, నాస్తిక సిద్ధాంతాలను మధ్వులు తిరస్కరిస్తారు.

తొమ్మిది, **అఖిల ఆమ్నాయ ఏక వేద్యః హరిః**–అన్ని వేదాల ద్వారా తెలుసుకోవాల్సినది భగవంతుడయిన హరినే.

ఒక ఉద్గ్రంథంలో చెప్పదగిన విషయ సారాంశాన్ని ఒకే ఒక్క శ్లోకంలో శ్రీవ్యాస రాయలు చాలా అద్భుతంగా ప్రకటించారు. ఇది కంఠస్థం చేస్తే మాధ్వ సిద్ధాంత సారం కరతలామలకమే.

# తుది పలుకు

**కరచరణ కృతం వా కర్మ వాక్కాయజం వా**
**శ్రవణ నయనజం వా మానసం వాపరాధమ్ ।**
**విహిత మవిహితం వా సర్వమేతత్ క్షమస్వ**
**శివ! శివ! కరుణాబ్ధే! శ్రీ మహాదేవ! శంభో!**

ఉపసంహార శ్లోకంగా ఈ అపరాధ క్షమాపణ స్తోత్రాన్ని చదువుకొంటూ, ఈ చిన్న పుస్తకంలో తెలిసో తెలియకో, అధికాంశం తెలియకే, దొర్లిన స్ఖాలిత్యాలను మన్నించమని, పాఠకుల్నీ, ఆ పరమేశ్వరుణ్ణీ కూడా ప్రార్థిస్తూ, దీన్ని ముగించడం ఉచితంగా ఉంటుంది.

ఈ శ్లోకం కూడా శంకరాచార్యుల వారిదే. కేవలం 116 శ్లోకాల ఈ పుస్తకంలో శంకరుల శ్లోకాలు యిరవయి పైగా ఉన్నాయి! సంస్కృతంలో ప్రసిద్ధ శ్లోకాలు ప్రతి నాలిగింటిలో ఒకటి ఆ మహానుభావుడిదే ఉంటుందంటే, అది మన వాఙ్మయం మీద చెరగని ముద్ర వేసిన ఆ జగద్గురువు ప్రతిభకు తార్కాణం. ఈ శ్లోకం 'శివమానస పూజా స్తోత్రం' లోది.

హే శంభో! నా అపరాధం ఎలా జరిగినా, ఏ రూపంలో జరిగినా–దాన్ని పూర్తిగా క్షమించవయ్యా అని భక్తుడి వేడుకోలు ఈ శ్లోకం.

**కర చరణ కృతం వా, కర్మ వాక్ కాయజం వా** – చేతులతో, కాళ్ళతో చేసినదయినా, క్రియచేతగానీ, మాటచేతగానీ, శరీరం చేత జరిగినదయినా.

**శ్రవణ నయనజం వా, మానసం వా అపరాధం**–చెవుల ద్వారా గానీ, కళ్ళ ద్వారా గానీ, మనసు ద్వారా గానీ చేసినదేదయినా అపరాధం.

**విహితమ్, అవిహితమ్ వా**–ఇంతకు ముందు చేసినది గానీ, ఇకముందు చేయబోయేది గానీ

**సర్వం ఏతత్ క్షమస్వ**–ఇది అంతా క్షమించు.

**శివ, శివ, కరుణాబ్ధే, శ్రీ మహాదేవ, శంభో!**–శివా, కరుణాకరా, మహాదేవా!

**కాయేన వాచా, మనసేంద్రియై ర్వా**
**బుద్ధ్యాత్మనా వా ప్రకృతే స్స్వభావాత్**
**కరోమి యద్యత్, సకలం పరస్మై**
**నారాయణాయేతి సమర్పయామి**

(శరీరంతో, వాక్కుతో, మనస్సుతో, ఇంద్రియాలతో, బుద్ధివల్ల, ఆత్మవల్ల, సహజ స్వభావం వల్ల ఏమేమైతే చేస్తున్నానో, అది సకలము పరదేవుడైన నారాయణుడికేనని సమర్పిస్తున్నాను.)

# శాంతి మంత్రం

**ఓం భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః । భద్రం పశ్యేమాక్ష భిర్యజత్రాః ।**
**స్థిరై రంగై స్తుష్టువాగ్ం సస్తనూభిః । వ్యశేమదేవహితం యదాయుః ॥**
**స్వస్తి న ఇంద్రో వృద్ధ శ్రవాః । స్వస్తి నః పూషా విశ్వవేదాః ।**
**స్వస్తిన స్తార్క్ష్యో అరిష్టనేమిః । స్వస్తి నో బృహస్పతిర్దధాతు॥**
**ఓం శాంతిః శాంతిః శాంతిః॥**

**దేవాః**–దేవతలారా!

**భద్రం, కర్ణేభిః శ్రుణుయామ**–మంగళప్రదమైన దానిని, చెవులతో, వినెదము గాక!

**యజత్రాః అక్షభిః భద్రం పశ్యేమ**–యజ్ఞపరులమయి, కళ్ళతో మంగళమునే, చూచెదము గాక!

**స్థిరైః అంగైః తనూభిః తుష్టువాంసః దేవహితమ్ ఆయుః వ్యశేమ**–ఆరోగ్యమయిన, అవయవాలతో, తనువులతో, స్తుతులు చేస్తూ, దేవ నియమితమయిన ఆయుష్షు పొందెదము గాక!

**స్వస్తి నః వృద్ధ శ్రవాః ఇంద్రః దధాతు**–శుభమును మాకు ప్రాచీనులచే వర్ణించబడిన ఇంద్రుడు ఇచ్చుగాక!

**స్వస్తి నః పూషా విశ్వవేదాః**–శుభమును మాకు సర్వజ్ఞుడయిన సూర్యుడు ఇచ్చుగాక!

**స్వస్తి నః తార్క్ష్యో అరిష్టనేమిః–దధాతు** శుభమును మాకు గరుత్మంతుడు అరిష్టములు నివారించువాడై ఇచ్చుగాక!

**స్వస్తి నః బృహస్పతిః దధాతు**–శుభమును మాకు బృహస్పతి ఇచ్చుగాక!

ఉపనిషత్తులూ, వేదసూక్తాలు చదవటం ప్రారంభించేప్పుడూ, ముగించేప్పుడూ శాంతి మంత్రాలు చదువుతారు. పై మంత్రం యజుర్వేదంలో శాంతి మంత్రం (25–21). చివర్లో మూడుసార్లు చెప్పే శాంతి మంత్రాల వల్ల ఆధ్యాత్మిక (శారీరక, మానసిక సంబంధమైనవి), ఆధిభౌతిక (ఇతర ప్రాణుల వల్ల కలిగేవి), ఆధిదైవిక (దైవ నిర్ణయం వల్ల కలిగేవి) క్లేశాలు తొలగిపోతాయట.

వేదమంత్రాలు వేదపండితుల దగ్గిర నేర్చుకోవాలి. గ్రంథాలనించీ వీటిని నేర్చుకొంటే, ముద్రా దోషాల వల్లా, ఉచ్చారణ దోషాల వల్ల దుష్ఫలితాలు కలగవచ్చుంటారు పెద్దలు.

పై అనువాదాలు మంత్రార్థం గురించి పైపై అవగాహన కోసం మాత్రమే చెప్పబడ్డాయి. ఇవి చాలావరకు రామకృష్ణ మఠం, చెన్నై వారి 'సస్వర వేదమంత్రాలు' పుస్తకంలో ఇవ్వబడ్డ మంత్రాలనూ, అర్థాలనూ అనుసరించాయి.



Rojuko Slokam

Malladi Hanumantharao

**మల్లాది హనుమంతరావు** ఆంధ్ర సంస్కృత సాహిత్య సంప్రదాయాలను కొత్త తరాలకు సరళమైన వాడుకభాషలో పరిచయం చేసే ప్రయత్నం కొన్ని సంవత్సరాలుగా సాగిస్తున్నారు. అందులో భాగంగా **రోజుకో శ్లోకం, రోజుకో పద్యం, అద్వైత గురుపరంపర, ఆముక్త మాల్యద పరిచయం, నీతిచంద్రిక, చమత్కార శ్లోక మంజరి** మొదలైన పుస్తకాలు వ్రాశారు. సంస్కృత పంచ కావ్యాలను వాడుక తెలుగు భాషలో పరిచయం చేసే అయిదు పరిచయ పుస్తకాలను త్వరలో విడుదల చేయబోతున్నారు.

**రోజుకో శ్లోకం** గురించి ప్రముఖులు వెలిబుచ్చిన అభిప్రాయాలు కొన్ని:

'ఈ గ్రంథం మనమందరం ఆనందంగా ఆస్వాదించదగ్గది'

**డా॥ పోరంకి దక్షిణామూర్తి**

'మంచి పుస్తకం... చిత్తశుద్ధితో చేసిన ప్రయత్నం... అభినందనీయం'

**ఈనాడు దినపత్రిక, 08-02-2009**

'...ప్రతి శ్లోకానికి నేటి కాలమాన పరిస్థితుల కనుగుణమయిన వ్యాఖ్యానం అందించడం ఎంతో మెచ్చదగ్గ విషయం...'

**సాక్షి దినపత్రిక, 16-02-2009**

'...ప్రతి శ్లోకానికి సవివరమైన అర్థాన్నిస్తూ... సరళంగా సాగిన ఈ రచన పాఠకులను తేలిగ్గా ఆకట్టుకొనేట్టుగా ఉంది...'

**ఆంధ్రజ్యోతి దినపత్రిక, 15-02-2009**

'అరుదైన గ్రంథం... ఈ శ్లోకాలు మననం చేయడం వల్ల మనం అనవసర విషయాల గురించి హైరాన పడకుండా జీవితంలో పురోగతి వైపు అడుగేస్తాం...'

**కుముదం భక్తి స్పెషల్, ఫిబ్రవరి, 2009**

'...ఏ పుట తిరగవేసినా రసభరితమైన విందు...'

**ఆరాధన, ఏప్రిల్, 2009**

'...మంచి ప్రయోగం ఇది... ఇలాంటి సంకలనాలు అనేకం రావాలి...'

**ఆంధ్రభూమి సచిత్ర వారపత్రిక, 09-04-2009**